# ఆంధ్రసచిత్రవారపత్రిక



24-3-72

50 పైసలు

చిరకాలం పరిపూర్ణమయిన వెలుతురు కొఱకు

**క్రాంప్టన్** సూపర్ గోల్డ్ ఫిట్టింగ్స్ మరియు
యితర ఉపకరణములతో కూడిన
**క్రాంప్టన్** ఫ్లోరసెంట్ ట్యూబ్ లైట్లు వాడండి

- క్రాంప్టన్ గ్లో స్విచ్ స్టార్టర్లు స్విచ్ వేసిన మరుక్షణంలో నిశ్చయంగా దీపాన్ని వెలిగింపచేస్తాయి.

- ప్రత్యేకమయిన రసాయనిక ప్రక్రియలవల్ల లోహం తుప్పు పట్టకుండా, ఫిట్టింగ్ చిరకాలం సరిక్రొత్తగా కనిపిస్తుంది. ఉత్తమంగా స్టౌ ఎనామిల్ చేయబడిన తళతళలాడే తెలుపు రంగుపై పసిడి రంగు గీతలు. పైకి కనిపించని వైరింగ్.

- చిరకాలపు మన్నికకు ప్రత్యేకంగా నిర్మించబడిన ఎలక్ట్రోడు మరియు ప్రశస్తమయిన కోటింగ్.
- ప్రత్యేకంగా తయారు చేయబడిన ఫ్లోరసెంట్ పౌడరు వల్ల చిరకాలం ఎంతో వెలుతురు.

- రెసిన్‌తో నిండిన క్రాంప్టన్ పోలియెస్టర్ బెలాస్ట్ వల్ల మిక్కిలి వెలుగు మరియు ట్యూబ్‌కు దీర్ఘాయుర్దాయం

విశ్వసనీయమైన
విద్యుత్ పరికరాలకు
పెట్టిన పేరు—క్రాంప్టన్

**Crompton Greaves**
LIMITED

AIYARS-CG.153 TL



వరదరాజా ప్రొడక్షన్స్
రంగన్న శపథం
ఈస్ట్‌మన్ కలర్
సంగీతం: ఎం.ఎస్. విశ్వనాథం
దర్శకత్వం: యస్. రామనాథ్
తప్పక చూడండి!
శ్రీఫిలింస్
Ars.Murty
NVRR

# ఉత్తరాలు

## గరీబీ హటావో

ఈ కింద కొన్ని పదార్థాలు వెలలు ఇస్తున్నాను. 1961 నుంచి 1971 దాకా ఎంతపెరిగాయో తెలుస్తుంది! మన 'గరీబీ'ని హటావో చేసినా చెయ్యకపోయినా 'గరీబీ'యే మనని 'హటావ్' చేసే సేట్లు ఉంది.

| | 1961 | 1971 |
|---|---|---|
| ఉప్పు (కి.గ్రా) | 00.19 | 0.40 |
| టీ (కి.గ్రా) | 10.00 | 13.00 |
| కిరసనాయిల్ (లీటర్) | 00.18 | 00.24 |
| పప్పు (కి. గ్రా) | 00.88 | 02.25 |
| బియ్యం (కి. గ్రా) | 01.10 | 01.50 |
| | 1969 | 1970 |
| వనస్పతి (కి. గ్రా.) | 04.00 | 06.00 |

ఏ. వి. రావు (మదరాసు.)

## కథలు

కె. రఘురామంగారి కథ 'గోపాలం గేస్‌పొయ్యి కొన్నాడు' చాల బాగుంది. ఈ కథ చదివిన తరువాత మేము గేస్‌పొయ్యి గూర్చి పడ్డ తిప్పలు జ్ఞాపకం వచ్చింది.

పోట్నూరు ప్రకాశరావు, (బరంపురం).

* * *

ఈవారంలోవున్న కథల్లల్లో కాశీనాథ కె కాశీనాథ వ్రాసిన 'శ్రీపతి కథ' చాలాబావుంది. తానెవరి కొడుకునో అన్న సంగతి తెలిసిన రత్తమ్మ ఎదుట వున్నా ఆమె ఆ రహస్యం వున్న కవరు ఇచ్చినా అది విప్పి చదవకుండా అలుసుకోకుండా వుండడానికే నిశ్చయించినందుకు శ్రీపతిని మెచ్చుకోవాలి. ఒకరి కొడుకును అని తెలిస్తే ఒకొకరి మనస్సుకు దెబ్బ తగులుతుందని తలచాడు.

'స్వయం కృతం' నేటి పరిస్థితులకు అనుకూలంగా వ్రాసారు. కొందరు పైకి పెద్దమనుషుల్లా కనిపిస్తూ లోలోపల మోసగాడిలా జీవితం గడుపుతుంటారు. అటువంటి కోవకి చెందిన వాడే రామారావు.

యస్. యుగంధర్, కుమారి పల్లవి (కరీంనగర్)

* * *



గత వారపత్రికలో ప్రచురితమైన 'సంధ్య' కథ నన్నెంతో ఆకర్షించినది. కథలో వాస్తవికత ఉట్టి పడుతోంది. సంధ్య దీపావళి కథను విమర్శించిన తీరు అతి సహజంగా ఉంది.

పత్రికలో ఉత్తరాలు శీర్షికకు ఇంకొంచెం స్థలం కేటాయిస్తూ, కొన్ని పేజీలు ఎక్కువ చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ముమ్ముందు 'సంధ్య' లాంటి కథలు రావాలని ఆశిస్తున్నాను.

పి. జగదీశ్వర్‌రెడ్డి (వరంగల్)

* * *

3—3—72 వారపత్రికలోని 'గోపాలం గేస్ పొయ్యికొన్నాడు' కథ, వ్యాపారాభివృద్ధికోసం ఆయా సంస్థలు ప్రకటనలు ఏ విధంగా చేస్తారో అలాగే గేస్‌పొయ్యి అడ్వర్టైజుమెంట్‌లా ఉంది. ఆ కథలో ఏ మూల చూచినా గేస్‌పొయ్యి వివరాలే!

కరణం శివానందరావు (బొబ్బిలి)

* * *

"ఇచ్చట మనుష్యులను కొనవచ్చు" అన్న కథ మన పత్రికలో చదివాక ఈ ఉత్తరం వ్రాయవలసి వచ్చింది. అందులో "కేరళ నుంచి ఆడపిల్లల్ని ఏదో ట్రెయినింగ్ అన్న మిషతో విదేశాలకు పంపిస్తున్నారట. వాళ్ల బ్రాంచేదో యిక్కడ" అన్న వాక్యం చదవడంతో మాకు చాలా ఆవేశం, ఆగ్రహం కలిగింది. ఎవరో బుద్ధిహీనులు లేవదీసిన పుకారును గోరంతను కొండంతలుగా చేసి తప్పుకున్నారు మత విద్రోహులు. ఆ విషయమై వాటికన్ (రోమ్) వో కమిటీని నిర్ణయించి "ఈపుకారు పుకారే— రవ్వంత కూడ సత్యంలేదని" ఋజువు చేశారు. విదేశాలకు వెళ్లిన యువతులే అందుకు సాక్ష్యం. దిన పత్రికలలో కూడ అన్ని వివరాలు ప్రచురించారు. ఈ విషయాలు తెలిసికోకుండ ఆ వాక్యం వ్రాయడం "రచయిత" పొరపాటుగా భావిస్తున్నాము.

పి. మేరి అంజలిన, టి నిర్మల మేరి, టి. మేరి సులోచన, టి. మరియజ్యోతి, టి. మరియ మహిమ, (కర్నూలు)

* * *

సత్యం మందపాటిగారు రచించిన "జీరో" కథ నన్ను చాలా ఆకర్షించినది. "యుద్ధం" కథ నేటి పల్లెటూరులలో జరిగే వాస్తవాన్ని చక్కగా చిత్రించింది.

జి. సురేందర్‌రెడ్డి, (కుమార్‌పల్లి)

* * *

'యుద్ధం', 'నిరుద్యోగపర్వం' కథలు చాల బాగున్నాయి. రచయితలకు నా అభినందనలు. క్రొత్త రచయితలకు అవకాశము కల్గించాలని నా కోరిక. అసలు పత్రికలో వారానికి క్రొత్త దనము తగ్గిపోతున్నది. విద్యార్థులకు అవకాశము కల్గించాలని నా ప్రార్థన.

చీకటి జగన్నాధరావు, (కారుమూరు).

* * *

అరిగే రామారావుగారి కథ 'మనసు గీసిన బొమ్మ' చదివాను. మనసుని ఆహ్లాదపరిచి, రమణీయంగా స్పర్శించి పిల్లగాలిలావీచి— నిండైన తృప్తి నిచ్చింది.

పైడిపరపు సూర్యం, (కొత్తపల్లి.)

* * *

49వ పేజీలోని (మాయకథ) మొదటికాలంలో 12వ లైను, డ్రైవర్ 'రన్‌రన్' అని గంట కొట్టాడు అని ఉండటం అచ్చు తప్పుకాదు, రచయిత తప్పుకాదు. అది ఎంత రైటో తెలుసుకోనక పోవటం అది వ్రాసిన హైదరాబాద్ పాఠకుడి తప్పు. సైట్ సర్వీసులో డ్రైవరే ఆన్ రన్ అని కొట్టును.

అనూరాధ, వసుధ, శివానంద్, ఆత్మారాం, (గుంటూరు).

## ముఖచిత్రం

వన్నెలు చిలికే నీ వయ్యారం
వలపులు విరిసే నీ సింగారం
అలలై ఊగాయి నా మదిలోన
విరిచిపోయాయి నా హృదిలోన.

అబ్బ నటి భారతి ముఖచిత్రం చూసేసరికి నాలో ఈ రవ్వంత కవిత్వాన్ని వెదజల్లింప చేసిందంటే నమ్మండి!

హెచ్. రజనీకాంతారావు, (సికిందరాబాదు).

* * *

ఈవారం ముఖచిత్రం త్రిప్పగానే గుండె ఝల్లు మన్నది. శృంగారాన్ని ప్రచురించి సొమ్ము చేసుకునే ప్రచురణకర్త "మారిస్" అడుగుజాడల్లో మీరు కూడా ప్రయాణం చేస్తున్నట్లుంది, రెండవ మూడవ కవర్ పేజీలు చూస్తే.

ఉదయ్, (కాకినాడ. వ.)

* * *

రెండవ అట్టలో మీరు ఈ మధ్య సెక్స్ బొమ్మలు వేస్తున్నారు. అటువంటి బొమ్మలు వేయవద్దని మా మనవి.

ఎస్. రమేష్‌బాబు, (కర్నూల్)

* *

10—3—72 న వెలువడిన 'సాధన' ముఖచిత్రం ఏమి బాగాలేదు. దానికన్నా ముఖచిత్రం వెనుక వేసిన మోడల్ అమ్మాయి ఎంత బాగుంది!

బి. వి. రమణారావు, (కావలి)

* 

10—3—72 ఆంధ్రపత్రిక ముఖచిత్రం నా అభిమాన నటి సాధన చాల బాగుంది.

సత్యనారాయణ, (బాదిలి).

* * *

## క్రొత్త

# రెమ్కో జుగల్‌బంధి






## ఈ రేడియో విశిష్టత ఏ రేడియోకు రాదు

అత్యధిక "అవుట్‌పుట్": 10 వాట్‌లు
తక్కువలో తక్కువ ధ్వని
ఆటంకములు : 75% అవుట్‌పుట్ 1%
ధ్వని ఆటంకములు




3 స్పీకర్‌లతో "క్రాస్-ఓవర్" సిస్టమ్
5 బ్యాండ్లు, 7 వాల్వ్‌లతో, సున్నితమైన ట్యూనింగ్
వెల రూ. 875/- (పన్నులు అదనము)

**రేడియో & ఎలెక్ట్రికల్స్**
**మాన్యుఫాక్చరింగ్ కంపెనీ లిమిటెడ్**
మైసూర్ రోడ్, బెంగుళూరు-26

మైసూర్, గోవా, తమిళ్‌నాడు, కేరళ, మరియు
పాండిచెరికి డిస్ట్రిబ్యూటర్లు:

**హెగ్డే & కంపెనీ**
గుప్త మార్కెట్, కెంపెగౌడ రోడ్, బెంగుళూరు-9
మరియు అగర్‌చంద్ మేన్షన్, 35, మౌంట్ రోడ్, మద్రాసు-2

SISTA'S-RR-306 TL

ఈ వారం ముఖచిత్రం సుందరి సాధన చాలా బాగుంది. అప్పుడప్పుడు ఇలా హిందీ తారల ముఖ చిత్రాలు కూడా వేస్తుంటే బాగుంటుంది.

కుమారి బి. ప్రేమలత, మిస్. పి. విద్యావతి, శ్రీమతి బి. విజయగౌరి, (పార్వతీపురం.)

## సీరియల్

'పిల్లలతో ప్రేమయాత్ర' సీరియల్ అయిపోయినందుకు విచారంగా ఉంది. త్వరలో పరిమళా సోమేశ్వర్‌గారు ఇంకో మంచి సీరియల్ అందిస్తారని ఆశిస్తున్నాము. 'పిల్లలతో ప్రేమయాత్ర' ముగింపులో ఒక లోపం కనిపిస్తోంది. అదేంటంటే భార్యాభర్తలిద్దరికీ ఒకేకల వచ్చింది. ఇది అసంభవం. అయినా ఈ సీరియల్ చాలాబాగుంది. 'గూడుచేరినపక్షులు' సీరియల్ కూడా మాకు బాగా నచ్చింది.

ఎస్. రమేష్‌బాబు, (కర్నూలు)

*　　　*　　　*

దుర్గం చంద్రశేఖరంగారి 'గూడు చేరిన పక్షులు' సీరియల్ నవల ఈ వారంతో ముగిసింది. చివరన రేఖకు, ప్రసాదుకు, రాధకు, సూర్యానికీ వివాహాలు జరిగాయి అని వ్రాశారు. సూర్యానికీ, రాధకీ అంతకు పూర్వమే వివాహం జరిగిఉంటుంది కదా!

ఇలాంటి చిన్న చిన్న పొరపాట్లు తప్పించి, నవల చాలా బావుంది. మొత్తానికి కొత్తశైలిలో అన్ని పక్షులనూ గూటికి క్షేమంగాన చేర్చి రచయిత గార్కి అభినందనలు.

పిండి వేంకట విజయకుమార్, (హైదరాబాద్).

*　　　*　　　*

10—3—72 సంచికలో ప్రచురించిన 'గూడుచేరిన పక్షులు' చివరి భాగంలో ఒకచోట —రామనాథంగారు వెళ్ళి వియ్యపురాలిని తీసుకవస్తానంటాడు. అప్పుడు విశ్వం 'ఏతయినా మగపిల్లవాని తల్లిగదా మనం తలవగ్గవలసిందే' అంటాడు. దానికి సమాధానంగా 'మీరు రసికులే! సుమా' అని రామనాథం అంటాడు. ఈ సందర్భములో 'రసికులే' అనే మాట ఎంతవరకు తగినది? దానికన్న 'మాటకారులే' అనో ఇంకేదైనా అనో వ్రాసివుంటే తగినట్లుగా ఉంటుంది. ఆ సందర్భంలో రచయితగారి ఉద్దేశ్యం అర్థం కాలేదు.

—కె. గోపాలకృష్ణ, (తిరుపతి.)

## వ్యాసాలు

10—3—72 సంచికలో కె. రామలక్ష్మిగారి 'మాటమార్పు' శీర్షిక చాలా బాగుంది. ఇటువంటి నమ్మలేని నగ్న సత్యాలు మానవుడి జీవితంలో ప్రతి క్షణం ఏదో ఒక విధంగా మెదులుతూనే ఉంటాయి. హగ్‌హెన్ వంటి నగ్న చిత్రాలు ఎందుకు ప్రచురిస్తారో అర్థం కావడం లేదు.

కె. విమలకుమారి, (తెనాలి).

*　　　*　　　*

రామలక్ష్మిగారి 'పావభీతి' ప్రతిస్త్రీ ఒకసారి తనకు తాను ఆత్మ విమర్శ చేసుకునేటట్టు చెప్పిన నగ్నసత్యం.

తమ్మినీడి అనంతలక్ష్మి సత్యవతి, (యలమంచిలి)

●　　　●　　　●

## ఉత్తరాలు

ఆంధ్రప్రాంతం పారిశ్రామికంగా వెనుకబడియుంది అని ప్రతి మంత్రిగారు చెప్పేవారేగాని పరిశ్రమల స్థాపనకు కృషి చేస్తున్నవారు జీరో. తమ స్థానం గట్టి పరచుకోవడంలోనే వారికి సరిపోతుంది. ఇక ఇటువంటి విషయాలు చూడడానికి వారికి తీరిక ఎక్కడిది? శ్రీ సి. హెచ్. మదన మోహనరావు అన్నట్లు తమ ప్రాంతానికి న్యాయం జరగడానికి ఆంధ్రప్రాంతం వారందరూ కృషి చేయాలి.

జి. ఆర్. రాజారావు, రామకృష్ణ గైక్వాడ్, (ఆదోని).

## గేయాలు

శ్రీ కొప్పర్తి రామారావుగారు వ్రాసిన ,కవిత నేస్తం''— విషయపూరితమై, మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగించింది. ఇంకనూ వీరికవితలు మన పత్రిక ద్వారా పాఠకులకు అందిస్తారని ప్రగాఢమైన ఆకాంక్ష.

గరికపాటి శేషగిరి శర్మ, (ఏలూరు).

*　　　*　　　*

తే. 3—3—72 ది శుక్రవారం వారపత్రికలో ''మాతృ ప్రణామము'' అను గేయము ప్రచురించిన మీకు, వ్రాసిన అక్క సుజాతగార్కి నమస్కారములు.

కారణం ఒక్కటే!

తే 26—11—71 ది. ఉదయం 6 గంటలకు మా అమ్మగారు తన 50 వ ఏట నా అక్కలనీ, అన్నదమ్ములను, మా నాన్నగార్ని— మనుమలనీ విడి పార్వతీదేవి కొలువున చేరినది. మా అమ్మని తలచుకొని బాధపడుచున్న మాకు మీ గేయము చదువగనే— ధైర్యం పుంజుకొనుటకు— నీడవలె— సుజాతగారిచేత మా అమ్మే వ్రాయించి యుంటుందని పొంగిపోయేము. అందుకు సందేహం లేదు.

మీ గేయము చదివిన మాలాటి (తల్లిని కోల్పోయిన) పిల్లలకు— ''ముళ్ళబంటి దుఃఖములో మోకాలుబంటి సంతోషము గల్గించుచునుటకు సందేహము లేదు.

ఆ గేయం నిత్యం చదువుకొను చున్నాము.

ఇవటూరి కాత్యాయని, (విజయనగరం).

*　　　*　　　*

రాజేష్‌ఖన్నా ముఖచిత్రం కల పత్రికలో శ్రీ కొప్పర్తి రామారావుగారి విరచితమైన 'నేస్తం....' గేయం నన్నెంతగానో ఆకట్టుకుంది. గేయం భావగర్భితంగా వుంది.

—శింగులూరి శ్రీరాములు, (ముదునూరు)

---

### గమనిక

ఈ సంచికలోని 46 వ పేజీలో ప్రచురించిన 'హరేకృష్ణ ఉద్యమం' వ్యాసం రాసినవారు శ్రీ మహేష్. పాఠకులు గమనించ గోరుతున్నాము.

---


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 24—3—72

శ్రీ విరోధినామ సం॥ చైత్రమాసం॥ శు॥ నవమి

సంపుటము : 65 సంచిక : 31

స్థాపితము :
1908

సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1

విడిప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31.20 |
| 6 మాసముల చందా | 15.60 |
| 3 మాసముల చందా | 7 80 |


## విషయానుక్రమణిక

చౌ-మావోల కంపెనే తస్మాత్ జాగ్రత్త!
నెహ్రూ గారి ఆత్మ
చౌ-నిక్సన్ సమావేశం
ఇతరుల మీద అతిగా ఆధారపడటం వల్ల నాకు జరిగిందేమిటో నువ్వు తెలుసుకో!
యాహ్యా
ఆహా, ఎన్నికల వల్ల నేను ధనవంతుడి నయ్యాను!
ప్రభుత్వ రంగం
మన నష్టాలు పూడటానికి ఈ పళ్లతోటల్ని కూడా జాతీయం చెయ్యాలి
ప్రయివేటు రంగం




'సిరికి చెప్పలేదు. ఆయుధాల్ని చేత ధరింపలేదు. పరివారాన్ని వెంట తీసుకు వెళ్లనేలేదు... ఎక్కడి వక్కడే వదిలేసి... వున్నవాడు వున్నట్టె కదిలి ... ఆహాహ! కరుణాంతరంగుడని, దయా సముద్రుడని, ఆర్త త్రాణ పరాయణుడని వుత్తనే అన్నారా, ఆ మహావిష్ణువుని?...'

భాగవతంలో ఆ పేజీ చివర్న మడిచి— పుస్తకం మూసి—కళ్ళద్దాలు తీసి—చెమ్మ గిల్లిన కళ్ళను పంచెకొనతో ఒత్తు కున్నారు, రాజశేఖరంగారు. కళ్ళద్దాల్ని పంచెతో శుభ్రంగా తుడిచారు. పడక కుర్చీలో పూర్తిగా చేరబడి, అలవాటు ప్రకారం—'...హే ఆర్త త్రాణ పరాయణా... హాయ్...' అని ఆపలించారు. నుదుటిమీద చిక్కపడిన గీతలు చిత్రంగ చలిస్తున్నయ్.

వీధిలో ఎండజోరు హెచ్చుగావుంది! వీధి వరండాకి వేసిన కటకటాల్లోంచి ఎండ చొచ్చుకుని వచ్చి నేలమీద డిజైన్స్ గీసింది. ఎండతాపాన్ని భరించలేక కాబోలు రెండుకాకులు పారిజాతం చెట్టు కొమ్మమీద ముడుచుకు కూచున్నాయి. రాజశేఖరంగారి పరిభాషలో చెప్పాలంటే—'ఎక్కడా తుపాకీ వేస్తె గాల్లేదు'! ఆ పక్క మెయిన్‌రోడ్డు మీంచి వెళ్లేబస్సుల శబ్దాలు, దూరంగా 'జాలీ ఐస్‌క్రీమ్' వాడికేక తప్పితే దాదాపు ప్రకృతి అక్కడ నిశ్శబ్దంగానే వుంది.

'ఆహాహా! ఏం వర్ణనా! ఏం కవిత్వం! ఒక్కోపదం అక్షర లక్షలు చేస్తుంది గదూ! అసలివి మాటలా? తేనెవాకలుగాని! నవ రసాలూ రంగరించిపోసి, సృష్టిలో మాధుర్య మంతా గుమ్మరించి తయారు చేశాడ, ఏమన్నారా, ఈ కావ్యాన్ని? అమ్మాయ్! గ్లాసుడు మంచినీళ్ళ పట్టా... అబ్బబ్బా యేంవుక్క! వేదవుక్క! తినేస్తుంది'

నేలమీద పడివున్న విసనకర్ర తీసి విసురుకుంటూ ఇంట్లోకి చూస్తున్నారు రాజశేఖరంగారు. పుస్తకాన్ని తెరిచారు కాని దృష్టి అక్కడ నిలవటంలేదు. మనసు పోతనామాత్యుడి కవితా మకరందాన్ని ఆస్వాదించటానికి కుతూహల పడటంలేదు. ఇంద్రియాలన్నీ ఒకే కోరికమీద నిలిచి వున్నాయి. చూస్తున్నారు, రాజశేఖరంగారు, మహావిష్ణువు దర్శనంకోసం మత్తేభంలా! కళ్ళు వెడల్పు చేసుకుని, మెడసారించి, ఇంట్లోకి......

'పలకడేం అమ్మాయి? ఏం చేస్తోంది చెప్మా? పెరట్లో దబ్బు దబ్బున శబ్దం వినిపిస్తోంది. బట్టలుతుకుతూందిగాబోను.'

ఇప్పటికి డజనుమంది చాకలాళ్ళని మార్చేరు. డబ్బులు వదిలి పోవడమేగాని తమకి సౌఖ్యంలేదు. విసిగిపోయి ఇంట్లోనే రేవు పెట్టుకుంటున్నారు, కాంపుడే రెక్కలు ముక్కలు చేసుకోవాలి అన్ని పన్లకీ. దమయంతికి వండి వడ్డించేసరికి నడ్డి వాలి పోతుంది. అంతంత మాత్రపు ఆరోగ్యంతో ఎలాగో ముగ్గురు పిల్లల్నికని, ఇన్నాళ్ళ సంసారం చేసినందుకు దమయంతిని అభినందించాలి! పెద్దవాడు కాలేజీకి పోతాడు. రెండోవాడు బడికిపోతాడు. కామేశ్వరి ఇంటిచాకిరీ చేస్తూనే మెట్రిక్ పాసయింది సప్లిమెంటులో! ఆ తర్వాత ఇక చదవనంటే వూరుకున్నాడు తను. తాటి చెట్టెక్కిన వాణ్ణైనా ఇక ఎక్కలేనని మధ్యలో ఆగిపోతే బలవంతంగా తొయ్యగలంగాని — చదవనన్న వాణ్ణి బలవంతంచేసి చదివించలేం! మగ పిల్లలు వాళ్ళ చదువులు. పాపనిడి! శలవు రోజుల్లో కూడా వూరిమీద తిరగడం! గుండీ వూడినా కాంపుడే కుట్టి పెట్టాలి! "రేపు అది అత్తారింటికిపోతే ఎవరు చేస్తార్రా మీకు చాకిరీ?' అంటే— 'అన్నయ్యకి పెళ్ళాం వచ్చేకే నేను అత్తారింటికి వెళతానులే, నాన్నా' అని వాళ్ళని వెనకేసుకువచ్చేది కాంపుడు! అన్నా, తమ్ముళ్ళంటే దానికంత అభిమానం! గుర్రంలా ఎదిగి కూచున్న పిల్లని అది పెద్దంటే మాత్రం సంబంధాలు చూడకండా ఎలా ఉంటాడు? చూసినవాట్లో రెండు కట్నం దగ్గిర, లాంఛనాల దగ్గిరా ఫేలయినా, మూడోది కుదిరింది. బహుశా మూడు మాసాల్లో ముహూర్తం మంచిది కుదిర్తే అయిపోయినట్టే!

"గోవిందా! యదునందనా! ఇది రాదేం? గొంతు ఆర్చుకుపోతూంది! లేద్దామంటే కాళ్ళు పట్టేశాయి. ఏమిటో! ఈ పెద్ద వయసుకాదుగాని. . . .లేస్తే కూచోలేడు. కూచుంటే లేవలేడు. వయసుడిగిపోతే వాతం వచ్చి చేరిపోతుంది వంట్లో. మొన్న ఆస్పత్రికివెళ్ళి బి. కాంప్లెక్స్ మాత్ర లిమ్మని వెళ్ళిన డాక్టర్ని అడిగితే—"స్టాకు లేదు సార్" అని చెప్పేశాడు. అతను తన కళ్ళముందే ఎం. బి. బి. ఎస్. చదివి, హౌస్ సర్జన్‌చేసి, ఉద్యోగంలో ప్రవేశించాడు! స్టూడెంటు పీరియడ్‌లో ఎంత వినయం కనపరిచేవాడో ఇప్పుడంత దర్జా ఒలకబోస్తున్నాడు! 'స్టాకులేదట!' పదవిలో వున్నవాడి దగ్గిర ఒక పదం, బైట కెళ్ళిన వాడికి మరోమాట! అదీ అచోట అనవాయితీ!! ముప్ఫయి అయిదేళ్ళ చాకిరీ చేశాడు అక్కడ. ఏం లాభం? ఎవ్వరూ విశ్వాసం చూపరు! అక్కడి సేవకిచిహ్నం ఫలానా రాజశేఖరంగారు ఫలానా ఆస్పత్రికి హెడ్ గుమాస్తా అన్న చెక్కబోర్డు (రిస్టార్డ్ తో కలిపి!) ఒకటే; ప్రతిఫలాలు (లేక కానుకలు) చేతికర్రా, మఫ్లరూ, భాగవతం పుస్తకమూ నూ. టాబ్లెట్లూ, ఇంజెక్షన్లూ లేకపోతే పోయె చివరికి ఇంత కార్మినేటివ్ మిక్చరు కూడా కరువే అక్కడ! ఎవర్ని ఏమనగలడు? ఏముంది హక్కు ఇప్పుడు? విసుగ్గా రోడ్డుమీదికి వచ్చి గొడుగు విప్పాడు. అడుగులువడటం కష్టమయింది. చిరిగిన చెప్పుల్లోంచి పాదాలకి కాలిన రోడ్డు తగిలి చుర్రుమన్నాయి. గాడ్పు ఆ చెవిలోంచి ఈ చెవిలోకి కొడుతూంది! 'ఎక్కడా తుపాకీవేస్తే పిల్లగాల్లేదు' రోడ్డు దాదాపు నిర్మానుష్యంగానే వుంది. బస్సులుమాత్రం తెగ తిరుగుతున్నాయి. ఇంటిదాకా ఈ కాళ్ళీడ్చుకుంటూ ఎలా వెళ్ళగలను భగవంతుడా! అని భయపడ్డాడు. గొంతు వో పక్కన ఆరిపోతూంది. ఆస్పత్రిలోనయినా ఇన్ని నీళ్ళడిగి తాగేడుకాదు. ఈ శోషతో ఇలా నడిస్తే తోవలో చచ్చిపోతాడేమో! ప్రాణం పోవడానికేముంది? ఆ యింతా—ఒక్క క్షణం చాలు. రెండు వారాల కిందట పక్కింటి డాక్టరుగారి అబ్బాయి బడికి వెళ్తూ బస్సుకిందపడి చచ్చిపోయేడు! శుభ్రంగా—ఆరోగ్యంగా — అందంగా—చురుగ్గా వున్న కుర్రాడు. ప్చ్! వాడికంతే ఆయుర్దాయం రాసివుంది. వాడి మరణం అలా వుంది! తనకి? ఇప్పుడిక్కడిలా రాసిపెట్టివుందేమో? దాహంతో—పచ్చి మంచినీళ్ళు లేకుండా—నడి రోడ్డు మీద—మండు ఎండలో—చుట్టూ పిట్టయినా లేకండా!! ఇలాకాక పోయినా—పరధ్యాన్నంగా నడుస్తున్నవాణ్ణి ఏ బస్సొచ్చి గుద్దేస్తే. చావుకేముంది? అమ్మో! భగవంతుడా' నుదురంతా చెమట పట్టింది. చొక్కా చెమటతో తడిసి ముద్దయింది. కాళ్ళలో సన్నగా వణుకు!

కొడుకులూ, కూతురూ, భార్యాచుట్టూ చేరివుండగా మరణించే అదృష్టం తనకి లేదు. వాళ్ళ మాటలూ, శోకాలూ వినే యోగంలేదు కాబోలు! పోయింతర్వాత ఏదెలా జరిగితే తన కేం తెల్సివస్తుంది? అని బాధపడ్డాడు. దూరంగా రిక్షా కనిపిస్తే బలవంతంగా గొంతు పెకల్చుకుని కేక వేశాడు. వాడు వచ్చి ముప్పావలా అడిగాడు. బేరమాడబోతే విసుగ్గా కదిలి వెళ్ళిపోయాడు. ముసలివాళ్ళని చూస్తే ప్రతీ వెధవకీ చులకనే అని తిట్టుకున్నాడు. కుళాయి కనిపిస్తుందేమో అని చూశాడు. ఆ రోడ్డు పక్కన కుళాయి వుంది. నీళ్ళు పడుతున్నాయి, సన్నని ధారగా......అయితే దాని చుట్టూ బిందెలు, కుండలు, తప్పేలాలు, కావిళ్ళు గుట్టపోసి ఉన్నాయి! 'నాకంటే నాక'ని ఆడాళ్ళు యుద్ధాలు చేస్తున్నారు. ఒక మొగుడి గురించి ఇద్దరు సవతుల మధ్య కూడా అంత కసిగా యుద్ధం అవదు! ఒక ఆడదానికోసం ఇద్దరు మగాళ్ళు కూడా అంత ఘోరంగా కొట్టుకు చావరు! బిందెడు నీళ్ళకి అక్కడ దేవలోకంలో అమృతానికున్న వెల్యూ వుంది! భూలోకంలో కాఫీకున్న ప్రిఫరెన్సువుంది! ఇండియాలో బంగారానికున్న విలువుంది! స్వాములోర్లకున్న డిమాండు వుంది! సినిమా యాక్టర్లకున్న పరపతివుంది! ఎంత చక్కని సీను అది! అనుకున్నాడు. కవి కాకుండానే తనకి ఇన్ని వూహాలు వస్తున్నాయే! వోపిక లేకపోయినా ఇంత చక్కగా అభివర్ణించుకున్నాడే! అని కాస్త ఆశ్చర్యపోయాడు. అత్యవసరంవస్తే ఆయుధాలుకింద మార్చుకోడానికి అమర్చుకున్న ఆ పాత్రలన్నింటితో కూడిన—ఆ రణరంగంలోకి—ఆ పద్మవ్యూహంలోకి చొరబడేందుకు తను అభిమన్యుడుకాడు. క్రిక్కిరిసివున్న బస్సులోకి—ఇలాంటి స్థితిలో కుళాయి దగ్గరికి—ఫస్ట్‌డే సినిమాకి చొచ్చుకుపోయే సాహసం వోపికా తనకి వయసులో ఉండేవి. ఇప్పుడు కోరలు వూడిన నాగు—పులుపు చచ్చిన చింత— వోపిక ఉడిగిన ముక్కిలెద్దు. . .

ఐస్‌ఫ్రూట్ కుర్రాడు బండీ తోసుకుంటూ వెళ్ళిపోతున్నాడు. నోరువూరింది అమాంతం మూడు ఐస్‌ఫ్రూట్‌లు

కొనేసి తినేద్దామనుకున్నాడు. దాహం తీరుతుంది. చిన్నప్ప డెప్పుడో అవితిన్నాడు. మళ్ళీ ఆ రుచి చూడలేదు. ఈ మధ్యకాలంలో అనేక రుచులు చూశాడు. పెళ్ళి—పిల్లలు—పురుళ్ళు—పుణ్యాలు రోగాలు —మందులు—ప్రమోషన్లు— మీద వాళ్ళచేత మందలింపులు — కష్టసుఖాలు, ఎత్తు పల్లాలు....ఒక్కసారి చిన్నతనం వచ్చేస్తే ఎంత బావుంటుందో?! ఆ దశలో ఏబాదర బందీ లుండవుగదా! మళ్ళా ఆడుకొంటూ ఐస్ ఫ్రూట్‌లు కొనుక్కు తింటూ. . .నోరు పూరి, నాలికతో పెదాలు తడిపాడు. ఎవరైనా చూసి ఏమిటీ పని చిన్నపిల్లాడా అని అనుకుంటారేమోనని సిగ్గుపడిపోయాడు. ఇలా అనుకొంటూండగానే ఐసుక్రాడు కాస్త చూపు కందనంతదూరం, పిల్చినా వినబణ్ణంత దూరం వెళ్ళిపోయాడు. మళ్ళా చావుమీద భయం పుట్టుకువచ్చింది. ఇవాళ దమయంతి వంకాయ నూలు పప్పేసి పెరుగుతో పచ్చడి చేస్తానంది. అరటికాయ, పుల్లిపాయ వేపుడు చేస్తానంది. ఆస్పత్రినించి తెల్సిన వాళ్లిన రింటికీ వెళ్ళకండా పన్నాసుకు తిన్నగా వచ్చేయమంది. ఆ పచ్చడి అంటే తనకి ప్రాణం. అది తినే ప్రాప్తం లేదేమో అని విచారించాడు. ఎల్లాగో వోపిక కూడదీసుకుని రెండు సందులు మళ్ళి వో స్నేహితుడింట్లో చొరబడి రెండు గ్లాసుల నీళ్ళు తాగి కాస్సేపు ఆయాసం తీర్చుకుని, ఇల్లు చేరుకున్నాడు.

ఎంత దుర్భరమైన పరిస్థితి అవేళ్ళిది! భగవంతుడా! ఆ స్థితి పగవాడికయినా ఒద్దు తండ్రీ—అనుకున్నారు రాజశేఖరంగారు. "కాముడూ. . ." అని కేక వేశారు లోపలికి చూస్తూ. కామేశ్వరి మంచి నీళ్ళు తెచ్చి "ఇంక మళ్ళా పిలవకు, నాన్నా. నాకు చాలా పనుంది" అంది.

"మీ అమ్మ ఏం చేస్తోంది? నిద్రేనా?'

"తల నెప్పిగా వుందని పడుకుంది"

"ఏవిటో తల్లీ....నువ్వున్నావు కాబట్టి ఇంతెడు చాకిరి చేసుకు వస్తున్నావు. నువ్వు అత్తారింటికి వెళ్ళిపోతే మా పాట్లున్నాయి"

"నేను పెళ్ళి చేసుకోను నాన్నా"

"వోహో! ఇది పెళ్ళవక మునుపు ప్రతి ఆడపిల్లా ఆడే మాటేలే! అయింతర్వాత మా మొహాలైనా చూడకండా వెళ్ళిపోవటే, ఆ పెద్ద చెంప లబ్బాయి వెంటా?. . . ." కళ్ళు అరవాల్చి ఎస్వీఆర్ ఫోజులో నవ్వుతూ చూశారు.

"ఫో నాన్నా...." కామేశ్వరి తుర్రున పరిగెత్తింది.

ఇంత సేపటికి చల్లగాలి సుళ్ళు తిరుగుతూ వచ్చి, మృదువుగా తట్టిపోతూంది. రాజశేఖరంగారు కాళ్ళు స్టూలుమీద బార చాచి, చేతులు వెనక్కి చాపి, కళ్ళుమూసుకున్నారు. వీధిలో కేక విన్పించింది. కనుబొమలు ముడిచి "ఎవరూ?" అనడిగారు.

"బాబయ్యా" దీనంగా....జాలిగా..... వణికే బొంగురు గొంతు.

"వేళాపాళా లేదట్రా? వెళ్ళిపో"

"పేగులార్చుక పోతన్నాయి బాబయ్యా సిన్న కాడ్నించి పట్టెడు ముద్ద పెట్టే మారాజులు కరువైనారు...."

'మంచి నిద్ర పాగొట్టాడు' అని విసుక్కున్నారు రాజశేఖరంగారు. అంతవరకు రాని చల్లని గాలి తెర అప్పుడే వచ్చి—ప్రాణం సేద తీరుతున్న సమయంలో—మత్తుగా కళ్ళు మూత పడుతూంటే—ఒక్క కేకతో ఆ కమ్మటి అనుభవాన్ని పారదోలిన ఆ ముష్టివాడిమీద ఆయనకి విపరీతంగా ఆగ్రహం కలిగింది. నిద్ర పట్టడమే కష్టం. నిద్ర మాత్రలు వేసుకుంటే గాని అది లొంగిరాదు. కళ్ళు గట్టిగా మూసుకుని, ఇందాకటి అనుభవాన్ని ఇంకా వదులుకోని స్థితిలో ఉన్నారు.

"బాబా....బుక్కెడు గంజన్నా పొయ్యండయ్యా"

ఆ గొంతు తెగటానికి సిద్ధంగా వున్న వీణ తీగెలా ధ్వనించింది.

రాజశేఖరంగారు తల అటు తిప్పారు. కమ్మటి అనుభవానికి స్వస్తి చెప్పి—బలవంతంగా కను రెప్పలు విప్పి—భారంగా తల అటు కదిల్చి — వీధి వరండాలోంచి, క ట క టా ల త లు పు ల్లోంచి అవతల నిలబడున్న ముష్టివాణ్ణి చూశారు. పండి, ఎండిన పీచులాంటి జుత్తు. ఒడిలిపోయి ముప్పై మూడు ముడతలు పడిన ముఖంలో—గాజుబుడ్లలాంటి కళ్ళు. బోసినోటిలోంచి—నూతిలోంచి వినవచ్చే స్వరం. మాంసం జీర్ణించిపోయిన

హరి రామ్



ఎముకల పంజరంమీద వో ముతకగుడ్డ— పంచెగా—ఆచ్ఛాదితమై వుంది. డాల్డా డబ్బా వణుకుతూంది.

"బుక్కెడు గెంజీ....బాబా....పేణం నిల్ప ండి"

రాజశేఖరంగారు వాడు పక్కింటికి పోతే బావుణ్ణనుకున్నారు. కామేశ్వరిని పిలిచారు రెండుసార్లు. ఆ పిల్ల రాలేదు. పలకలేదు అదిలా ఒక్కసారి వస్తే బావుణ్ను. ఆ గంజి పోసేస్తే పోతాడు. ఇవాళ అన్నం ఏం మిగల్లేదు. బియ్యం దొరకడం కష్టంగా వుందని దమయంతి తూచి తూచి వండు తూంది. పోనీ ఆ గంజి పోసేస్తే సరి!ఇంట్లో ఇంకెవరూ లేదు. తను లేద్దామంటే కాళ్ళు పట్లు పట్టేశాయి. అవతల వాడి స్థితి చూస్తుంటే మరో అయిదు నిమిషా లలాగే వుంచితే ఆ యింతా ప్రాణాలు వదిలేటట్లు వున్నాడు! దార్నపోయే పాపం నెత్తికి చుట్టుకుందన్నట్లు?! అయినా ఎన్నాళ్ళాయి సరిగ్గా తిండి లేదో?! అందులో ముసలి ప్రాణం!

రాజశేఖరంగారి ఆలోచనా కడలిలో వో కెరటం వెనకనించి లపతప ఒకే వేగంతో వచ్చి, హోరుపెట్టి, ఆయన్ని ముంచెత్తి పోయింది. నడిరోడ్డుమీద—మండే ఎండలో చుక్క నీటికోసం అగ్గగ్గలాడిపోయే ఆరోజు! ప్రాణం పోతుందేమో! అని భయ పడే ఆవేళ! నిజంగా—తను తల్చినట్టు జరిగితే దిక్కులేని చావు అన్నమాటది!

"బాబా!...." నూతిలోంచి వినవచ్చే గొంతు! తెగుతున్న తీగె!

రాజశేఖరంగారి ఒళ్ళు చెమటలు పోసింది. కుర్చీలోంచి లేచారు. బల్ల తగిలి, దానిమీదున్న భాగవతం కిందపడింది. ఆ పుస్తకాన్ని తీసి కళ్ళ కద్దుకుని, బల్ల మీద వుంచారు.

గజేంద్రమోక్షంలో—గజేంద్రుడిలా కని పిస్తున్నాడవతలి ముష్టివాడు. 'రావే ఈశ్వర కావవే వరద! సంరక్షింపుము భద్రాత్మకా!' అని ఎలుగెత్తి ప్రార్థిస్తున్నాడు కరిరాజు.

'బుక్కెడు గెంజిపోసి ప్రాణాలు నిలప మని" అర్థిస్తున్నాడు ముష్టితాత!

మొసలి బారినుండి తప్పించమని వేడు కొంటున్నాడు గజరాజు!

ఆకలిబాధనుండి తప్పించమని అరు స్తున్నాడు ముష్టితాత!

కాస్త గంజి పొయ్యటానికి తాను మహా విష్ణువులా ఫీలవక్కర్లేదుగాని— గంజిపోస్తే వాడి దృష్టికి తను వాడి ప్రాణాన్ని నిలిపిన దేవుడే అవుతాడు. పొట్ట వూపుకొంటూ రాజశేఖరంగారు గబగబ ఇంట్లోకి వెళ్ళారు. గంజి పొయ్యమని కూతురికి చెప్పడానికి. అక్కడి దృశ్యంచూసి స్తంభించిపోయారు. నిజానికి ఆయనలా స్తంభించిపోయేంత ఆశ్చర్యకరమైన దృశ్యం ఏం కాదది. ఎప్పుడూ చూసేదే! ఇప్పుడు మాత్రం ఆయన్ని స్తంభింపచేసింది.

కామేశ్వరి గిన్నెలో గంజిని నీళ్ళు కలిపి పల్చగా చేస్తోంది. అందులో—వుతికిన బట్టల్ని ముంచి వో పక్కన పెడుతూంది, ఆరేయటానికి.

'అరెరె! ఎంతపనయింది!' అని బాధ పడ్డారు.

ఆ గంజి— ఆ ముష్టితాత దప్పికని, ఆకల్ని తీర్చి, ప్రాణాన్ని నిలబెట్టే అమృతం. అందులో వాడి జవం వుంది. జీవం వుంది. వాడికి పిల్లలుంటే వాళ్ళకి తండ్రిని బతి కించి ఇచ్చే పుణ్యం వుంది. వాడికి భార్య వుంటే దాని మాంగల్యం తెగిపోకుండా చేసే మహత్యం వుంది. వాడే ఆ ఇంటి కాధార మైతే, ఆ ఆధారాన్ని నిలబెట్టే ప్రయో జనం వుంది. ఆ గంజి—అతి సామాన్యంగా కనిపించే గంజిలో ఎంత విశేషం వుంది?!

అదంతా...నీళ్ళు కలిపి పల్చగా...అదీ ప్రయో జనకరమైనదే అయినా (ఇప్పుడు తన దృష్టి లో కాదు) మరో పనికి వినియోగపడ బోతూంది. జీవం వున్న మనిషికి కాకుండా జీవరహితమైన ఆ గుడ్డలికి ఉపయోగ పడబోతూంది!

ఎంతపనెంత పనయింది! కాస్త ముందొచ్చివుంటే కావుడు గెంజిలో నీళ్ళు పోసేసేది కాదుగదా! భగవంతుడా! అవతల ఆ ముసలాడు ఆ యింతా చచ్చూరుకున్నా డేమో!

అడుగులో అడుగేసుకొంటూ అక్క ణ్ణించి నడిచారు. గేటు దగ్గర బిచ్చ గాడు లేడు! ఆశ్చర్యంగా గేటు దగ్గరికి వెళ్ళి గేటుతీసి చూశారు.

ఇంటికి ఎడం పక్కన—పదడుగుల దూరంలో—నేలన— వో పక్కకి వొరిగి పోయివున్నాడు. చాపిన చేతికి అంతదూరాన ఖాళీ డాల్డాడబ్బా పడి ఉంది.

ఆ కళ్ళు ఇప్పుడు, ఇందాకట్లా అస్థి రంగా చలించటంలేదు. ఆ నోరు ఇప్పుడూ తెరిచేవుందిగాని — ఆకలాకలని ఆర్తనాదం చెయ్యటం లేదది.

రాజశేఖరంగారు ప్రతిమవూదిరిగా ఉండి పోయారు. ●



బంగ్లాదేశ్‌లో వైద్యసహాయం చేయడానికి బయల్దేరి వెళ్ళిన బ్రిటిష్ రెడ్‌క్రాస్ బృందం. 26 సంవత్సరాల వైద్యవిద్యార్థిని కుమారి హీత్. (కర్ డేవిడ్ విలియమ్స్), 25 సంవత్సరాల నర్సు కుమారి వన్మర్స్, శ్రీ అర్నాల్డ్ పొవర్, శ్రీమతి జేనెట్ ఆడలోగ్.




ఏం వ్రాశాడేమిటి ఉత్తరంలో? దసరా సెలవలు గాబోలు వస్తున్నానని వ్రాశాడా?'

'అబ్బే లేదు. చదవాల్సినవి చాలా వున్నాయట. ఇక్కడకొస్తే చదువు సాగదు. అందుకని సెలవలకు రాదల్చుకోలేదని వ్రాశాడు. మా వాడికి చదువు మీద తగని శ్రద్ధ' అన్నాడు శ్రీపతి చదువుతున్న ఉత్తరాన్ని పూర్తిచేసి.

'సెలవలకు రానని వ్రాశాడూ! అయితే కాస్త దారిలో పడుతున్నాడన్నమాటే!' అన్నాడు గోపాలం వ్యంగ్య ధోరణిలో.

'అంటే.'... అన్నాడు శ్రీపతి ముఖం చిట్లిస్తూ.

'అబ్బే యేంలేదు. మా వాడూ చదివే రోజుల్లో యిలాగే వ్రాసేవాడు. సరిగ్గా ఒకటి రెండు సార్లు నిజమే గాబోలునని సంతోషించాను. తీరా చూస్తే ఆడపిల్లల స్నేహాలు యెక్కువయాయని— సెలవులకు వచ్చే తీరుబాటు కూడా లేకుండా పోయిందనీ చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను. అప్పటికే వాడి వ్యవహారం నా చెయ్యి దాటి పోయిందనుకో.....

'అంటే— మా వాడూ అంతేననా నీ వుద్దేశ్యం? ఇదుగో. గోపాలం— కిషోర్ నా కొడుకు. వాడు నిప్పు.'

'ఇదుగో యెన్నైనా చెప్పు. రోజులు యెట్లా వున్నాయ్. ఈ మధ్య నాగరికత పట్టణాల్లో పట్టడం లేదేమో—పల్లెటూళ్ళ మీద కూడా పడ్తోందిగదా— వచ్చి. అటువంటిది వాడిదేమో కుర్రతనం. మంచి పట్టణంలో వుంటున్నాడు. ఈ మధ్య చెదలు కల్చర్ అనే తొడుగు వేసుకుని నిప్పుని కూడా నిర్భయంగా ఆవరిస్తున్నాయ్. యేమైనా పెద్దవాళ్లం మన జాగ్రత్త మనం తీసుకోవాలిగా. దెబ్బతిన్న వాడిని గనక చెబుతున్నాను. తర్వాత నీ ఇష్టం.'

అంటూ వెళ్లిపోయాడు గోపాలం.

శ్రీపతి— గోపాలం బాల్యస్నేహితులు. రిటైర్డ్ పోలీస్ ఆఫీసర్ శ్రీపతి కొన్ని నమ్మకాలు—నియమాలు గల మనిషి. దొంగని అనుమానించి అరికట్టడంకన్నా— దొంగకి తాళంచెవి యిస్తే తేలిగ్గా దొంగతనాన్ని అరికట్టగలం— అనుకుని— అలాగే చేసిన ఆఫీసర్ శ్రీపతి. 'మనిషిని మంచివాడిని చెయ్యాలన్నా— మోసం చెయ్యాలన్నా నమ్మకం అనేది ముఖ్యం' అంటాడు శ్రీపతి. శ్రీపతి ఒక్కగా నొక్క కొడుకు కిషోర్ సిటీలో చదువుతున్నాడు. అయితే వాడి చదువును గురించి నడవడిని గురించిగాని యెప్పుడూ వాణ్ని హెచ్చరించి గాని, మందలించిగాని యెరుగడు శ్రీపతి. వయసొచ్చిన వాళ్లకు చెప్పక్కర్లేదనీ— చెప్పినా ప్రయోజనంలేదనీ ఆయన నమ్మకం. కాకుంటే

స్నేహితుడిలాగా సలహా యివ్వచ్చు. అదీ యిష్టమైతే పాటిస్తారు.' లేకపోతే చెడి పోయేది వాళ్ళే. మొక్కగా వున్నప్పుడు వాళ్లను సరిగ్గా మళ్లించాలి. మరి మాను అయాక వంచడానికి ప్రయత్నిస్తే అది వంగక పోగా విరిగిపోయే ప్రమాదం వుంది.'

అనేది ఆయన స్వంత అభిప్రాయం. దాన్ని ఆయన అక్షరాలా పాటిస్తారు కూడా కూడా.

'బాగుపడ్డా—చెడిపోయినా అది కేవలం వాళ్ల జీవితాలకు సంబంధించిన విషయం. తండ్రిగా తన బాధ్యతల్లా అవసరాలకు ఆర్థికంగా ఆదుకోవడం— స్నేహితుడిలా తోచిన సలహా యివ్వడం' అని అనుకునే శ్రీపతిని గోపాలం మాటలు కొంచెం కలవర పరచాయ్.

'నాలుగు రోజులు సెలవలు వస్తేనే యింటికి దూరేవాడు— యీసారి సెలవలు నెలరోజులున్నా రానని వ్రాశాడు? యేదైనా తప్పుదారిన పడలేదుగదా! యేమో.... గోపాలం చెప్పినదాంట్లో నిజం లేకపోలేదు. అందులో వీడికి డబ్బుకేమీ లోటులేదు. పరిసరాలు— సావాసాలు మనిషిని తేలిగ్గా మార్చగలవ్. నా వెర్రి ఆలోచన గాని నా బాబు అలాంటివాడు కానేకాదు. నాకా నమ్మకం వుంది. వాడి మీద నేనుంచిన నమ్మకాన్ని వదులుకోను. వాడు అలాంటి వాడు కానేకాదు.' శ్రీపతిని ఆలోచనలూ —అనుమానాలు పీక్కు తింటున్నాయ్. కిషోర్ మీద తనకున్న నమ్మకం మంచు కొండలా స్పష్టంగా మెరుస్తోంది మన స్సులో— కాని చుట్టూవున్న చెడుసావాసాలు కుంపట్లులాగా మండుతున్నాయ్. వాటిల్లో నాగరికత ఆజ్యంలా సడోస్తోంది. ఆ సెగలకి మంచుకొండ కరిగి పోతుందేమోనని భయం వేసింది శ్రీపతికి.

తల్లిదండ్రులకు తమ పిల్లలు యెప్పుడూ పసివాళ్లలాగే, మ్రానులైనా మొక్కల్లాగే, పువ్వులైనా మొగ్గల్లాగే కన్పిస్తారు

'అయినా ఒకసారి వెళ్లొస్తే అన్ని అనుమానాలు తీరొస్తాయ్ గదా!' అనుకుని సిటీకి బయలుదేరాడు శ్రీపతి.

* * *

'ఒరేయ్ పిచ్చితండ్రీ! గాంధీగారు ఒక సారి మాంసం తిన్నారు తెలిసో తెలియకో— అఫ్‌కోర్స్ ఆయన 'బాడీ కి సరిపడలేదు. వదిలేశారు. తర్వాత జీవహింస కూడదు అన్నారు. మరిప్పుడు ప్రభుత్వ సహకారంతో మనం యిప్పుడెన్ని బేకన్ ఫ్యాక్టరీలు పెట్టుకున్నామో చూడు. ఆఖరికి ఆవుల్ని కూడా అందంగా డబ్బాల్లో పెడుతున్నారోయ్ చంపేసి. కాలం మారింది. మనం మారాలి. మన అలవాట్లు మారాలి. దాన్ని 'ప్రగతి' అంటారు పెద్దలు. యేదో పెద్ద వాళ్ళు సిద్ధాంతాలు పెట్టారు. వాటినె పట్టుకుని అర్థం లేకుండా వ్రూగకూడదు. వాటికి మన కనుగుణంగా భాష్యాలు చెప్పుకుని నడుచుకోవాలి. అసలు మహాకవి 'గురజాడ' యేమన్నాడు? 'ఊసురోమని మనుషులుంటే దేశమే గతి బాగుపడునోయ్?' అన్నాడు. అంటే అందరూ హుషార్‌గా వుండాలన్నమాట. అలా వుండాలంటే కొంచెం నిషా కావాలి. ఈ హుషార్‌ని కూడా అన్నిటిలాగా మనవాళ్ళు కృత్రిమంగా తయారు చేసి మార్కెట్‌లో పెట్టారు. ఆ టానిక్‌ను ప్రతివాడూ సేవించాలి. తాను తరించి దేశాన్ని తరింప చెయ్యాలి. ఒరేయ్! నీ శ్రేయోభిలాషిని. నన్ను బాగా అర్థం చేసుకో. అందగాడివి. తెలివైన వాడివి. డబ్బున్న వాడివి. మరినువ్వు కనీసం సిగరెట్టైనా కాల్చడం లేదంటే అమ్మాయిలు నీ గురించి యెంత అసహ్యంగా మాట్లాడుకుంటారో ఒక్కసారి ఆలోచించు. అసలిలా వుంటే అందరూ నిన్ను 'అండర్ ఎస్టిమేట్' చేస్తారోయ్. అయినా యెదుగూ బొదుగూ లేకుండా యెన్నాళ్లని యిలా వుండిపోతావురా- వెధవలాగా?' రాజు వుపన్యాసం ముగించాడు.

'పోరా— వెధవ స్పీచి—నువ్వూనూ—నేనిక్కడికి అమ్మాయిల అభిప్రాయాలు సేకరించు కోడానికి రాలేదు' అంటూ రగ్గునిండా ముసుగు పెట్టుకున్నాడు కిషోర్.

ఓరి అమాయకుడా! రగ్గు కప్పుకుంటే పోతుందా చలి. ఒక్క పెగ్గు వేసుకుంటే పోతుంది మరి. ఒరేయ్ పెద్దపెద్దవాళ్లంతా యేం చేస్తారో తెలుసా? సీసాలు ఖాళీచేసి అందులో చలిని పెట్టేసి— గట్టిగా మూతపెట్టి హాయిగా వెచ్చగా పడుకుంటారు.'

రాజు మాటలకు 'నిజంగానా?' అన్నాడు కిషోర్ అమాయకంగా.

తర్వాత యేం మాట్లాడ కున్నారో కాని — యిద్దరూ బార్ వైపుకు నడిచారు.

'భారతదేశం పురోగమించింది' అనడానికి నిదర్శనం ఆరంతస్తుల భవనంలో బార్ వుండడమే. అందులోకి వెళ్లేవాళ్లను 'ప్రకృతి పురుషులు'— 'కళాపిపాసులు'— 'కల్చర్డ్ 'పీపుల్ అని పిలుస్తుంటారు.



సరిక్రొత్త అనుభవం కావడం వల్ల కిషోర్ తడబడుతూ లోపలకి అడుగు పెట్టాడు. వినిపిస్తున్న పాశ్చాత్య సంగీతాన్ని ఎదురుగా వింటున్నాడు. కన్పిస్తున్న మనుష్యుల్ని ఎదురుగా చూస్తున్నాడు.

'కిషోర్! కొంచెం ఫ్రీగా వుండవోయ్. యేమిటేదో యిబ్బందిగా వున్నట్లు నీ బిహేవియర్ అందరికీ అర్థమవుతుంది— మరి మొదట్లో యిట్లాగే వుంటుంది —తర్వాత నువ్వే యెడ్జెస్ట్ అయిపోతావ్' అంటూ సీసాలోది రెండు గ్లాసుల్లోకి వంచాడు రాజా.

'సిగరెట్ బిఫోర్ ఎ సిప్ అన్నారు అనుభవజ్ఞులు.' అంటూ కిషోర్ నోట్లో వుంచిన సిగరెట్‌కు ప్రాణంపోశాడు రాజా.

'అబ్బ! వెధవసిగరెట్ చేదుగా వుంది బ్రదర్' అన్నాడు కిషోర్ ముఖం చిట్లిస్తూ.

'టేకిట్ యీజీ! ఇదీ జీవితం లాగానే!

# నమ్మకాలు

అలవాటయేదాకా మరి చేదుగానే వుంటుంది. తర్వాత అదే స్వీట్‌గా థాట్స్ యిస్తుంది.' సమర్థించి నవ్వువెప్పాడు రాజా.

'లాభం లేదురా! నేను తాగలేను' అంటూ సిగరెట్ పారేసి బాధగా గుండెల మీద చెయ్యిపెట్టుకున్నాడు కిషోర్. వస్తున్న దగ్గుని ఆపుకునే ప్రయత్నంలో వుక్కిరి బిక్కిరి అవుతున్నాడు.

* *

అర్ధరాత్రి సిటీలో అడుగుపెట్టిన శ్రీపతిని యింకా ఆలోచనలు పీక్కుతింటూనే వున్నాయ్.

'అయినా యింత అర్ధరాత్రి వెళ్తున్నాను వాడిరూమ్ మీద దాడి జరిపినట్లు— వాడేమనుకుంటాడో? బాధ పడ్తాడేమో? నన్ను అనుమానిస్తాడేమో? నన్ను తక్కువగా అంచనా వేస్తాడేమో? సంకుచిత మనస్తత్వం— ఒట్టి అనుమానం మనిషి నాన్న— అని అనుకోడు గదా! '

'నాన్నా!మీరు నా సంగతులసలేవీ పట్టించుకోరెందుకని?' వాడు ఒకసారి అడిగితే

'నీ చదువు— నీ నడవడి నీ జీవితానికి సంబంధించినవి. కొంత వయస్సొచ్చాక వారి బాధ్యతలు వారికే వదలెయ్యడం మంచిది. అయినా నీ మీద నాకా మాత్రం నమ్మకం వుంది బాబూ' అని చెప్పాడు.

'ఇన్నాళ్ళ నా మీదున్న నమ్మకం యిప్పుడెందుకు పోయింది? యెక్కడికి పోయింది నాన్నా?'

లని వాడు సూటిగా అడిగితే తనేం చెప్పాలి.

'పెరిగిన మనసులు ఆతకని వయస్సు వాడిది. అయినా వాడి మీది సదభిప్రాయం నాలో జారి పోయినప్పుడు— నా మీద వాడికున్న గౌరవం మాత్రం పోక వుంటుందా?' అయినా అసలు కిషోర్ నా బిడ్డ. వాడు అలా దారి తప్పి యెన్నటికీ నడవడు. ఇన్నేళ్ళ నుంచీ లేనిది— ఆ గోపాలం గాడి చెప్పుడు మాటలు విని నా బాబుని అనుమానించాను. ఇంకా నయం.....'

అనుకుంటూ శ్రీపతి గిరుక్కున వెనక్కు తిరిగి కిషోర్ రూమ్ మీద దాడి జరపకుండానే, వాడిమీది నమ్మకాన్ని పదిలంగా దాచుకుని తృప్తిగా స్వస్థలానికి చేరుకున్నారు.

*

కిషోర్ గుండె తడబడబడుతూ కొట్టుకుంటోంది. ఒక్కసారి తలయెత్తి చూచాడు. అంతా కృత్రిమంగా—భయంగా గోచరించింది కిషోర్‌కి. తనేదో ఒక రంగుల వలలో అందంగా బంధింప బడ్డట్లు అర్థమయింది. గుండె యేదో గుసగుసా హితబోధ చేసింది. తన బంగారు జీవితమూ— తన మీదుంచిన నాన్నగారి నమ్మకమూ— రెండూ పాతాళానికి వెళ్తున్నట్లు స్ఫురించింది కిషోర్‌కి. 'ఛీ! ఛీ' యిన్నేళ్ళనుంచీ లేనిది యీరోజు ఆ రాజుగాడి మాటలు విని యిందాకా వచ్చాను. ఇంకా నయం... కాస్తుంటే కాలు జారేవాడినే.'

అనుకుంటూ రెండడుగుల్లో బయటపడి తండ్రి తన మీదుంచిన నమ్మకాన్ని జారి పోకుండా పట్టుకుని రూమ్‌వైపుకు తృప్తిగా నడిచాడు కిషోర్. ●

---

ఆయుధాన్యములు - గుణాలూ:

# పరి అన్నము

మన దేశంలో ముఖ్యంగా దక్షిణ భారత దేశంలో వరి అన్నం ప్రధానమైన ఆహార పదార్థం.

బియ్యం బాగా కడిగి— బాగా మెత్తగా వండిన అన్నం మన శరీరంలోని సమస్తేంద్రియాలకు మంచి శక్తిని, పుష్టిని కాంతిని యిస్తుంది. శరీరంలోని వేడిని నిలబెడుతుంది. అన్నంలో ఏఏ ఆధరవులను కలిపి తింటూ ఉంటామో ఆయా ఆధరవుల యొక్క గుణాలు కూడా కలుస్తాయి.

నేతితో నూకలుతో వండిన అన్నం సులభంగా జీర్ణమవుతుంది. జ్వరం పడి లేచిన వారికి, అజీర్ణరోగులకు యిది మిక్కిలి పథ్యమయినది.

చిత్రమూలం, శొంఠి పీని తేలిక కషాయంతో వండిన అన్నం వేడి చేస్తుంది. తేలికగా జీర్ణమవుతుంది. వాతరోగం, వాత జ్వరం గలవారికి మిక్కిలి అనుకూలంగా ఉంటుంది.

క్షయరోగులకు గాడిదపాలతో వండిన బియ్యపు అన్నం, ఎంతో మేలు చేస్తుంది. క్షయరోగాన్ని తగ్గిస్తుంది.

మజ్జిగతో కుండలో వండిన వేపుడు బియ్యపు అన్నం, కాక విరేచనాలు అవుతున్న వారికి, క్షయ రోగులకు పథ్యమయినది.

సన్నబియ్యపు అన్నం వండి— బాగా గంజి వార్చివేసి— ఆ అన్నంలో ఆవుపాలు కలిపి రోజూ తింటూంటే మంచి బలం, యింద్రియ వృద్ధి చేకూరుతుంది.

గ్రహణి లేదా రక్తగ్రహణిగల రోగులు— వేడి అన్నంలో గేదె పెరుగు కలిపి భుజించడం మంచిది.

అన్నమువల్ల కలిగే అజీర్ణానికి విరుగుళ్ళు: 1. ఆవు మజ్జిగ, 2. ఆవాలపిండి, 3. వాము, 4. శొంఠి మిరియాల కషాయం.

వార్చినగంజి గురుత్వంగా ఉంటుంది. దేహపుష్టి నిస్తుంది. ఆకలిదప్పికలను అణచి వేస్తుంది. పైత్యాన్ని అణుస్తుంది. శ్రమ వల్ల కలిగిన ఆర్తిని పోగొడుతుంది.

రాత్రి ఉడుకుగంజిలో వేసిన అన్నం, ఉదయాన్నే రోజూ భుజిస్తూన్నట్లయితే శరీరానికి ఎంతో మేలు చేకూరుతుంది. చలవ చేస్తుంది. పైత్యం, దాహం తగ్గుతాయి. మూలవ్యాధి, మూత్రకృచ్ఛంగలవారికిది పథ్యమయినది.

కడుపులో క్రిముల్ని పెంపొందిస్తుంది. కఫం చేస్తుంది. జ్వరం గలవారికిది అపథ్యమయినది. వాతం చేస్తుంది. దీనియొక్క దురు ణాలకు విరుగుళ్ళు:— 1. గులకందు, 2. పుదీనా.

సేకరణ ఆకుండి నారాయణమూర్తి

# ఆంధ్రదేశంలో ఆర్టుథియేటర్ల ఆవశ్యకత

ఇటీవల చలనచిత్ర నిర్మాణరంగంలో మామూలు ఆర్ట్ చిత్రాలను నిర్మించాలన్న ధోరణి, కొందరు ప్రేక్షకులలో ఆర్ట్ చిత్రాలు చూడాలన్న ఆసక్తి కూడా ఎక్కువఅవుతోంది. ఒక వంక యీ ధోరణి ఇలా వుండగా, ఆంధ్రదేశంలో పెద్ద పెద్ద థియేటర్ల ప్రక్కన చిన్న థియేటర్లు నిర్మించే కొత్త ధోరణి బాగా అమలులోకి వస్తున్నది. ఈ థియేటర్లను 'మిని' అనేకంటే ఆర్ట్ థియేటర్లు అని కూడా అనవచ్చు. వాటిని ఆర్ట్ థియేటర్లుగా ప్రయోజనకరం చేసుకోవచ్చు.

గుంటూరులో నాజ్ థియేటర్ ప్రక్కన అప్సర, కృష్ణా పిక్చర్ ప్యాలెస్ ప్రక్కన లిటిల్ కృష్ణా, శేష్‌మహల్ ప్రక్కన రంగమహల్ నిర్మించారు.

అదే విధంగా విజయవాడలో ఊర్వశి ప్రక్కన మేనక నిర్మించారు. దీని ప్రక్కన మరో చిన్న థియేటరు నిర్మించనున్నారు. అంటే ఒక విధమైన థియేటర్ కాంప్లెక్స్ అమలులోకి వస్తోంది.

పెద్ద పెద్ద నగరాలలో పలు అంతస్తుల భవనాలలో (మల్టీ స్టోరీడ్) షాపులు ఏర్పాటు చేస్తూ, వాటి ప్రక్కనే యీ చిన్న థియేటర్లు నిర్మించే మరొకధోరణి కూడా కన్పిస్తుంది.

## ప్రేక్షకులు

ఆంధ్ర దేశంలో గత పదేళ్లలో సినీ ప్రేక్షకుల సంఖ్య విపరీతంగా పెరిగింది. విభిన్న అభిరుచులు కూడా పెంపొందాయి. కొంతమంది అభివృద్ధిచెందిన (మెచూర్డ్) ప్రేక్షకులు మామూలు చిత్రాలేగాక— వివిధ భాషలలో నిర్మించబడే దేశ విదేశాలకు చెందిన ఆర్ట్ చిత్రాలను చూడడానికి ఆసక్తి చూపిస్తున్నారు. అందువల్ల అందుకొరకు ఫిలిం క్లబ్‌వంటి వాటిలో సభ్యులుగా చేరుతున్నారు.

## పెద థియేటర్లు — ఆర్టు థియేటర్లు

సాధారణంగా పెద్ద థియేటర్లలో ప్రాంతీయ భాషా చిత్రాలు ఎక్కువగా ప్రదర్శిస్తారు. అయితే ఆర్ట్ చిత్రాల పట్ల ఆసక్తి చూపించే పరిమిత ప్రేక్షకులను దృష్టిలో వుంచుకొని చూచినట్లయితే తక్కువ లేక పరిమితి సీట్లు గల చిన్న థియేటరు లేక ఆర్టు థియేటర్లు చాలా అవసరమని అర్థమవుతుంది. పెద్ద థియేటర్లలో ప్రాంతీయ చిత్రాలు ప్రదర్శిస్తూ, ఆర్ట్ థియేటర్లో హిందీ, ఇంగ్లీషు భాషా చిత్రాలు, వివిధ భాషలలోని ఆర్ట్ చిత్రాలు ప్రదర్శించినట్లయితే అది చాలా ప్రయోజనకరం కాగలదు. అందువల్ల పెద్ద పెద్ద థియేటర్ల యాజమాన్యం ఇటువంటి ఆర్టు థియేటర్ల నిర్మాణానికి పూనుకోవాలి.

## యాజమాన్యం ఖర్చులు

ఇటువంటి ఆర్టు థియేటర్లు, పెద్ద థియేటర్లు ఉన్నచోటే ఖాళీ స్థలంలో గాని, లేక ఆ థియేటరు పై అంతస్తులో గాని నిర్మించడం వీలు కావడంవల్ల, స్థలం కలిసి రాగలదు. రెండు థియేటర్లూ ఒకే మేనేజిమెంటు క్రింద ఉండడం వల్ల నిర్వహణ సౌలభ్యం యేర్పడడమే గాక, ఖర్చులు కూడా తగ్గవచ్చు. ఒక పెద్ద థియేటరు ఉన్నచోటే మరొక ఆర్ట్ థియేటర్ నిర్మించినట్లయితే ప్రేక్షకులలో కూడా వాటికి ప్రచారం వస్తుంది. అంటే ఒక థియేటరు ముందే అక్కడ ఉన్నందువల్ల ఆ ప్రాంతం సెంటర్‌గా ప్రచారంలో ఉన్నందువల్ల ప్రక్కన నిర్మించితే ఆర్ట్ థియేటరు కూడా ప్రజల దృష్టిలో ఉండడానికి ఎక్కువ వీలు వుంటుంది.



ఆంధ్రజాతీయ కళాశాల, (మచిలీపట్టణం) సరస్వత్యుత్సవములలో కూచిపూడి నాట్య ప్రదర్శన యిచ్చిన చిరంజీవి జె. శైలజసుమన్. విశేశ్వరపు వాగీశ్వరశర్మగారి శిష్యురాలు ఈ అమ్మాయి,

థియేటర్ల కొరత తీవ్రంగా ఉన్న ప్రస్తుత పరిస్థితులలో ఆర్ట్ థియేటరులు ఎంత ప్రయోజనకరం కాగలవో పరిశ్రమలోని వారికి వేరే చెప్ప నవసరము లేదు.

## సాంఘిక బాధ్యతలు

అంతేకాక రాను, రాను ప్రతి వ్యాపారం లోనూ, సంపాదన కార్యక్రమంతోపాటు సాంఘిక బాధ్యతలు కూడా ఒక ముఖ్యమైన స్థానాన్ని ఆక్రమించు కుంటున్నాయి. అందువలన ఉన్న థియేటర్లు ఎయిర్ కండిషన్ చేయడం కంటే ఆర్ట్ థియేటర్ల నిర్మాణానికి ప్రాధాన్యతనివ్వడం అవసరంగా కనిపిస్తున్నది.

## ఇతర ఉపయోగాలు

ఈ ఆర్ట్ థియేటర్లు కేవలం సినిమా ప్రదర్శనలకే గాక, సాంఘిక జీవితంలో ముఖ్య అవసరాలకు ఉపయోగ పడుతుంది. ఈ థియేటర్లను చిన్న చిన్న సమావేశాలకు మీటింగ్స్ హాల్స్‌గాను, కళా ప్రదర్శనకు, ఎగ్జిబిషన్లు'. నిర్వహించడానికి, కళ్యాణమండపాలుగాను కూడా వాడుకోవచ్చు. ఈ విధంగా ఆర్టు థియేటర్లు బహుళ ప్రయోజనకరం (మల్టీపర్పస్) కాగలవు.

—కొత్రగడ్డ నరసయ్య ●

ఎస్. ఆర్. కె. ...దోని

ఏమండీ, వినిపించని మాట, కని పించని రూపం ఏదండి ?

ఎలా చెప్పడం? కనిపించక, వినిపించక మనని ఆడిస్తున్న.. భగవంతునెలా వర్ణించడం?

జి. కె. ఆర్. విశాఖపట్నం

మీలో ఏం చూసి ప్రేమించారు మీ వారు?

అదే నాకూ ఆశ్చర్యం వేస్తూవుంటుంది. అయినా, మనలో మన మాట. ఆడదానిఅందం కంటే కూడా సహజత్వం, సరైన ప్రవర్తన, మెలుకువ అయిన మేధస్సు, పురుషులని ఆకర్షిస్తాయి. వయస్సు మళ్లినా, అందంలేకున్నా కూడా కొందరాడువారు అందర్నీ ఆకర్షిస్తారు.

పి ఎస్. ఆర్. కోయంబత్తూరు

విషాదాని కెవరు బాధ్యులు ?

మనమే. కావలసినదేమిటో తెలియక—దాని కోసం కొట్టుకు చావడమే— విషాదం.

అశోక్, విజయవాడ

...ఈ ప్రపంచంలో సహృదయులు చాలా తక్కువ. మీరు యింతమంది విమర్శలను ఎలా తట్టుకుంటున్నారా అని.

నన్ను తేజీపరిచేవి — ఈ విమర్శలే బ్రదర్, మరీ అంత నీరసంగా ఉంటే ఎలా? నాకు తోచింది రాయడం ఎంత హక్కో, ఎదుటివారు తోచినట్టు అనడం అంత హక్కాను. నన్ను విశాఖపట్నం అప్పలమ్మ అంటేనే సరదాగా ఉంటుంది గాని మిస్ యూనివర్స్ అంటే సిగ్గుగా వుంటుంది— మీ ఫ్రెండ్స్ అలా అనుకుంటే మీ కెందుకు బెంగ? అస్సలు ఈ ప్రపంచంలో— అప్పలమ్మలే ఎక్కువ అందకత్తెల కంటే! మెజారిటీ పక్క ఉండడం— ఎప్పుడూ మంచిది. మీరేం దిగులు పడకండి. ఈ విమర్శల టానిక్కే— చాలా కాలం క్రిందటి నుంచీ అలవాటు నాకు. ఇప్పుడు మారిస్తే పని చెయ్యదు.!

ఆర్. ఎస్. పి, సుగాబేడా

కొత్త సంవత్సరంలో మీరేం చేయదల్చు కున్నారు ? మీరు రాసిన 'నీ శత్రువు నీవేసువూ' చాలా బాగుంది.

కొత్త సంవత్సరం అంతా— చేసిన తప్పులు దిద్దుకుందుకే సరిపోయేలా వుంది! థాంక్స్.

ఆర్. ఎల్, విశాఖపట్నం

బాల్యంలో తల్లితండ్రులను, వివాహా నంతరం భర్త కట్టుబాట్లలో ఉన్న స్త్రీకి స్వేచ్ఛ ఎక్కడిది ?

ఇంకా నయం—స్వేచ్ఛ దేనికి? అన్నారు కాదు!!

ఏ. ఎస్. పి. ఎస్, పూలేరు

కె. రా. గారూ, దిగజారిపోతున్న

# ప్రశ్నోత్తరాలు

...కె. రామలక్ష్మి...

నేటి సాహిత్య విధానంపై మీ అమూల్యాభిప్రాయం ఏమిటి ?

నేను సహితం— యథాశక్తి— సమిధ వేస్తూనే ఉన్నానుగా— ఏం చెప్పను?!

అభ్యుదయం అంటూ, అటు సాహిత్యంలో, ఇటు రాజకీయాల్లో ఒకటేగోల? అసలు అభ్యుదయం ఏమి సాధించిందని ?

అంతా అంటే అనడమే గాని— యిదిగో పులి అంటే అదిగో తోక అని— నేనూ అభ్యుదయాన్ని చూడలేదు సార్. 'తను చేసే పని అభ్యుదయం. అదే ఎదుటివాడు చేస్తే కాదు.' ఇదేలా అర్థం అవుతుంది?! అవదు.

సి హెచ్. వి. ఎల్, కొల్లిపర

ఎవరైనా పోట్లాడుకుంటే వారిని సమర్థించి చెప్పక ఇంకా ఎక్కువ చేసే వారిని ఏమనాలి ?

వినోదప్రియులు!

ఇ. ఆర్. ఎ, నెల్లూరు

నేను కార్టూనులు బొమ్మలు బాగా వేస్తాను.

అలా మీరే అనుకుంటే ఎలా?! చూసిన వాళ్లనాలి.

ఎమ్. ఆర్. ర్, చౌద్వరం

మనస్సునకు ఆనందము నిచ్చునది భార్యా ? డబ్బా ?

డబ్బుంటే భార్యైనా యిస్తుంది.

టి. వి, నాపట్న

మనస్సుని స్వాధీనంలో ఉంచుకోవాలంటే ఏమిచేయాలి ?

ఏవి సాధ్యమో ఏవి అసాధ్యమో ఆలోచించి— కోర్కెలని పెంచుకోవాలి. మనసు గుర్రాన్ని ఎప్పుడు తీయనీయక పరుగెత్త నియ్యాలి. ఎంత ఊహా లోకాల్లో విహరించినా — కాళ్లు నేల మీదనే ఉండాలి.

జె ఎస్, ఖమ్మం

మీ ప్రశ్నావళిలోని సెన్సు ఆఫ్ హ్యూమర్ మమ్మల్ని శంపేస్తున్నా దండీ!... మీ మూర్తిమత్వం మాలో ఆంజనేయుడి స్వరూపంలా ఇంతింతై...లా ఎదిగిపోతున్నది...

ఖర్మ! మీ ఊహల్లో ఎదిగినంత త్వరగానూ ఈ భౌతికకాయం కూడా ఎదిగిపోతోంది సార్!!

ఆనంద్, దోనాచలం

మేడమ్, కొందరు తాము రాసే ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా మిమ్మల్ని అడుగుతారు ఎందుకు ?

సరదాకి!

పి. ఎస్. ర్, విశాఖపట్నం

...మంచిప్రశ్నలు వదలి చెత్తప్రశ్నలకు మాత్రమే జవాబిస్తున్న మీ చతురత...

సత్యేశ్వరా, తమని తామే కించపరచుకుంటే — ఎలా? మీ కెందరు? మీ వారి కెందరు పిల్లలు అన్న ప్రశ్న మంచిదా?! ఆడాళ్ల నెందుకు వెనకేసు కొస్తావన్న ప్రశ్న మంచిదా?! లేక ఈ పై ప్రశ్న మంచిదా— తవరే సెలవివ్వాలి!!

ఎ. ఏ. ఆర్, విశాఖపట్నం

స్వార్థపరులకు, మీరిచ్చే సలహా ఏమిటి ?

ఆ విద్యను అందరికీ నిస్వార్థంగా పంచిపెట్ట మని!

వె. వి. ఎస్, గుడిదలంక

మీరు అరుద్రగారికి అన్ని విధాలా తగదనుకుంటాను. ఏమంటారు ?

తగిన సంబంధం చూడు సుబ్బమ్మక్కా. కట్నం కానుకలు తెచ్చేదీ, మంచి ఉద్యోగంలో ఉన్నదీ ఈ సంసారాన్ని ఈదగలదీ అయిన అమ్మాయి దొరికితే చెప్పు— పెళ్లి చేసేస్తాను మళ్లీ!!

కె. పి. ర్, కాకినాడ

ఈ మధ్య ఆంధ్రదేశయాత్ర చేశారట —సకుటుంబంగా ? నిజమేనా.

నిజమే తమ్ముడూ. ప్రేమయాత్ర కాదులే! తీర్థయాత్ర!!

కె. లె. బి, బాపట్ల వాడ

అక్కయ్యా మీరు చాలా మంచివారని విన్నాను నిజమేనా ?

ఎవరబ్బా యిలాంటి పుకార్లు పుట్టిస్తున్నారు? —చెల్లాయి— హియర్ నో ఈవిల్!

ఆర్. జె. బి, గుత్తి

ఈనాడు నిరుద్యోగానికి స్త్రీలుకూడా సమాన హక్కులు కలిగియున్నందుకు కదా ?

మళ్లీ స్త్రీ జనాన్నంతా వంటింట్లో కట్టేసినా కూడా నిరుద్యోగ సమస్య తీరదు. అంచేత అలాంటి భ్రమలు పెట్టుకోకండి. ●



యింక నిలబడలేను. నడవలేను, ఎక్కడో కూర్చోవాలి.

ట్రెయిన్ రావడానికెంత సేపుందో?... పట్టాలమీద అరటి తొక్కలు...రైలు జారి పడిపోతుందేమో! ... ఈ నవ్వు కూడా నీరసంగానే వస్తోంది. రెండు పట్టాల మధ్యనా ఏదో ఆకారం...నల్లగా— అరటి తొక్కలు ఏరుకుంటున్నాడు...

టెలిఫోన్ బూత్ ... ఫోన్ చేద్దామన్నా ఈ ఊళ్లో తెలిసిన వాళ్లెవరూ లేరు. ఫోన్ చెయ్యడానికి డబ్బులూ లేవు! ... హిగ్గిన్ బాతమ్స్.. ఆ పక్కది స్టేషన్ మాస్టరు... కాఫీ ఫలహారశాల — పెద్దహాలు. బల్లలు, వాటిముందు కుర్చీలు! ... ఆగిపోయేను, కుర్చీలు...

మొహం సెగలు కక్కుతున్నట్టుంది. జ్వరం కూడా వచ్చిందో ఏమో! కళ్ళు మండుతున్నాయి. నీరసం... వెన్నుపూస వంగిపోతోంది. కాళ్లల్లో ఏదో పీకు...యిలా ఎప్పుడూ లేదు...కూర్చోవాలి.

కాఫీ ఫలహార శాలహాలులోకి...ఎడంచేతి వేపు... కాఫీ కప్పులు, గ్లాసులు, సీసాలు, యిడ్లీలు, గారెలు...కుళాయిలోంచి గ్లాసులోకి వంపుతున్న కాఫీ... గోడలమీద మరకలు...

కుడివేపు బల్లలు, కుర్చీలు ... కొన్ని ఖాళీగా...ఒక మూల మొగ, ఆడ; నలుగురు పిల్లలు...యిడ్లీలు తింటున్నారు. నానాకంగాళీగా ఉంది...తెల్లగా, కంటికి చల్లగా యిడ్లీలు...చేతుల్నిండా, నోళ్ళ

పెట్టుకుండా యిడ్లీలు ... కుక్కుకుంటూ, అసహ్యంగా. ఆకలి...?

జేబునిండా ఏవో కాగితాలు... రూపాయి నోట్లు మాత్రంకాదు. ఒక్క నోటే నా ఉంటుందేమో, ఓసారి చూస్తే ... ఎన్ని సార్లు...ఎన్నిసార్లు చూసినా ఒక్కనోటు దొరకలేదు టిక్కెట్టు...భద్రంగానే ఉంది. అమ్మయ్య! పరవాలేదు. భద్రంగానే... కోసం టిక్కెట్టైనా ?

అయిదుకి రెండునిమిషాలు తక్కువ. ట్రెయిను రావడానికింకా గంటా ముప్ఫయ్యేడు నిముషాలు. అదీ రైట్ టైమైతేనే...లేటుందా? చూసొస్తే ... యిప్పుడెవడు నడుస్తాడు! ఎంత వేగిరం తెల్లారి, ఎంత వేగిరం విశాఖపట్నం వెళ్ళిపోయి, హాస్టలుచేరి...

ఈ కుర్చీ బాగానే ఉంది. కూర్చుంటే హాయిగా ఉంది గడీకి విశాలంగాను, గడీకి టేబిల్‌మీదికి వంగి, గడీకి బాగా కిందికి జారిపోయి పీపుకింద కూర్చుంటూను... పేజీ మారినప్పుడల్లా హాయి! ... కొంత సేపయేసరికి నీరసం... ఆకలి కాదు. నీరసం!...వొంటినిండా, వొంట్లోని జీవకణాలన్నిటినిండా నిండిన ఆకలి.. ఆకలి కావడం మానేసి నీరసం అయిపోయింది.

రాత్రి తిన్నతిండి...యింతవరకూ అరిగిపోకపోవడం—ఆశ్చర్యం!... విచిత్రమైన అనుభవం...ఒక్కపూట తిండి మానేసిన అనుభవాలు ఒకటో, రెండో లేవనికాదు కానీ, ఇది...తిండిలేని ముష్టివాడి అనుభవంలాంటిది. 'కూలి' వాలని కూలివాడి అనుభవం ... అందుకే విచిత్రంగా ఉంది. యింతకు ముందరి అనుభవాల్లో 'నా యిష్టం' అనేది ఒకటుండేది. యిప్పుడదేలేదు ... అందుకే విచిత్రంగా....

చప్పరిస్తున్న చప్పుడు, పెద్దగా—విడురుగా...నల్లని పెదాలమీద... బలమైన వేళ్ళకింద...గ్లాసు నిండా కాఫీ... ముక్కు నిండా, గుండెల్నిండా కాఫీ వాసన... అంగుట్లోంచి, పక్కల్నించి...కాఫీ కోసం ఊరుతున్న లాలాజలం... ఒక్క గ్లాసుడు వేడి కాఫీ చప్పరిస్తే! ...చప్పుడు చేస్తూ, చప్పరిస్తూ...

కాఫీ తాగినవాడు లేచి వెళ్ళిపోయేడు. అతని కాకీరంగు నిక్కరు, దానిపైన వేసిన

# గీత

గులాబీరంగు బుష్‌షర్టు నలిగి, మాసి ఉన్నాయి ... ఏ నూటపాతిక రూపాయల ఉద్యోగమో చేస్తూ ఉంటాడు (వెంక్రటరమణకి నూటపాతికే యిస్తారు) ... వాడి బతుక్కి...వాడి నూటపాతిక బతుక్కి... వాడు, కాఫీ?...కాఫీ...

నవ్వొస్తోంది. ఇంత బాధలోనూ నీరసంగానే నవ్వొస్తోంది. వాణ్ని చూస్తే నాకెందుకంత కోపం?...ఈర్ష్య!

వళ్ళు తెలియని నిద్ర యింత పని చేసింది. పెట్టె...అందులో సున్నుండలూ, కజ్జికాయలు...మరేవిటి చెప్మా! ... ఆఁ! కజ్జికాయలు...నాలుగు చొక్కాలు...సున్నుండలు...సున్నుం ... మూడు పంట్లాలు... కాదు...నాలుగు...సంచి సున్నుండలు...

పర్సు కూడా పోయింది. పర్సులో పెట్టె రూపాయలు...నాలుగు పదులు, ఒక అయిదు, ఒక...

అయిదుగురు...అయిదడుగుల దూరంలో, టేబిల్ చుట్టూ. అయిదుగురు!...అయిదు గ్లాసుల కాఫీలు! ... అయిదు నవ్వుల మొహాలు! ... అయిదు రంగు రంగుల చొక్కాలు!...అయిదు ... కాదు, పదైదు ... ఫేడెడ్ పంట్లాలు... మూడు ఎయిర్ బేగ్‌లు... అయిదు వాచీలు ... అయిదు కళ్ళజోళ్ళు... యిద్దరికి గోల్డ్‌ఫ్రేం కళ్ళద్దాలు...అయిదు నోళ్ళలోకి అయిదు గ్లాసుల కాఫీల చప్పరింతలు ! !

డాక్టర్లు...అంతా డాక్టర్లయిపోయి .. అందరం... నారాయణమూర్తి... కాంత్... సత్తి... ప్రసాద్... రావుజీ...!

సిగరెట్లు, కాఫీ...దర్జా...నవ్వులు... అబ్బ! యిదేవి నీరసం... కళ్ళు మం... ఈరాత్రి గడుస్తుందా?...అయిదూ నెంబర్లే! యింకా అయిదూ వలఫైయేవో?...

హాం...'కొంత మంది యువకులు, రాబోవు యుగం దూతలు'... ఎవరు? ఎవ్రరాసే...శ్రీ శ్రీ...మహాకవి...మంటలకవి! మహాకవి శ్రీశ్రీ!...

నిశారుగా కూర్చున్నాను.

సైకలాజికల్‌గా ఫీలవుతున్నాను. ఉత్తినే బాధపడిపోతున్నాను... ఒకరోజు తిండేకద... ఒక్కరోజు తిండి లేకపోతే ... నో, నో! అయాము వెరీ యంగ్ మాన్. నేను యువకుణ్ని.

రెండు కంటిరెప్పల మీదా కాసేపు మెత్తగా నొక్కేను. రెండు కణతలూ మృదువుగా రాసుకున్నాను. కొంత హాయిగా, కొంత ఉత్సాహంగానే ఉంది. బి ఎలర్ట్!...

ఆకలితో ఉన్నవాడికే ఆకలి కడుపుల బాధ తెలుస్తుంది. ఆకలితో ఉన్నవాళ్ళంతా సికమౌతారు!...ఎవ్రరాసేరు? ఎవరో...

మళ్ళీ కాఫీ రుచిమీదికి మనసు...ఎలాగైనా కప్పు కాఫీ...

ఎవర్నైనా అడిగితే?...జరిగిందంతా చెప్పి. నే నెవరో ఎక్స్‌ప్లెయిన్‌చేసి... అడిగితే?... యివ్వకపోరు. యిస్తారు...ఎవరో ఒకరు...

## గులాబీ హల్వా

కావలసినవి:—

200 గ్రా. ఎండిన గులాబీ రేక్కలు (చూర్ణంగా)
100 గ్రా. లవంగాలు (చూర్ణంగా)
30 గ్రా. జాజికాయలు ( „ )
40 గ్రా. జాపత్రి ( „ )
20 గ్రా. కుంకుమపువ్వు ( „ )

ఈ అయిదు రకాలనూ మెత్తగా దంచబడే చూర్ణంగా చేసి కలపాలి.

ఇంకా:—

100 గ్రాముల తేనె.
300 గ్రాముల పంచదార.
కొంత కస్తూరి
— కూడా కావాలి.

తయారుచేసే విధానం:—

అన్ని చూర్ణాలనూ కలిపి ఉంచుకుని 300 గ్రాముల పంచదారను పాకం పట్టాలి. పాకం రాగానే ఈ చూర్ణాలను వేసి పాకంలో బాగా కలిపి ముద్దలా అవగానే 100 గ్రాముల తేనెను పోసి కాసింత కస్తూరిని కూడాకలిపి ముద్దగా తయారయిం తర్వాత సీసాలోగాని, జాడీలోగాని భద్రపరచుకోవాలి. ఉదయమూ, సాయంత్రమూ పూటకి 20 గ్రాముల చొప్పున తినవచ్చు.

ఉపయోగాలు:—

శరీరానికి మంచి కాంతిని, ఉత్సాహాన్ని, చురుకుదనాన్ని కలిగించడమే గాక తల తిరిగి నట్లుండుట, పైత్య దోషాలు, ఆకలిలేకపోవడం మొదలగు దుర్గుణాల్ని నివారించి మంచి జీర్ణశక్తిని కలిగిస్తుంది. ఆరోగ్యానికీ, బలానికీ చక్కగా పనిచేస్తుంది గులాబీ హల్వా.

—'మూర్తిశ్రీ జయసౌజన్య'

# మిక్కిలి సరసమైన
# ధర కలిగిన డిటర్జెంటు బిళ్ల




## శ్రీమతిగారూ, ఇదిగో మీకోసం బోనస్




టాటా
ఉత్పత్తి

బోనస్ నిజమైన బోనసు. బోనసులో ఉతుకుడు శక్తి బాగా నిండి ఉన్నది. అందు చేత తక్కువ బోనస్, తక్కువ శ్రమతో ఎక్కువ బట్టలను అత్యంత తెల్లగా, కాంతివంతముగా ఉండేటట్లు ఉతకవచ్చును. బోనస్ ఎటువంటి నీటిలోనైనా సరే అమితమైన నురుగు నిస్తుంది. ఎందువల్లనంటే బోనస్ ఉత్తమంగా ఉతికే డిటర్జెంటు—సబ్బు కాదు.

ఉత్తమ ఫలితాలకు, బట్టలను బాగా నాన బెట్టండి. ఉపయోగించిన తరువాత బోనసును పొడి ప్రదేశంలో ఉంచండి.

**బట్టలను అత్యుత్తమంగా ఉతకటానికి నడే వాడండి**

# బోనస్

—ప్రశస్తమైన డిటర్జెంటు

CMTB-6-244 TEL

ఛీ!...అలా అడగడేంవే?...పరువు?...ఎవడేమాట అంటాడో ... ఎంత ముష్టి ఆలోచన ... ఒకటే ఒక్క పూట ఆకలికి, యింత దిగజారుడా!— ఛీ...ఛీ అసహ్యం...నమీద నాకే ... ఏటువంటి ఆలోచన...నో, నో, నో!

సభ్యత...! అది నన్ను, బలమైన గీత...స్పష్టమైన గీత...అది సంస్కారం!

యింకెంత!...మరో ముప్పావు గంటలో ట్రెయిను...తెల్లవారే సరికి విశాఖ...

ఎంగిలి కాఫీగ్లాసు ఎడం చేత్తో పట్టుకుని, కుడిచేతిలోని గుడ్డతో టేబిల్ క్లీన్ చేస్తున్నాడు... నల్లగా ఉన్నాడు... అతని బనీను నల్లగా మాసింది ... అతని జుత్తు తుప్పగా మాసింది...అతని చేతివేళ్ళు పొంగిన నరాలతో, రోగం లాగున్నాయి! అతను అసహ్యం లాగున్నాడు దరిద్రం లాగున్నాడు...

ఎదుటి టేబిల్ దగ్గర......

ఒకో గ్లాసులో మిగిలిన కాఫీ చుక్కలు, ఒక్క గ్లాసులోకి వంపుతున్నాడు! నింపిన గ్లాసు సగందాకా నిండింది చేతినిండా గ్లాసు పట్టుకుని...?

అతను చెయ్యబోయేది నా కర్థమై పోయింది!

ఛీ! ముష్టి బుద్ధులెక్కడికి పోతాయి? కుక్కబతుకు...ఎంగిలి తినే కుక్కబతుకు, వాడు మనిషా!

# గీత

మనిషే!...వాడూ మనిషే! ... పాపం! పేదవాడు... ఆకలి? ...

ఆకలేం? దున్నపోతులాగ...లోపలేదో పడేస్తారుగా? అది చాలదేం? ... చాలదు కబోసు...చాలదేమో...చాలదూ?

ఆరుగురి ఎంగిలి తాగిస్తున్న ఆకలి! ...పాపం, జాలిపడాలి... ఈరోజుల్లో పేద వాళ్ళంటే జాలిపడాలి!...అది తాగితే అతని కళ్ళల్లోంచి జారే అవమానం ... తప్పదు. అతనూ మనిషేకద...ఆ కళ్ళలోంచి అవమానం జారిపడుతుంది. పాపం, నవ్వ కూడదు... నవ్వితే, అతని గుండెల్లో నిప్పు రవ్వలు రగుల్తాయి... అతని మొహం ఆ కాఫీ తాగుతున్నందుకు వేదనతో వణికిపోయి కమిలిపోయి. ఏ విషాదాన్ని పలుకుతుందో?

ఆరు గ్లాసుల్లోని అరగ్లాసు ఎంగిలి కాఫీ... గుటగుటా అతని గొంతు దిగింది. అతని కళ్ళు... కుక్కలాగ... ఎంగిలికూడు తిన్న కుక్కలాగ... కుక్క కళ్ళలాగ మెరి సేయి ! కుక్కలాగే...అతని నాలుక పెదాలని ముద్దాడింది. ఉషారుగా గ్లాసుతో గ్లాసు పేర్చి, కుళాయి వేపు నడిచేడు. తోకాడించు కుంటూ...తోకాడించే కక్కలాగ, ఉషారుగా...

నన్నని గీత!...సంస్కారం, సభ్యత? .. అందరికీ ఒకటే. రక్తమాంసాలున్న మనుషు లందరికీ... గీత చెదిరిపోయింది! గీత చెదిరి పోతోంది!...

నన్నని గీతమీద...ఒక్క చిక్కని మనిషి!...ఆకారం తెలియకుండా. తెలుస్తూ అమ్మ? నాన్న? పుట్టుక?...ఆ స్థితి!... ఆ స్థితికి కారణం? సభ్యతనీ, సంస్కారాన్నీ చెరిపేస్తున్న పరిస్థితికి...కారణం?

గ్లాసువద్ద చప్పుడు! ... కొట్టండి? వాడ్ని కొట్టండి! ప్లీజ్...వాడ్ని చంపేయండి!...గీత...

గ్లాసేమీ అవలేదు. అతన్నెవరూ ఏమీ అనలేదు...సభ్యత, సంస్కారం?...గీత చెదిరి పోతోంది ఎవరూ పట్టించుకోరు...ఎవరికీ అక్ఖర్లేదు.

అతనే!...అతనే గీతకి ప్రమాదం.. అతను చేసిన పని సభ్యతా? అసభ్యతా?...ఏది?... గీత దొరకడం లేదు...ఎంత వెతికినా... వెతకండి ప్లీజ్?...

ఎవరో కొడుతున్నారు ... తల పైన ఎవరో...తల లోపల!...నొప్పి...తల నొప్పి ...కాఫీ! బాబూ, బాబూ కాఫీ?...సభ్యత ...క్లీనర్?...ఎంగిలి కాఫీ కాస్త పట్టూ? ...ఎవరూ చూడకుండా పట్టూ. నో!నో!! ...రక్షించండి? గీతని రక్షించండి...దొంగ ల్నించి...నా పెట్టె, పర్సు.. అతని జీవితం ...పాపం, జీవితాలు...దొంగిలించేరు! పట్టు కోండి!

రోగాలొస్తాయి!...ఎంగిళ్ళు తాగితే రోగాలొస్తాయి...టి బి; బ్రోంకైటిస్ ... రోగాలొస్తాయి.. యింకా, త్రోట్ యిన్ఫెక్షన్స్, ఎన్నో...సిఫిలిస్...యిన్ఫెక్షన్స్ ఆఫ్ ఓరల్ కేవిటి...చిన్నప్పుడు పగిలిన చెంప!...నాన్నగారి కోపం...మరొకరి ఎంగిలి మరెప్పుడేనా తాగుతావా?...తాగను ... తాగను ... రోగాలొస్తాయి...మేడమ్! ... కళ్ళజోడు వెనక నించి, పెదాలు ముందుకి చాచి మాట్లాడే ...'ఎంగిళ్ళు తాగితే రోగాలొస్తాయి'... 'త్రోట్ యిన్ఫెక్షన్స్, మేడమ్!' రోగాలు... చావు...మర్డర్? ... చంపేస్తున్నారు! దరిద్రుల్ని...జీవితాల్ని దొంగిలించుకున్నవాళ్ళు ...హింస! మళ్ళీ...గీత చెదిరిపోతోంది!... హింసకీ, అహింసకి...గీత చెరిగిపోతోంది... చచ్చిపోతారు!...తాగకు, తాగించకు. ఎంగిలి తాగకు...ఆకలేసినా సరే...ఎప్పుడూ...ఆకలే వేస్తే?...ఆకలితోనేనా చావు గాని,...వొద్దు, ...ఎంగిలి కాఫీ తాక్కు...



లేచి నిలబడ్డాను. జనం- అటూ యిటూ కదుల్తున్నారు. ఆరుంపావు...కొద్ది సేపట్లో త్రెయినొచ్చేస్తుంది...

'యిదిగో, ఓ కాఫీ! స్ట్రాంగ్ కాఫీ ఒకటియ్యి?'

కాఫీ వేడిగా ఉంది. కాఫీ స్ట్రాంగ్‌గా ఉంది...తియ్యగా ఉంది.

'బాబూ, డబ్బు ఇయ్యలేదు' వెనక నించి...

'లేవు.'

'సార్ ?'

'లేవయ్యా, వినపళ్ళేదా ?'

'అయితే కాఫీ ఎందుకు తాగేరూ ?' గద్దిస్తున్నాడు!

'తాగాలనిపించింది కనక. ఆకలేసింది కనక'...

చిరునవ్వుతో క్లీనరు కుర్రాడివేపు చూసి, యజమానివేపు కసిగా, నిర్లక్ష్యంగా చూసి గబ గబా నడిచేను. నడుస్తూ, నడుస్తూ ఒక్కసారి వెనక్కి తిరిగి చూసేను ...వాడు పెద్ద డైలమాలో కొట్టుకు ఛస్తున్నాడు (నా వొంటిమీదున్నవి టెర్లిన్ షర్టు, టెరీన్ పేంటు!)

నిర్లక్ష్యంగా ముందుకి నడువబోయేను: ఎవరో చొక్కా కాలరు...గిరుక్కున వెనక్కి తిరిగేను. టెర్లిన్ చొక్కా ఆ గుప్పిట్లో నలిగిపోతోంది...

అతను?...అతనే!

'ఎంగిలికాఫీ'...అతని కళ్ళల్లో కోపం... అతని వెనక ప్రొప్రైటరు......

'డబ్బు లక్కడ పెట్టికదులు'

'నా దగ్గర లేవంటే...'

నా గొంతు నాకే నీరసంగా వినిపించింది, సాక్షాత్తూ అతనే...

చుట్టూ జనం...కళ్ళల్లో పరిహాసం, దొంగన్నూసినట్టు చూస్తున్నారు...

ఎవరో. జనన్ని తోసుకొస్తున్నారు. 'వదర్లా, వదులు!...కాలరు వదిలేసేడు. చొక్కా సర్దుకున్నాను.. ఆయన...ఎక్కడ చూసేను...'ఏటిసార్ ఈ గొడబ? వదండి. యిశావట్నంవేనా?...'

భుజంమీద చెయ్యేసి తీసుకుపోతున్నాడు. ఆ జనంలోంచి...ముఖ్యంగా 'అత న్నించి... ఎంగిలి కాఫీ...'

కళ్ళల్లో నీళ్ళు నిండినందుకు సిగ్గేసింది, ఆయన...ఓదారుస్తున్నాడు, అవును ఆయన...నవరంగ్ హోటల్ ప్రొప్రైటరు ...విశాఖలో! ఆయనే!

'థేంక్స్‌సార్'

'ఫరవాలేదులెండి, యింతకీ ఏటైలాగైంది మీ సామానేది? యిశాపట్నంవేనా ప్రయాణం?...'

* * *

'ఆళ్ళుకేటూర్, ఏ యెంగిలి కూడేన తినేస్తారు. ఆళ్ళబతుకే అంతకద!'

అవును. చెదిరింది గీతకాదు: నా మనసు...వాళ్ళబతుకే అంత!

గీత సురక్షితంగానే ఉంది.

గీతకి యిటు పక్క నేను నా సభ్య ప్రపంచం నియమించిన సభ్యతా సూత్రాలు, సంస్కారం నేను దాటలేను. ఆ సంకెళ్ళు నా పుట్టుకలోను, నా బతుకులోనే ఉన్నాయి.

గీతకి అటు పక్క అతను...అధికారం, అజ్ఞానం విధించిన సంకెళ్ళు అతనిని

గీత చెరిగి పోవాలంటే, సంకెళ్ళు తెగిపోవాలి. అన్ని సంకెళ్ళూ...తెగిపోయి తీరాలి! ●

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి.' ఆంధ్ర పత్రిక వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుచున్నాము.— సం॥



# వారఫలం

**24 3. 1972 శుక్రవారం మొదలు**
**30 3. 1972 గురువారం వరకు**

**మేషం:** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో అనవసరమైన సందేహాలు కలుగుతాయి.

స్త్రీలకు:— దైవకార్యాలు నెరవేరతాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృషభం:** వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం:** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. కోర్టు వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం:** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కన్య:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరుతో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల:** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడగలదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో శ్రద్ధ కలుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం:** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. సాహసములో కూడిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు:** సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోగలరు. వ్యాపారంలో ప్రయాస కలుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:** ప్రయత్నించిన ప్రతిపని సులువుగా నెరవేరుతుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కుంభం:** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**మీనం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

—మహేష్ ●

# చేతనైతే తప్పించుకో!

కె. రామలక్ష్మి



మీరు గమనిస్తున్నారో లేదో — రాను రాను—ఎవరికేనా చెప్పి కొంచెం సహకరించమనడం—చాలా కష్టతరంగా తయారవుతోంది. బాధ్యతలు స్వీకరించాలంటే ఎవరూ ముందుకి రారు. బాధ్యతలంటే మరీ అంత తేముకలు చేసేవి కావు. ఏదో ఒక నిర్ణయం తీసుకుని — 'ఔను' 'కాదు' అని కూడా ఖచ్చితంగా చెప్పడానికి జంకుతూంటారు. 'చూద్దాం' అనో 'అలాగే లే' అనో అంటారు గాని 'చేస్తాను' అనిమటుకు అనడానికి తెగ ఆలోచిస్తారు.

బాధ్యతంటే నా ఉద్దేశ్యం—చేసుకున్న' తీసుకున్న నిర్ణయాల ప్రకారం నిలబడగలగడం; మన నిర్ణయాల పొరపాటు కావచ్చు. ఒక్కొక్కప్పుడు బెడిసి కొట్టనూవచ్చు. అయినా ఓసారి తీసుకున్నదాన్ని కాదనడం అంత సులభం కాదు. మన నిర్ణయాలు తప్పుదారిన పట్టినప్పుడు తక్షణం బాధ్యతలని పక్కవాళ్ళ మీదకు నెట్టడం — నిజమైన పిరికితనం అంటాను. పెళ్ళి సంబంధం చూస్తాం. కావాలంటే మాట్లాడి పెడతాం అంతేగాని వాళ్ళలో ఏవో తేడాలొస్తే వాటి బాధ్యత మన మీదకు వాళ్ళూ నెట్టకూడదు. మనమూ స్వీకరించకూడదు' ఎందుకంటారా? 'సంబంధం మంచిదే కాని మనోవర్తి కోసం తప్పే బావతుగా తోస్తోందని' ఎంత నిజాయితీకి పడి చప్పేవాళ్ళైనా చెప్పలేరు కదా!

ఎవరి బాధ్యత వారు పక్కవారి మీదకు నెట్టి తప్పించుకోకుండా ఉంటే—ఈ లోకం ఎంత హాయిగా ఉంటుందో ఊహించలేం. నా ఊహలిలా ఉండగానే ఓ రోజున 'కాందిశీకులకి బట్టలు సేకరిద్దాం' అంటూ ఓ స్నేహితురాలు వచ్చింది. ఓ వారం రోజులు శ్రమపడి తెలిసిన, తెలియని ముఖాలన్నిటినీ పలకరించి కూడా సంతృప్తి కల్గే విధంగా మేం పాత బట్టలు సేకరించలేక పోయాం. 'మీ కెందుకొచ్చిన బెడదండీ' అని కొందరు, 'ఆ యీ పాతచీరతో కాందశీకుల సమస్య పరిష్కారం అయిపోతుందా' అని కొందరు, 'ఇవసలు అక్కడి దాకా చేరుతాయా?' అని కొందరు, మేము వెనక్కి తిరగ్గానే 'పనపాటా? హాయిగా కార్డ్సునుకు బయలుదేరారు' అంటూ పెదవి విరుపులే! నేనూ స్నేహితురాలూ అదే అనుకున్నాం — ఓ పదేళ్ళ క్రిందట యింత నిర్లక్ష్యంలేదు. ఏదేనా మంచిపని తలపెడితే—మేం వస్తాం, మేం వస్తాం అంటూ ఎంతో మంది ముందుకు వచ్చేవారు. కాని ఇప్పుడలా కాదు. ఎవరి గొడవలు వారివే. సామాజికమైన బాధ్యతలు మనం ఎందుకు చేపట్టాలన్న దృక్పథం ఒకటి ప్రస్ఫుటంగా కనబడుతోంది. అందేత ఎప్పుడు చేసినా ఎక్కడ చేసినా ఆ చేసే ఇద్దరో ముగ్గురో ముగ్గుముగ్గు కావడం జరుగుతోంది. ఇలాంటి వాళ్ళు 'ఏం లాభం లేకుండా ఎందుకు చేస్తారు?' అన్నమాట కూడా పడవలసి వస్తోంది! పని చేసేవాళ్ళు ఇలాగా యీ మాటపడక తప్పదనుకుంటాము! ఎవరూ ఏం చెయ్యడం లేదని కాదు నేననేది. అడపా తడపాయేనా ఇతరుల గురించీ, అవసరాలగురించీ ఆలోచించి, కొంచెం తమశ్రమ వెచ్చిస్తే బాగుంటుందని.

ఒక్క సంఘసేవా విషయాల్లోనే కాదు—యితరత్రా కూడా—యిలా తమను తప్పించి అన్న ధోరణి ఎక్కువై పోయింది. ఓసారి ఫోనుచేసి చూడండి 'మీరడిగేది మా డిపార్టుమెంటు కాదం'టారు. ఎవరికెలాగో మనకు కావలసినవి సధిస్తే—ఘన కార్యం చేసినట్టే — ఇలాంటివి ఎన్నో జరుగుతూ—కష్టపడి డబ్బు ఖర్చుపెట్టుకునే మనకి ప్రాణాంతకంగా తయారవుతాయి. ఎందుకు? అవతలిపక్క—ఎవరికీ బాధ్యత స్వీకరించడం — యిష్టం లేక పోవడమే!

మా అత్తయ్య అంటుండేది— 'సహాయం నిజంగా కావలిస్తే నీ కుడిచేతి చివరేవుంది' అని. 'కాని అది గ్రహించడానికి కూడా బాధ్యత కొంచెం వహించాలోయ్!' అంటాడు మామయ్య మటుకు!! ఎంతోనిజం కదూ?



## 2

సూర్యంకు తాతయ్యతో గడిపిన రోజులు కొద్ది కొద్దిగా జ్ఞాపకం వున్నయ్. అతను యెలుగెత్తి శ్రావ్యంగా పద్యాలు వర్ణించటం, తనచేత కూడా కూడ బలికించటం, బొమ్మలాటలో రావణాసురుడ్ని అతని ఒడిలో కూర్చొని చూడటం, గంగిరెద్దులు వస్తే ఆ యెద్దుమీద కూర్చుంటానని మారాం చెయ్యటం, విమానం యెగిరిపోతుంటే వింతగా ప్రజలు విరగపడి చూస్తుంటే అదికావాలని యేడవటం, యేటివేపు పరుగెత్తి దూకపోతుంటే యెవరో అడ్డుకుంటే వాళ్ల చెయ్యి కరవటం! తాత ప్రక్కనే పడుకోవటం తాతయ్య తనను నిద్ర పుచ్చడానికి కమ్మగా జోల పాటలు పాడటం—రామాయణ, భారత గాధలు చెప్పడం—ఇలా యెన్నో జ్ఞాపకం వున్నయ్. అంతా తాతయ్యే తనకు. తాతయ్య నిత్యం, సత్యంలా ఆ చిన్ని మనసుల హత్తుకపోయాడు. ఇంకా యెన్నెన్నో తాతయ్య నేర్పుతాడు, ఆచరిస్తాడు. అంతా తనకోసమే బ్రతుకుతున్నట్లు, అంతా తనదే నన్నట్లు సూర్యం లేత హృదయం ఉరకలు వేసింది.

ఆ చిన్ని హృదయం ఒకరోజు ఉదయమే చివుక్కుమన్నది. సృష్టించుకున్న బొమ్మల ప్రపంచం చిందర వందరైంది ఆశల ఆకాశం కూలిపోయింది. ఆనందం ముద్దంతా కరిగి కన్నీరైంది. తను తింటున్న తిండి వేపు, నడుస్తున్న నేలవేపు, చుట్టూ వున్న ప్రకృతివేపు, తన బంధువులు, ఆత్మీయుల వేపు, తోటి ప్రాణులవేపు, చివరకు తనవేపు తనే సంశయంతో చూడసాగడు. వెన్న ముద్దలాంటి తన మనసులో తాతయ్య చావు చేదుకలిపింది.

శరీరంలో యే భాగానికి దెబ్బతగిలినా మళ్లీ అతుక్కున్నట్లు, మనసుకూడా అతుక్కోడానికి ప్రయత్నిస్తుంది. కాలం మరపు మందుతో గయపడిన మనసులను కుదురుస్తుంది. కొత్త అనుభూతుల ఆహారంతో మనసును పోషించి కోలుకోనిస్తుంది. మనసు కడుపులాంటిదే. ఆహారంకోసం కడుపులా, ఆలోచనలకోసం మనసు యెదురు చూస్తుంది. వయసు పెరుగుతున్నకొద్దీ సూర్యంలో ఆలోచనలూ పెరిగాయ్. బంగారం ముద్ద కరిగి ఆభరణం తయారుచేస్తున్నట్లు, చదువు తన మేధస్సును పొంగించి తనకో ఆకారం యిస్తోంది. ఇది ఊహా వస్తువు అన్నట్లు సూర్యం సుజనుడు అనే పేరుతో పిలవాలన్నభావం అతనిలో ప్రాకింది.

తాతయ్య చిన్ననాట చెప్పిన గాధలు పద్యాలూ అన్నీ జ్ఞాపకం లేవు జ్ఞాపకం వున్నవాటిలో తలచుకుని అనుసరించాలని ప్రయత్నించటం ఒకవిషయంలో జరిగింది. 'బంతిలా సుజనుడు క్రిందపడి మరల మీదికి లేస్తాడు.'—తను మట్టి పిండం కాకుండా బంతిలా ఎగరాలని కోరిక చిన్న నాటే కలిగింది. బయట అతను బంతిలా గెంతే కుర్రాడు కాదు. అతని మనసులోనే ఎగిరాడు. స్వతహాగా సిగ్గు, నలుగురు మధ్యలో మౌనం, మూకకు దూరంగా వుండటం, ఒంటిగా కూర్చుని ఆలోచనల బంతిని మనస్సులో తన్నుకుంటూ గడపటం సరదా, హాయినిచ్చేది.

తన గ్రామంలో నిత్యం నూతనంగా కనిపించేది యేరు. చిన్నారి కళ్లతో అది బొబ్బలు పెట్టుకుంటూపోయే పరుగూ, ఆ ప్రవాహపు ఉత్తేజం చూసాడు. ఆ చెవులతో నదీమ తల్లిపరవళ్లు తొక్కుతూ చేసిన ఘీంకారం విన్నాడు ఆమె వేసవి వెన్నెల్లో మెల్లగా గజ్జలు కదుపుకుంటూ సంగీతం ఆలాపిస్తూ పోతుంటే తిలకించాడు. పచ్చని పైరు పొలాలు బంగారం పండించి బరువుతో తలలు వాల్చగా నిర్దాక్షిణ్యంగా కరుకు కొడవళ్లతో కొయ్యటం చూసాడు. బాల్యంలో యెన్నెన్నో చూసాడు. ఎన్నో మరచిపోయాడు. కొన్నే జ్ఞాపకం వున్నాయ్. అలా మరచిపోవటం వలనే కామోసు బాల్యం బాధ్యతలు లేనిదైపోయింది. ఇప్పుడు బాల్యంలో చూసినయేరు, ప్రకృతి, పచ్చని పంట పొలాలు, ఆకాశం, మేఘాల, వర్షం, యెండా, నీడా మళ్లీ చూడగానే మరచిపోలేని అనుభూతుల నిస్తున్నయ్. ఇదివరకు కళ్లు వీటిబాహ్యన్నే చూసేవి, మరచిపోయేవి ఇప్పటి కళ్లు వీటి హృదయాలతో తన హృదయానికి తీగలు వేస్తున్నాయ్.

ఆహారంతో శరీరం పెరుగుతూ ఆలోచనలతో అతని మనసూ పెరగజొచ్చింది. తృష్ణ వెలిగి నాలుగు ప్రక్కలా కాంతిని వెదజల్లింది. ఇదివరకు ఈ మొక్కకు వున్న కంచె యిప్పుడు మొక్క పెరగ్గానే అవసరం లేకపోయింది. వయసు వచ్చిన చెట్టు చిన్ననాటి ఆకులను రాల్చకుండా వుండదు. ఆకులు రాల్చి కొత్త చిగుళ్లను మొలిపించడంతో సరిపోదు! యౌవనం పూలను సృష్టిస్తుంది. వాసనలను వెదజల్లుతుంది. పూలు కాయలౌతాయ్, కాయలు వేళకటారి పళ్లై రాలుతాయి. రాలినపండు పాంథుడికి తృప్తినిచ్చి సంతతిని వృద్ధిచేస్తాయ్! తను యౌవ్వనంతో మొగ్గలు దొడిగిన చెట్టులా వున్నాడు. అతని చదువులోకూడా గుబాళింపు కనిపిస్తోంది. ఒంటిగా యేటిఒడ్డున కూర్చున్న తనకు గజ్జెల రవళులు వినిపించలేదు. ఏటి గతం జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాడు. దానినో యమునానదీ తీరం అనుకున్నాడు. వేలాది యేళ్ల వెనుకకు తన వూహలు పోయాయ్. తనో శంతన మహారాజులా వూహించుకున్నాడు. 'సత్యవతివేపు రెప్పవెయ్యకుండా చూస్తూ నుంచున్నాడు, మహారాజు. సుగంధమే సుగంధం. దాన్ని మించినట్లుంది అందం. పదారో వన్నె బంగారం పనికి రాదంటున్నది శరీరకాంతి. పూలతీగలా నవనవలాడుతోంది దేహం. బెదిరిన లేడి పిల్ల కళ్లలా వున్నాయి నేత్రాలు. చిరునవ్వుతో వెన్నెల కాస్తోంది మోహం. మతిపోయినట్టు అయింది మహారాజుకి.'

ఇలాంటి ఆలోచనలతో సూర్యంకు మతిపోయేది. అంత అందకత్తెను పొందా



అన్న కోరిక వెనుక అరితగాగా ఆడదాన్ని వర్ణించగల వూహకూడా కావాలన్న కోర్కె కలిగింది. ఊహల్లో యెన్నోఅందాలు తొణికిస లాడేవి. ముసుగుదీసి చూస్తే చందమామ ఒక కాంతలా, గడ్డిపూచ ఒక యౌవ్వనిలా, నీటి బిందువు ఒక స్త్రీలా కూడా కన పడేవి. ఓ ఆధునిక కవి ఆలాపనను మననం చేసుకున్నాడు.

'ముసుగు దీయవు రావు నా ముందు కబల
యేల యడియాసజెట్టె దీ లీల బాల
యే నొనర్చిన యపరాధమేమొ చెపుమ
హృదయమును జింపి పెట్టెద నిదిగొ
కొనుము.'

సూర్యం హృదయాన్ని చింపే ప్రకృతి ముందు పెట్టాడు. ఆమె అందాల విందులు, అపురూపమైన రూపాల మార్పులు, ప్రేమ పలుకుల పరిహాసాలు, చిరునగవుతో చిన్నారైన చిలిపితనం అన్నీ భరించాడు. అతను యెన్నో ఆశించాడు. చల్లని దరహాసం, ఆమె చేతిలో పెట్టే గిలిగింతలు, ఒక బిగి కౌగిలి, హృదయస్పందన, ఒక ప్రేమకానుక —ఇలా యెన్నెన్నో కాంక్షించాడు. అతనూ అలాంటి ప్రేమగీతి రాయాలనీ, అలా ఆడదాన్ని వర్ణించాలనీ, తను విన్న కమ్మని గొంతుకతోనూ ఆలాపించాలనీ, హృదయం పొంగించిన నాట్యం చూసి తను అలా నాట్యం చెయ్యాలనీ— ఇలా తను కన్నవీ, విన్నవీ, వూహించినవీ — యెన్నెన్నో కోరుకున్నాడు. అలా కోరుకోవటంలోనే ఆనందాన్ని పొందాడు. అతను అవి పొందలేక పోయినా వాటిని స్వంతం చేసుకున్నాడు. అలా చేసుకునే హక్కు సృష్టించిన మానవుల వారసునిగా తనకున్నదన్న గర్వంతోనే వాటిని తనవిగా చెప్పుకున్నాడు.

* * *

సూర్యం చదువు స్కూలుఫైనలుతో ఆగిపోయింది. అంతకు పైకిపోయే గీత మావాడిలో లేదని తండ్రి చింతించాడు. సూర్యంకు గీతల మీద నమ్మకం లేదు. చదువుదామన్న కుతూహలం వుంది. మంచి వస్తువు గాలిలో నిలబడదు. వేరువుండాలి. ఎవరెన్ని నీతి వాక్యాలు, వేదాంతం చెప్పినా సంసారానికి వేరువు డబ్బన్నది ఒప్పుకోక తప్పింది కాదు. దాని విలువ, అది లేక అనుభవించిన వాళ్ళకు తెలుస్తుంది. ఒకరిచేత ప్రేలు చూపించు

# నాలుగుమెరమెచాలు

కోవటం సూర్యంకు కిట్టని పని—చదువులో కూడా 'నా కిది తెలీదండి మేష్టారూ' అని చెప్పకుండా చదివాడు. తెలివైన కుర్రాడని పించుకున్నాడు. చదువు మీద మమకారం తగ్గకుండానే యేమీ వుబుసుపోకపోతే వుద్యోగం మీదకు మనసు పోయింది. పల్లెలో కూర్చొని తను చేసిందేమీ లేదు. ఒకచోటి అందం చూడగా చూడగా ఒక గోడపై గీసిన పెయింటింగ్‌లా ఒకేరీతిదై పోయింది. మార్పు కావాలి. మార్పుకోసం తహతహలాడి పదిచోట్లకు ఉద్యోగంకోసం పది అప్లికేషన్లు పెట్టాడు.

ఎవరో దూరపు బంధువు 'మీ అబ్బాయి చాలా తెలివైన కుర్రాడని విన్నాను. ఒకసారి చూడనిస్తారా?' అని వచ్చారు.

సూర్యం తండ్రి సగర్వంగా కొడుకును చూపించాడు. కుర్రాడు దబ్బపండులా వున్నాడు. తలలో జుత్తు మెలికలు తిరగటానికి వురకలు వేస్తోంది. ముఖంలో గంభీరమైన హుందా మధ్య కనికారంతో నిండిన కళ్ళు మెరుస్తున్నాయ్. ప్రేమ పూలను వాసన చూసే కుదురైన ముక్కు— ఆపైన వెడల్పాటి నుదురు. మమకారం యేర్పడింది.

'కుర్రాడిని నేను చదివిస్తాను' అన్నాడు.

సూర్యం తండ్రికి సంతోషం వెంటనే సంశయం పొడచూపింది. మానవనైజాన్ని యింతో అంతో అర్థం చేసుకున్నవాడు కాబట్టి మౌనం దాల్చాడు.

'నాకు ఒక్కర్తే అమ్మాయి. అబ్బాయిని చదివించి బాగుచేసి ... అల్లుడ్ని చేసుకుంటాను.'

ఇంత చులకనగా అతను చెప్పినందుకు సూర్యంకు ఆ వయసులోనే మనస్సులో మహోగ్ని రేగింది 'నేను డబ్బుకు అమ్ముడుపోను నాన్నా' అన్నాడు చాటుగా!

'ఆలోచించు నాయనా! ఎక్కడ వున్నా నివు వృద్ధిలోనికి వస్తే మాకదే పదివేలు! నీ తెలివితేటలను వినియోగించలేని చవటనై పోయాను' అన్నాడు తండ్రి.

సూర్యంకు యీ చివరి మాటలు బాధించాయ్ 'డిగ్రీ లేవంతమా తాన నా తెలివి రోజుకు రోజూ పెరక్కుండా పోదు నాన్నా! నాకు మీ అబ్బాయిగావుండే గర్వం వాళ్ళ అల్లునిగా వుండటానికి లేదు! నేవెళ్ళను' అన్నాడు.

ఆ వయస్సులోనూ సూర్యంకు యెదుటి వాళ్ళు నాటుకున్న ముక్కలను వాళ్ళ యెదరగానే బలవంతాన పీకి పారెయ్యటం యిష్టం లేదు. ఎదుటివాని వూంతోట లోనికి చొచ్చుకుని ముక్కలను మేసే పశువుగా మారటం అంతకంటె యిష్టం లేదు. అంచేత తండ్రితో 'అబ్బాయికి చదవాలని లేదు. ఉద్యోగం వేస్తానంటున్నా'డని చెప్పించాడు.

'వచ్చిన అదృష్టం వదులుకున్నాడని' కొందరన్నారు. 'ఈ కుటుంబాన్నెత్తడానికి బాధపడే గీత పీకికుంటే ఆ భాగ్యవంతుల యింట్లో యెందుకు పడ్డాడు?' ఇలాంటి మాటలువిన్న సూర్యంలో పట్టుదల హెచ్చింది: ఆ గీత అయాచితంగా ఒకరు గీసేకంటే తనే కష్టపడి ఆ గీత సృష్టించుకుంటా ననుకున్నాడు. బ్రహ్మరాసినరాత బద్దలు కొట్టటంవలనే బూడిదలో కప్పబడుతుంది. రాదు అనే దానికంటే వస్తుంది అన్న ఆశ వలనే జీవితం విలువ పెరుగుతుంది. ఒకరికి ఒక ఉపకారంచేసి ప్రత్యుపకారం కాంక్షించటంవలన మనిషి నిరీక్షిస్తూ చచ్చిపోతాడు. తనకు వర్షం కురిసాక విడిపడే మేఘంలా, వెలుగిచ్చి క్రుంగే సూర్యునిలా, పళ్ళురాల్చాక మొక్కలు రాల్చే వృక్షంలా వుండాలని వుంది. మనిషి క్రుంగాక మరి లేవలేడు. మేఘాలు మళ్ళీ అల్లుకుంటాయ్ సూర్యుడు మళ్ళీ వుదయిస్తాడు. చెట్లు మళ్ళీ చిగురిస్తాయ్.

ఇలా వుండాలంటే తనకు 'నేను నేననే' గర్వం వుండాలి. ఆ గర్వం తను తలెత్తి తిరిగితేనే వస్తుంది. తన వుద్యోగంకోసం కూడా పదిమందీ పిల్చి చూడు వాడ్ని చూడూ అన్నారు. దొడ్డిత్రోవగుండా యింట్లో దూరటం తనకు యిష్టంలేదు. ఈ యిల్లు నాదీ అన్నట్లు గేహంలోనికి ముందు గేటునుంచే తలెత్తుకొని వెళ్ళాలని తన ఆశ. ఇంట్లో యెంత స్వాభిమానంతో కాలుపెట్టాడో అంత నమ్మకంతో అంత బాధ్యతతో అంత సమర్థతతో అతను పని చేయసాగాడు. లోకం అంతటా మాలిన్యం ఒక్కటే లేదు. అన్యాయం అవినీతితో కోరికలు తీర్చుకోడానికి ప్రయత్నించి మరింత మాలిన్యం కుప్పలను సృష్టించటం అతను




ముగ్గురు మహిళలు. మూడు పూర్తిగా వేరైన అవసరములు. కనుక మూడు వేరైన ఉతికే పొడర్లు కావాలా?
"అట్టి అవసరము లేదు." అంటారు మా పరిశోధనా సాంకేతిక నిపుణుడు. "ఆ మూడు అవసరములను ఒకే ఉతుకు పొడరు ద్వారా తీరుద్దాము."
దాని ఫలితము:

# క్రొత్త త్రివిధోపయుక్తమైన డెట్




- క్రొత్త డెట్ హెచ్చు తెల్లని పొడరు—దుస్తులను అతి తెల్లగా ఉతుకుటకు మేలు రకపు పదార్థము.
- క్రొత్త డెట్ బట్టలను అదనముగా శుభ్రపరచె శక్తి గలది. అంటివున్న మట్టిని కూడ వదలించి, రంగు బట్టలను ప్రకాశవంతముగా చేస్తుంది.
- క్రొత్త డెట్ యిచ్చే సమృద్ధియైన నురుగులో ఒక ప్రత్యేకమైన మృదువుగా చేయు పదార్థముంది. అది బట్టలకు ఎంతో నిరపాయమైనది మరియు చేతులకు ఎంతో మృదువుగా ఉంటుంది!

**5 క్రొత్త సైజులు: డెట్ 200, 400, 600, 800, 1000**

Shilpi-HPMA 61F/71 Tel

యిష్టంలేదు. కోరికలకు ఆకారాలుండవు. అవొక యెండమావుల్లాంటివి. ఎంత పరుగెత్తినా పిడికిటలో పట్టలేం. ఆ యెండమావుల అందాన్ని దూరంనించి చూచి సంతోషించటంలోనే వుంది సుఖం !

సూర్యం సుఖాన్ని కోరికలు తీర్చుకోవటంలో కాదు. తీర్చుకోకపోవటంవలన పొందసాగాడు. యెత్తుపల్లాలున్న ప్రకృతిలా, ఆరుబుతువులున్నకాలంలా జీవితం వుండాలని అప్పుడే కదలిక వస్తుందని, కదలికతో అందం, అందంతో ప్రాణం తొణికిసలాడుతుందని కోరుకున్నాడు.

అతను అందుకే నాలుగుగోడలమధ్య పట్టెమంచం పరుపుమీద పడుకోలేదు. నేల చాపమీద దొర్లాడు. జేబులోనున్న డబ్బులు యింకొకరికిచ్చి తను ఒక పూట నోటిలో మంచినీరుపొయ్యకుండా ఆకలి యెలా వుంటుందో అనుభవించాడు. చలిలో పడుకున్నాడు, ఎండలో యెండి వానలో తడిచాడు. కొండలెక్కాడు, దిగాడు అనవసరంగా మాటపడ్డాడు, అవమానం సహించాడు. ఒంటిగా తిరిగాడు. రోడ్లవెంట పడ్డాడు. జూలియట్‌లేని రోమియోలా తిరిగాడు

అతని చేష్టలతో తిరుగుళతో యెన్నో వూహాల గ్రంథాలు అతని మనస్సు లైబ్రరీలో నిండుకున్నాయి. ఆ పుస్తకాల్లో పరిచయమైన వ్యక్తులు, అమ్మాయిలు ఒక్కొక్కవిధమైన సందేశాలు యివ్వసాగారు అలా తిరుగుతూనే కొన్నేళ్ళకు అతను బియ్యే అనిపించుకున్నాడు.

అతను పనికి వూహల వొత్తిడికి తగ్గ బలం ఆ శరీరంలో లేకపోయింది. మొక్క మనోహరమైనదైనా నేల రాళ్ళతో నిండిపోయింది. హోటలు భోజనంలో రాళ్ళు, సున్నంనీరు అతని పొట్టను గోకాయ్. ఈ లోకం అంతా కడుపుకోసమే ప్రయాసపడుతుంది. ఎండా, వానాపంటకోసం, గాలి, రక్తం శుభ్రం చెయ్యటానికి, అగ్ని వంటకు యీ ధాన్యాదులు, పళ్ళూ, దుంపలూ, ఆఖరికి భూమిలోని ఖనిజాలుకూడా యీ కడుపుకోసమే పాటుపడుతున్నాయ్. కడుపు నింపటంకోసం ఒక అన్యాయం ఒక అవినీతి సహించతగ్గది. కాని యింద్రియ సుఖాలకోసం యెదుటివాళ్ళ కడుపులను మాడ్చటం అమానుషం. మనదేశంలో ముఖ్యంగా కడుపుకు సంబంధించిన వాటి విషయంలోనే అన్యాయం జరుగుతుంది,

లాభాలు- రేడియోలు, పౌడర్లమీద నూటికి నూరు బిగిస్తే ఫరవాలేదు, పాపంకాదేమో కాని; తిండిగింజలు, నూనెలు వగైరా తినుబండారాలమీద దొంగవ్యాపారం, కల్తీయివన్నీ అమానుషం. మనిషి రాక్షస హృదయంకలవాడైతేనే యీ పని చెయ్యగలడు.

రాక్షసహృదయుడైన హోటల్ యజమాని సూర్యం కడుపు చిన్నది చేసాడు. మచ్చలెరగనిపొట్టలో మచ్చలను వాడి ఆహారంతో సృష్టించాడు. ఆహారంకోసం ఆత్రతతో చూస్తుండిన కడుపు అది కడుపులో పడగానే బయటకు తోయటానికి ప్రయత్నిస్తోంది, ఇదివరకు మనసుతో ఘర్షణ కదలిక వుండేది ఇప్పుడు కడుపులో అలజడి బయలుదేరింది చివరకు సూర్యం తల్లి వచ్చి బసపెట్టవలసి వచ్చింది ఆ తల్లి ప్రేమ రానురాను ఆ మచ్చలరగుడులపై తెరకప్పింది. ఇప్పుడు అన్నం సహిస్తోంది. ముఖం పచ్చబడింది జీవితంపై మళ్ళీ మమకారం, ఆశా చిగుర్చినయ్.

సూర్యం పదిహేను రూపాయల అద్దెకు తీసుకున్న యిల్లు ఒక లోగిల్లోవుంది. ముందుకు రెండు కుటుంబాలు. ఒక భాగంలో యింటి యజమానురాలి సంతతి. వెనుకభాగంలో ఉత్తరవేపు రెండు చిన్నగదులున్న భాగంలో సూర్యం, తల్లి వుండేవారు. ముందుకు చిన్న వరండా — వెనుక వరండాలో ఒక మూలకు వంటకొట్టు వరండా వెనుక రెండడుగుల జాగా, వెనుక ప్రహరీగోడ. ఈ భాగానికి ప్రక్క భాగానికి ఒకటే పెరడు. ఈయింటి ఆడవాళ్ళు ఆయింటి ఆడవాళ్ళకి అదే రహదారి. పొరుగు యిల్లు ఒక్కటేగది! ఆగది వెనుక వరండా బదులు వంటయిల్లు. అంటేంట ఆభాగంలో రెండు చిన్న అరుగులుండేవి. ఈ వెనుక భాగానికి రావటానికి చిన్న సందు రోడ్డువీధనించి వుండేది ఆ సందులో గోడ ప్రక్కనే ఒంటికొబ్బరిచెట్టు నాకేమన్నట్లు హాయిగ గాలిలో కదలేది. వెన్నెల్లో వెలిగేది, వర్షంలో తడిసేది, యెండలో యెండేది. ఐనా దాని అందం తరగలేదు. విరగలేదు. ఒకోసారి గర్వంతో నిగనిగలాడుతున్న పడుచులా నిండుగా గెలలతోనుండేది. ఆ బరువుదిగగానే మల్లెపూల గుత్తులు తలలో ముడుచుకున్న యౌవ్వనిలా మనోహరంగా ప్రియుని ఆహ్వానించేది.

సూర్యం యీకొబ్బరిచెట్టు సమ్మోహంలో పడి ఆ చెట్టువేపు యేదో ఒక సమయాన దొంగమాపు చూసేవాడు. అలానే అతని కళ్ళకోసం అప్పుడప్పుడూ వెతుకుతున్న అమ్మాయిలవేపు చూసినా తల చప్పునదించేసేవాడు అతను యెదుటివారికి యిబ్బంది కలిగిస్తున్నా నన్న ఆలోచన అంత వడిగా మార్పుతెచ్చేది. సంసారుల కుటుంబాల మధ్యలో పెళ్ళికాని తనవేపు వాళ్ళెవరు వేలు కత్తిలా చూపించి తను భద్రంగా పెంచుకొస్తున్న అహాన్ని పొడ

## కోరిక

కవి కావాలని ఉంది
కవి కావాలని ఉంది
ఎదలో నిలచిన రూపాలన్నీ
మదిలో మెదిలిన భావాలన్నీ
చెవులకు యింపుగ, కనులకుసొంపుగ
కమ్మని కథలా, రాసేటందుకు
కవి కావాలని ఉంది
కవి కావాలని ఉంది
అరుణోదయపు ఎర్రని కాంతులు
తరుణిమణి నునుచెక్కిలియేయని
పున్నమి వెన్నెల చల్లదనాలు
కన్నెవలపు హృది తియ్యదనమ్మని
చెవులకు యింపుగ, కనులకు సొంపుగ
కమ్మని కథలారాసేటందుకు
కవి కావాలని ఉంది
కవి కావాలని ఉంది
ప్రేమజీవుల ఏకత్వంలో
ప్రకృతియంతా, నిండి ఉందని
ప్రణయజీవుల స్మృతి చిహ్నాలని
ప్రబోధగీతం రాగంలాగ
చెవులకు యింపుగ, కనులకు సొంపుగ
కమ్మని కథలా రాసేటందుకు
కవి కావాలని ఉంది
కవి కావాలని ఉంది
ప్రణయ తత్వం ప్రమోదమ్మని
ప్రణవతత్వం ప్రబోధమ్మని
ప్రళయతత్వం ప్రమాదమ్మని
ప్రగతి తత్వం ప్రయోజనమ్మని
చెవులకు యింపుగ, కనులకు సొంపుగ
కమ్మని కథలా రాసేటందుకు
కవి కావాలని ఉంది
కవి కావాలని ఉంది.

—బి. సీతారామారావు

వేటలి యిష్టంలేదు. అలా పోడిపించుకునే అవకాశం యివ్వకూడదనే మనసు వువ్విళ్ళూరుతున్నా రిత్తైనంత హెచ్చుకాలం బయటే గడుపుతున్నాడు. ఈ కాలంలో యే లైబ్రరీలో కూర్చొని తనకు యిష్టమైన పుస్తకాలు, ఒకోసారి యిష్టంలేని పుస్తకాలు కూడా చదవసాగాడు. సాహిత్య పరిచయం తన కళావిహీనమైన మనసుకు వెల్ల వేసేది. తనదిగ జారిపోతున్న ఊహలకు చేయూతనిచ్చేది. ఊహల్లో వ్యక్తులకు దరిగా చేరి వాళ్ళ వేపుచూసి కనికరించటానికి యే లోపాలు కారణమయ్యాయో వాటి దగ్గరగా తను పోకుండా వుండటానికి యేం చెయ్యాలో ఆలోచించుకునేవాడు. ఈ ఆకాశం క్రిందవున్న అన్నిటితో పరిచయం చేసుకోవాలనీ. వాటి బాగోగులు తనవి చేసుకోవాలనీ చివరకు తన హృదయం ఆకాశమంత్తై వీటన్నిటినీ యిముడ్చుకోవాలని ఇలా ఊహల రదానికి కోరికల గుర్రాలు పూన్చి ఆశల కళ్ళాలతో లాగేవాడు.

అలాంటి సరుగుల ఊహల్లో సారుగున మామ్మ అగపడింది. ఆమెకు యెవరూ లేరు. ఉన్న ఒక్కకొడుకూ పిచ్చివాడై పోయాడట. ఏవో పొలాలమీద కొద్ది పంట వస్తుంది. అది అమ్ముకొని యింటికి అద్దె యిచ్చుకుని కాలం గడుపుతోంది. ఆ పల్లెటూరికి పోకండా యిక్కడే వుండటానికి కారణం ఆమె అప్పుడప్పుడూ పిచ్చాసుపత్రికి వెళ్ళి కొడుకును చూడాలన్న ప్రాంతే!

ఆమెవయసు అందాన్ని మింగలేక పోయింది ఇంకా ఆమెలో ఆనాటి రూపు రేఖలు, రంగుటద్దాల్లో ప్రకృతి చూస్తే యెలా కనిపిస్తుందో అలా కనిపిస్తున్నాయ్. ముఖంలో తేజో రేఖలు ముడతలు పడటానికి తృణీకరిస్తున్నాయ్. ఆమె కళ్ళను కన్నీరు తడిపి తడిపి కంటిపాపలను ముంచి ముంచి చివరకు విసిగివేసారి విడిచిపెట్టాయ్. ఆమె తన ఒంటి బ్రతుకునకు విచారించటం, దీనత్వాన్ని ఒకరితో చెప్పుకోవటం సూర్యం వినలేదు. బ్రతకటం ఒక విధిగా తీసుకున్నట్లుంది. అలాంటప్పుడే యెలాంటి భారమైనా నీటిలోనుంచి తాడుతో లాగినట్లు తేలి తుంది. నెరసిన తల వెంట్రుకలు తెల్లని సిల్కు దారాల్లా నేలాడుతున్నయ్. ముక్కు బాగా పూసిన గులాబి పువ్వులానుండి తాకాలన్న కోరిక పెట్టిస్తోంది.

ఆమె సంధ్యాకాలంలో యెరుపు దేరిన పశ్చిమాకాశం వేపు తిరిగి తలవంచిన సూర్యకాంతపు పువ్వులా వుంది. ఆ పువ్వు ఆరోజు వుదయమే తూర్పువేపు తిరిగి తలెత్తే కాలంలో తను పుట్టనందుకు సూర్యం చింతించాడు ఆమెను వయసులో చూసి, మాటాడి యెన్నెన్నో తియని వూహలు అల్లుకునే అదృష్టం తనకు లేనందుకు విచారించాడు. ఐనదీ కానిదీ పట్టుకుని వూగులాడకండా వచ్చిన దానికీ, అయిన దానికి రూపులు దిద్దుకుని సంతోషించటం, సుఖపడటం నేర్చుకోవటం అలవాటు చేసుకుంటున్నాడు. ఈ అలవాటే సంసారికి సుఖాన్నిస్తుంది. సుఖం కోసమే మనిషి సంసారి కావాలి.

సూర్యంకు సంసారి కావాలని వుంది. పెద్దలు సృష్టించిన పూలవనాన్ని పీకి తనో క్రొత్త బృందావనాన్ని సృష్టించాలని లేదు. ఆ వనంలో మరికొన్ని కొత్త పూల మొక్కలను నాటగలిగి ఆ చెట్లు పెరగటానికి నీరు పొయ్యగలిగే తోటమాలిగా నుండాలని వుంది. గతంలో నిల్చున్న కాళ్ళను భవిష్యత్తు కోసం వర్తమానంలో గాలిలో యెగరనివ్వదలచుకో లేదు. గతంలో నిల్చొని, భవిష్యత్తుకోసం వర్తమానంలో క్రొత్త వూహలకు చేతలతో ఆకారం యివ్వదలచాడు. అందుకు అతను వృత్తిచే చిన్నవాడు కావచ్చు. ఈ మహా సంగ్రామంలో ఆ క్షోణీ ల సేన ల లో ఒక గుర్రపువాదుకున్న మేకే కావచ్చు తను.

దేని విలువ దానికుంది. ఒకనాడు యేవిలువా లేదని వదలిన యిసుకరేణువులు కొన్నాళ్ళకు అద్దాలై యెవరిరూపాలను వాళ్ళకే చూపించాయ్. ఆ రేణువులే మళ్ళీ కాల ప్రవాహంలో శబ్దాన్ని సృష్టించే ట్రాన్సిష్టర్లు అయ్యాయ్. ఒక వ్యక్తి విలువ యెదుటివాడు తెలుసుకోనంతమాత్రాన వాడికి విలువ లేకపోదు.

అప్పటికి అతను రేణువులాగే చిన్న వుద్యోగంలోనే వున్నాడు. దాని విలువ కనిపెట్టే సైంటిస్టులా అతనిపై ఆఫీసరు సూర్యంలోని నిజాయితీని తెలివితేటలను, బాధ్యతలను పైనవేసుకొనే సమర్ధతను కనిపెట్టుసే పనులు అప్పచెప్పి పరిక్షచేసేవాడు సలాపేక్షలేని అతని నిజాయితీకి వీపు తట్టేవాడు. ఎదుటివాని గొప్పతనం గుర్తించటంలోనే మనిషి తను గొప్పవాడౌతాడు. అలానే మామ్మ గొప్పతనాన్ని సూర్యం గుర్తించసాగాడు.

మామ్మ సూర్యంకు మర్యాద యిచ్చేది. ఆ మర్యాద కొద్దిగా సిగ్గుతో చూపించేది. ముఖాముఖి ఆరునెలలైనా యింకా మాటాడలేదు. 'బాబు తిన్నారా?' 'ఈనేళ బాబు ఆఫీసుకు శలవా?' 'బాబుకు వంకాయ ముద్దకూర యిష్టమేనా?' - ఇలా యెన్నెన్నో తనగురించి తల్లితో ప్రశ్నిస్తుంటే సూర్యం ఆ పలుకులు వినేవాడు. తన బాగోగులు యిష్టాయిష్టాలు కోరి తెలుసు కుంటున్నదంటే అభిమానం హృదయాంతరాళంలో వుండి తీరాలి.



# నాలుగు మంచాలు

ఒకరోజున 'నీకేం తల్లీ? గంపెడు పిల్లలను కన్నా తొలికాన్పు ఒక రత్నాన్నికన్నావు. ఈ వయసు బిడ్డలు తుప్పన ౹తుళ్ళు తారు. కాస్త గొంతుక తగ్గించి 'చుట్టూ 'యింతవుంది అమ్మాయిలు తుళ్ళుతున్నారు గనీ మీ బాబు దించిన తల యెత్తడు.'

ఈ మాటలు విన్న సూర్యం ఆమె గురించే ఊహించసాగాడు. యౌవ్వనం వెన్నెల వెలుగు లాంటిది. ఒకోసారి మేఘాలు కప్పినా ఆ వెలుగులో అందం వుంది. ఏ కోరికలు పుట్టినా, ఏం సాధించినా, ఏం నేర్చినా, ఓర్చినా — జీవితంలో వసంతం యౌవ్వనం. యౌవ్వనంలోనే యెందుటాకులో గడచిన పచ్చదనం, నిశీధంలో వెలుగు, కష్టాల్లో సుఖాలు వూహించి తృప్తిపడగలిగేటట్టు మామ్మ ముసలితనంలో యౌవ్వనాన్ని సూర్యం వూహించి తృప్తి పడ్డాడు. ఆమె యౌవ్వనంలో వుండి అభిమానంతో తన బాగోగులు తెలుసుకుంటుందనే భావన కలిగింది. ఎదురగానున్న కొబ్బరి చెట్టుకూ మామ్మకూ బేధమేమిటి? మిగతా జంతుజాలాలకూ, వృక్షజాతులకు మనిషికీ బేధమేమిటి? ఈ కొబ్బరిచెట్టులా కొన్ని కోట్ల కొబ్బరిచెట్లు కనిపిస్తాయే కానీ మామ్మ రూపుతో యింకో మనిషి కనపడదు ఒక మనిషికి యింకో మనిషికి రూపులో, గుణంలో తేడా ఉండబట్టే కామోసు మనిషికి ప్రాణుల్లో ప్రత్యేకత వచ్చింది. అలానే ఒకరి జీవితంలో తేడా లున్న మార్పులవలన ప్రత్యేకత వస్తుందేమో?

ఒకనాటి సాయంతం ఆఫీసునుంచి వచ్చేసరికి పొరుగింటి అరుగు మీద ఒక అమ్మాయి కూర్చుంది. తనవేపు ఆ పిల్ల ఒక్కసారి దీక్షగా చూసి లోనికి సిగ్గుతో కదలిపోయింది. సూర్యంకు ఆ కళ్ళు సరిగ్గా తన కంటి పాపలనించి హృదయంలోనికి చూసినట్లయింది. ఎలాంటి విశాలాక్షులవి—ఎవరీ పిల్ల? 'పల్లెలోనున్న మనుమరాల్ని పట్నంలో చదివించాలని మామ్మ తెచ్చిందని' తల్లి చెప్పగానే సూర్యం చోటు లేకండా ఒకే కోర్కెతో మనస్సు నింపేసాడు. మామ్మే చిన్న వయసులో లంగా జాకెట్టు వేసుకుని కూర్చున్నట్టుంది. మామ్మ ఆకారం వున్న యీమెలో మామ్మ గుణాలే వుండి, మామ్మకు తనపైనున్న అభిమానమే యీ పిలకూ తనపైనుంటే తనెంత అదృష్టవంతు డనుకున్నాడు

పెరట్లో కాళ్ళు కడుక్కోడానికి వెళ్ళగానే పిల్ల వాళ్ళ పెరట్లో నిల్చుంది. మళ్ళీ తనవేపు అలానే ఒకసారి పరీక్షగా చూసింది. ఆ కళ్ళల్లో యేదో భావం, కోరిక, తొట్రుపాటు — తృప్తి ఎన్నెన్ని అనుభూతులు, యెన్నెన్ని రంగులు ఆ కొద్ది సెకెండ్ల చూపుల్లో వెలిసి పోయాయ్.

'అమ్మా—విశాలా' మామ్మ పిలుపు.

'ఆమె విశాలాక్షి! ఆ విశాల నేత్రాల ప్రేమ చూపులను అందుకొని జవాబిచ్చే భాగ్యం యెవరి కుంటుందో? తన కెందుకుండ కూడదు?'

కోరికలు పూలతీగలై మనస్సంతా అల్లుకున్నాయ్. క్షణంపోయాక నిరాశ గాలికి తీగలో పూచిన పూలు రాలసాగినయ్. ఏమో యీ మనసు ఆశలతో పూలను సృష్టించుకుంటూ సంశయాల పెనుగాలితో ఆ పూలను రాలుస్తుంది. మళ్ళీ కొత్త పూలను కొత్త రంగులతో సృష్టించటానికి కామోసు! ఆశే బ్రహ్మదైతే ఆ బ్రహ్మదలో యింకో ఆశ మొక్క పుట్టుంది! అలా పుట్టించ గలిగినవారే బహుశః బ్రతకగలరేమో?

(ఇంకా ఉంది)

పిల్లలు—ఆరోగ్యము

## పెరుగుదల ఎలా ఉండాలి?

పిల్లలు వయస్సుని అనుసరించి ఆరోగ్యంగా పెరుగుతున్నారా లేదా అన్నది తల్లి తండ్రులు గమనించాల్సిన ముఖ్యమైన విషయాలలో ఒకటి. దీనిని తెలుసుకోడానికి నిపుణుడైన వైద్యుని సంప్రదించాల్సిన అవసరం లేదు. మీకు మీరుగానే సుమారుగా అంచనా వేసుకుని చూసుకోవచ్చు. అనుమానం ఏదైనా వస్తే అప్పుడు వైద్యుని సలహా పొందాలి

సాధారణంగా పిల్లలు పుట్టినప్పుడు 2.5 కిలోగ్రాముల నుంచి 4 కిలోగ్రాముల వరకూ బరువు ఉండవచ్చు. మూడవనెలలో 3.5 నుంచి 6 కిలోగ్రాములదాకా ఉండాలి. 6 వ నెల వచ్చిన తర్వాత 5 కి. గ్రా మొదలు 8 కిలోల బరువు ఉండవచ్చు. ఒక సంవత్సరం వయస్సులో 7.5 నుండి 12 కిలోగ్రాముల మధ్య ఉండాలి. రెండు సంవత్సరాల ప్రాయములో 10.5 కిలోగ్రాముల నుంచి 16 కి. గ్రా వరకూ ఉండాలి. అయిదవ సంవత్సరంలో 15—23 కి. గ్రా. మధ్య ఉండవచ్చు. ఆరవఏడు వచ్చిన తర్వాత 17.25 కి. గ్రా, 7వ సంవత్సరంలో 19—28 కి. గ్రా, 8 వ సంవత్సరంలో 20—33 కి. గ్రా., 9, 10 సంవత్సరాలలో వరుసగా 23—33 కి. గ్రా. 24—44 కి.లోగ్రాముల వరకూ బరువు వుండవచ్చు.

ఈ బరువులు సరాసరి అంచనాలని అనుసరించి యిచ్చినవి కాబట్టి వాటికి ఒకటి రెండు కిలోగ్రాములు ఎక్కువ తక్కువలు ఉన్నా ఆదుర్దా చెందనవసరం లేదు. అయిదు కిలోగ్రాముల మొదలు 10 కిలోల తేడా ఉంటే మాత్రం వెంటనే వైద్యుని సలహా పొందటం ఎంతైనా అవసరం.

ఇక పిల్లల ఎత్తులో కూడా వయస్సుబట్టి ఉండాల్సిన పెరుగుదలని మీరు గమనించవచ్చును.

సాధారణంగా పిల్లలు పుట్టగానే 50 సెం. మీ. ల పొడుగు ఉంటారు, ఒక సంవత్సరం నిండేసరికి 70 నుంచి 80 సెంటి మీటర్లు, 2 వ సంవత్సరంలో 85—95 సెం. మీ, 3 వ ఏడు వచ్చేసరికి 90 నుండి 100 సెం. మీ, 6 వ సంవత్సరంలో 110—120 సెం. మీ, 10 సంవత్సరాల వయసులో 130 మొదలు 148 సెంటీ మీటర్ల పొడుగు ఉండవచ్చు.

—డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

# బెల్ బాటం షర్టు

ఇది బెల్ బాటం షర్టు. దీన్ని లుంగీకి (సాదా) వైట్ ఫైజామాకికూడ వుపయోగిస్తున్నారు. షర్టంతా కుట్టటం ఎంత తేలికో, దీనికి వుపయోగించే 'క్రాస్ కాలరు' అతకటం అంతకష్టం. ఏమాత్రం ఎక్కువ తక్కువలు లేకుండా పోసికచేసి కుట్టుకుంటే బాగా వస్తుంది.

కాలరువేసే పద్ధతికి మామూలు షైపింగ్ వేసే 'బెల్ బాటం'కి కత్తిరింపు వేరుగా వుంటుంది. కాలరువేసే ఈషర్టుకి వెనక భాగంకన్న ఎదురుభాగం పొడవు అరంగుళం తక్కువ వుంటుంది. మెడ కత్తిరింపుకూడ తక్కువే వుంటుంది. చేతులు అతికేటప్పుడుకూడ చిన్న మార్పు గుర్తించాలి 'బాడీ పక్క అతుకు, చేతి అతుకు ఒకేచోట కలిసేలా కాకుండ, (ఎదురువైపుకి) చేతి అతుకుని పక్క అతుకుకన్న ½ అంగుళం ముందుకి జరిపి అతుక్కుంటే చాలు.

'బెల్ బాటం' చేతులుకూడ మామూలు జాకెట్లకి షర్టులకే వున్నట్టుండవు— కత్తిరింపు కున్నంత మెలుకువ కుట్టేదగ్గర కూడ అవసరమే. 'వంపు తిరిగివుండే ఈ చేతి చివర్ని సన్నగా మెషిన్‌కుట్టు వేసుకుని తరువాత 'హెమ్మింగ్' వెయ్యాలి.

కొల్తల ప్రకారం ముందు పేపరమీద డ్రాయింగువేసి కత్తిరించి తరువాత బట్ట మీద వెయ్యవచ్చు డిజైను. చేతులుకూడ కత్తిరించుకుని ఒకసారి దీని కత్తిరింపుకి సైగా పేర్చుకుని సరిపోతుందో లేదో చూసుకుని — తరువాత కుట్టటకు ప్రారంభించండి. దీనికి వెనకవక్క 'ఫుల్ ఓపెన్' పెడితే (పిల్లలకే గనుక) క్రాసుకాలరు సైటుగావుండినా కుట్టేందుకు తొడిగేందుకు తేలికగా వుంటుంది.

ముందుగా వెనకభాగం ఎదురుభాగం షోల్డరు దగ్గర అతుక్కుని— పక్కభాగాలు అతుక్కుని - చేతులు పై చెప్పిన రీతిలో అతుక్కుంటే — ఇక మిగిలినది వెనుక (ఓ పెన్) బటన్సు పట్టీలు — కుడివయిపున పట్టీ అతికి లోపలికి మడిచి హెమ్మింగ్ వెయ్యాలి. ఎడమ వయిపున రెండు మడతల పట్టీ అతికి (1½ వెడల్పుండాలి) అడుగు బటన్సుకి ప్రత్యేకించాలి.

ఈ షర్టులో మనకున్న పనల్లా క్రాసు కాలరు. చేతిరుమాలు ఆకారంలో వుండే పెద్ద సైజు ముక్కతీసి దాన్ని మూడవ బొమ్మలోలా క్రాసుగా ఐదంగుళాల వెడల్పులో 12 అంగుళాలు (కాలరు) పొడవులో వచ్చేటట్టుగా తియ్యాలి. ఈ కాలరుకి ముక్క ఎక్కువే పడుతుంది అవసరాన్నిబట్టి క్రాసు కలిసేవిధంగా అతుకూ వెయ్యవచ్చు. (మడతల్లోకి పోయివుంటుంది కాబట్టి ఫరవాలేదు.)

కాలరు అతికేందుకు — వీటిలో మధ్యన (నిల్చేందుకు) పెట్టేందుకు పలుచటి, కేన్వాసు అమ్ముతుంది. మీటరు రూపాయి న్నర వుంటుంది. అదికూడ కాలరుసైజులో (క్రాసుగానే) కత్తిరించి లోపలి వయిపుకి నాలుగు ప్రక్కలా అతుక్కోవాలి. కాలరు కాచివర ఈచివర (తిరుగవేసి వుండగనే) రెండుగా మడిచి కుట్టుకోవాలి. దీన్ని మామూలుగా తిరగవేసి పై బటన్సు అతికే దగ్గర పై వైపునుండి ప్రారంభించి — అడుగుబటన్సు పెట్టే మడతపట్టీ వరకే రానిచ్చి ఆపెయ్యాలి. ఎట్టి పరిస్థితిలోను కాలర్ను— డబుల్ పట్టీ మీదికి రానికూడదు— పైపింగ్‌కి తీసే సన్నపాటి క్రాసు పేలిక తీసి ఈ కుట్టిన కాలరుమీదుగా చివరివరకు కుట్టి దాన్నే సాగదీసుకుంటూ నూలు పోగులు కనిపించకుండా నీటుగా మడిచి కుట్టాలి. ఇదే కాలరు, ఈ క్రాసుపీసు అతకటమే చాలా కష్టం. ఏమాత్రం అజాగ్రతగావున్నా పైకి కనపడుతుంది.

(64 వ పేజీ చూడండి)














పలివేటి నాగచంద్రావతి

ఆ చిన్న డాబాముందుకు వచ్చి రిక్షా ఆగింది. డాబా ఇంటికి ఆనుకుని వున్న పెంకుటింటి కిటికీలోనించి మూడుజతల కళ్ళు రెప్పవాల్చక అతికుతూహలంగా అటు వైపే చూచాయి.

ముందుగా రిక్షాదిగిన రవి శ్రీదేవికి చెయ్యందించాడు. సిగ్గుపడుతూ రవి కళ్ళలోకి చూసి, అలవోకగా ఆ చెయ్యందుకొని రిక్షా దిగింది శ్రీదేవి.

భర్త చేతిని అలాగే అదిమి పట్టుకుని నడవాలనుకొన్న శ్రీదేవి కిటికీ వెనకాల చేరి పులుకూ పులుకూ తమనే పరికిస్తోన్న ఆ కళ్ళ తాలూకు ఆకారాల్ని గమనించి చటుక్కున రవి చేతిని వదిలేసి, బిడియ పడుతో భుజంమీదికి చెంగులాక్కుంది.

రవి గేటు తలుపు తీసుకొని చకచక డాబా ఇంటిని సమీపించాడు. తాళంతీసి తలుపులు బార్లా తెరిచాడు. ఆపైన ఒక్కడుగు పక్కకువేసి క్రీగంట భార్యను చూస్తూ కళ్ళతోనే సంజ్ఞ చేశాడు.

ముద్దరాలిలా భర్త ననుసరించి వచ్చిన శ్రీదేవి కుడికాలు ముందుకివేసి గృహ ప్రవేశం చేసింది.

దృశ్యం ఆనినంతమేరలో చూపులకింక ఆహారం దొరకదని రూఢి అయ్యాక కిటికీ ముందునించి వెనక్కి మళ్ళిన సరోజమ్మ, 'కొత్త బిచ్చగాళ్ళలా ఉన్నారు' అన్నది స్వగతంలా.

'ఇంతోటి రంభా మరెక్కడా దొరకదన్నట్టు, ఆ పీచుజుట్టు పెళ్ళాన్ని చూసుకుని ఏం మురిసిపోతున్నాడో! చెయ్యట్టుకు మరీ దించాలి గావును ఆ నగరాడిని' అన్నది భాగ్యం ఎద్దేవగా. ఆ అమ్మాయి కళ్ళలో

అసూయ కొట్టొచ్చినట్టు అగుపడుతోంది.

భాగ్యానికి తనకంటే అందంగా ఉన్న ఏ ఆడపిల్లను చూసినా జలసీయే. అది కప్పిపుచ్చి, వాళ్ల అందచందాలలో లేని లోపాలు వెంచుతో అతి చులకనగా తీసేసి మాట్లాడి, తనని తాను మభ్య పెట్టుకుంటూ వుంటుంది.

వరాలమ్మ పెద్దకూతురు భాగ్యం; రెండోకూతురు రత్నం. రత్నం కంఠస్వరం ఎల్లవేళలా తారస్థాయిలోనే మోగుతూ ఉంటుంది కాని ఇటువంటి సీక్రెట్ సందర్భాలలోమాత్రం బాటరీ పవరు తగ్గిన రేడియోలాగ తన గొంతు వాల్యూమ్‌ని విచిత్రంగా తగ్గించేస్తూ వుంటుంది.

'అక్కా అతను అచ్చం రాజేష్‌ఖన్నాలా ఉన్నాడు గదే?' భాగ్యం చెవిదగ్గరచేరి రహస్యంగా గుసగుస లాడింది రత్నం.

రత్నం ఏ సినిమా చూసొచ్చినా ఆ మర్నాడు వయసులోవున్న ప్రతి మగాడిలోనూ ఆ హీరో రూపురేఖలూ, ఆ కథానాయకుడి లక్షణాలూ పోల్చుకోడం పరిపాటి.

క్రిందటిరోజు వాళ్లక్కతో కలిసి, 'మర్యాద' హిందీ సినిమా చూసివచ్చింది రత్నం. రాత్రంతా ఆ పిల్లకలల్లో రాజేష్ ఖన్నాయే నిండిపోయాడు.

'ఆ— నీ మొహం...' చప్పరించేసింది భాగ్యం. 'నుదుటిమీద దుబ్బుజుట్టు పడినవాళ్ళందరూరాజేష్‌ఖన్నాలాగే కనిపిస్తారు నీకు...నయం... అతగాడి పెళ్ళాన్ని పట్టుకుని సయిరాబానులా ఉన్నదన్నావు కాదు' అన్నది వెటకారంగా.

ఎక తగ్గిపోయింది రత్నం. అక్కగారి అభిప్రాయాలపట్ల అమితమైన అభిమానం ఉన్నది రత్నానికి. తనకో స్వంత అభిరుచిగానీ, అలవాటుగానీ వుండాలనుకోదు రత్నం. ఎంతసేపూ భాగ్యానికి పక్కతాళం వేస్తూ అక్కగారి ఆదేశాలను అక్షరాలా అమలుపరుస్తూ వుంటుంది.

ఇలా ముగ్గురూ మూడువిధాల డాబా ఇంట్లో కొత్తగా దిగిన యువజంటమీద వ్యాఖ్యానాలు సాగించి అప్పటికి తృప్తిపడ్డారు.

* * *

తెల్లతెల్లవారింది ఇంకా పూర్తిగా మెలుకువ రాక మూసుకుపోతున్న కనురెప్పల్ని బలవంతాన తెరిచింది శ్రీదేవి. కిటికి ఆవల రేకులు విడుతోన్న తెల్లగులాబీ ఉల్లాసంగా ఊగులాడుతూ ఆహ్లాదంగా ఆహ్వానించింది ఆమెను.

క్షణంలో బద్ధకాన్ని విదిలించేసుకుని కిటికీదగ్గర వాలింది శ్రీదేవి

బాలభాస్కరుని నునులేత కిరణాలు కొబ్బరి ఆకులమీద బంగారుమలామా పూస్తున్నాయి.

నందివర్ధనం పూలపై మంచుబిందువులు బొట్లుబొట్లుగా నిలిచి అవి అతి పవిత్రంగా, అతి స్వచ్ఛంగాకనిపిస్తున్నాయి.

విరబూసిన జినియాలూ, గుత్తులు గుత్తులుగా లిల్లీలూ తమతమ వర్ణ విశేషాలతో చూపుల నాకట్టుకొంటున్నాయి.

ఆ చల్లటి సుప్రభాత సమయాన, రాత్రి గడిచి, నిద్రవదిలి కనులు విప్పిన తొలిక్షణాన ప్రకృతి చిత్రించిన ఆ కళాఖండాల్ని చూస్తోంటే అంతులెరియని ఆనందానుభూతి ఏదో ఆవరించి పరవశించిపోయింది శ్రీదేవి.

అప్పుడే మేలుకొన్న రవి మెల్లగా భార్య చెంతకుజేరి, చల్లగా భుజంమీద చెయ్యి వేసి, సుతిమెత్తగా నొక్కాడు.

భర్త చేతిమీద తనచేతినివేసి, ఆప్యాయంగా మందహాసం చేస్తో, 'ఆ పువ్వులు చూడండి ఎంతబావున్నాయో!' అన్నది శ్రీదేవి సంభ్రమంగా.

పగడాలరంగులోఉన్న శ్రీదేవి పెదవులనీ, నిర్మలంగా మెరిసే ఆమె కళ్లలోని అమాయకతనీ తన్మయంగా చూస్తో, 'ఊ' అన్నాడు రవి మెత్తగా.

'నాకు తెల్లగులాబీలంటే బోలెడిష్టం; మరి మీకో?' అన్నది శ్రీదేవి గోముగా.

'ఉహూం ... నాకు తెల్లగులాబీలంటే వాటిని ముడుచుకొన్న నీ నల్లని జడ యిష్టం' మురిపెంగా అని శ్రీదేవి భుజాలచుట్టూ చేతులు బిగించబోతున్న రవి ఎవరో అడ్డగించినట్టు తటాలున ఆగాడు.

సందేహంగా తలతిప్పి కిటికీవైపు చూసింది శ్రీదేవి. నాలుగా ఓ దొంగమూపు విసిరి ఏమీ ఎరగనట్టు జారుకుంటున్న రత్నం ఓ వెకిలినవ్వు నవ్వింది.

'ఏమిటీ మేళమని' చిరాకుపడి కిటికీ కర్టెను నిండుగా లాగబోతూ కెవ్వున కేక పెట్టి సుడిగాలిలా బయటకు పరిగెత్తింది శ్రీదేవి.

అప్పటికే చిటారుకొమ్మనఉన్న తెల్ల గులాబీని ఆకులతోసహా కోసేసింది భాగ్యం. లిల్లీలనీ, జినియాలనీ టపటపా మొరటుగా తెంపేస్తోంది రత్నం.

కొంప మునిగినట్టు తల్లడిల్లిపోతో పరిగెత్తుకొచ్చిన శ్రీదేవివంక వింతగానూ, నిర్లక్ష్యంగానూ చూశారా అక్కచెల్లెళ్ళు.

ఘడియక్రితం సర్వాభరణ సుందరిలా, అలంకరించుకొన్న నవమోహనాంగిలా కనిపించిన ఆ పెరడు ఇప్పుడు రాజలాంఛనాలు కోల్పోయిన మహారాజులా దిగులుగా బోసిగా వెలాతెలాపోతోంది.

ఏడుపొచ్చినంతపనయింది శ్రీదేవికి. వారిద్దరిమీదా వల్లమాలిన కోపమూ ముంచెత్తుకొచ్చింది. కానీ తన వయసువారూ, పొరుగువారూ, అంతకుమించి కొత్తవారూ అయిన ఆ కన్నెలతో దూకుడుగా వ్యవహరించటం తగినపనిగా అనిపించలేదు.

అదీకాక శ్రీదేవి రెండుపదులు నిండని లేతప్రాయపు పడుచు; తొలిసారిగా నిన్ననే గృహిణీత్వపు హోదాలో ఆ ఇంటని మెట్టిన కోమలాంగి. 'నా' అనీ, 'నాది' అనీ అనుకోగలిగే ఈ పదవిలో, తన స్వాధికారపు హద్దులు ఏవో, ఎంతవరకూ చెలాయించవచ్చో, కూడదో అనే మీమాంస తేలలేదు ఓ పట్టాన. అందువల్లకూడా కొంత జంకూగొంకూ కలిగేయి. అంచేత తన ఆగ్రహాన్ని చాలావరకూ తమాయించుకొన్నది. అయితే పూర్తి కోపాన్ని ఆపుకోడం, తనని కానట్టు పట్టించుకోకుండా వుండిపోడం కూడా ఆమెకు తలకుమించి పనే అయింది.

'ఎవరినడిగి కోశారా పువ్వులు? అయ్యయ్యో ఒక్క పువ్వు కూడా లేకుండా తెంపేశారు కద...!' కంఠంలో సాధ్యమయినంత కరుకు తగ్గించి బాధగా అన్నది శ్రీదేవి.

భాగ్యం నుదురు చిట్లించింది. 'ఎవరినడగాలీ...? ఈ మొక్కలన్నీ మావే.' ధిక్కారంగా అన్నది భాగ్యం. స్వల్పంగా కూడా బెరుకు లేదా పిల్లలో.

'మీవా? అదెలాగ? మా ఇంటిముందున్న స్థలంలో ఉన్నాయి కదా యివి?' అక్క

# స్వయంకృతం

ర్యంతో శ్రీదేవి కళ్ళు పెద్దవయ్యాయి.

ఈమాటు రత్నం సమాధానం చెప్పింది. 'ఇంతకుముందు ఈ ఇంట్లో ఉండి వెళ్ళిన తాసిల్దారుగారి భార్య పెట్టిందీ మొక్కల్ని. వాళ్ళు వెళ్ళిపోతో మా కప్పగించిపోయారు వీటిని.' అధికారం మా హస్తగతమయి వుండగా మధ్య నీ ప్రమేయం ఏమిటన్నట్టు మొహం పెట్టి, ఎంతకీ తునగక ఇబ్బంది పెడుతోన్న నూరు వరహాల గుత్తిని గట్టిగా పట్టుకొని కసిగా నులిపెట్టసాగింది రత్నం.

నిస్త్రాణ పడిపోయింది శ్రీదేవి. కళ్ళకు విందులు చేస్తోన్న ఈ సుందర సుకుమార సుమాలన్నీ మరొకరి సొత్తని తెలిసేసరికి నరనాడుల్లోకీ నీరసం పాకిపోయింది.

ఇప్పుడామెకు వాళ్ళిద్దరూ నవ్వులు కోసుకుంటున్న పోటి ఆడపిల్లలుగా కాక పీకలు నులుముతున్న కటికవాళ్ళలా కనిపించారు.

మొగ్గలతో సంయుతం కోసుకుని, 'నీతో మాకేమి'టన్నట్టు తిరస్కారంగా శ్రీదేవి వైపు ఓ చూపు విసిరి విజయగర్వంతో నడిచిపోతున్నది భాగ్యం. ఆ అమ్మాయి చేతిలో లేత నీలంరంగు ప్లాస్టిక్ పువ్వుల బుట్ట వూగులాడుతోంది. ఆ బుట్టలో రంగు రంగుల పువ్వుల మధ్య చెలికత్తెల నడుమ వెలిగిపోయే చిన్నారి రాకుమారిలా తెల్ల గులాబీ నన్నే చూడమన్నట్టు విరిసి పడుతోంది.

నిట్టూర్చింది శ్రీదేవి. 'ప్చ్...స్నానం చేశాక తెల్ల జరీ చీర కట్టుకుని, తెల్ల గులాబీ పెట్టుకుని...కాఫీ గ్లాసు పట్టుకొని...భర్త దగ్గరకు వెళ్ళి...అబ్బ—' గులాబీ ముట్టూ ఎన్ని మధురోహలు కల్పించుకొన్నది తను.

పోనీ దేబిరించే అయినా, అభిమానం చంపుకుని ఆ ఒక్క గులాబీ పువ్వూ ఇవ్వమని అడుగుదామని పెదవులదాకా వచ్చిన వాక్యాన్నే దిగమింగి వూరుకున్నది.

కళ్ళె విరిచినట్టున్న వారి మాటలూ, చూపులూ, సంధికీ సంధివ్వకుండా వున్న వారి వైఖరీ గమనించి తన ప్రయత్నం విరమించి వెనక్కి తిరిగింది శ్రీదేవి.

'పెట్టి పోషించిన దానిలా ఎలా గదమాయించి అడుగుతోందో...హు! ఎలాగయితే నేం...డాబా ఇంట్లో దిగామని గర్వం' వెళ్ళిపోతో భాగ్యం చేసిన విసుర్ని మరుక్కున్న తగిలింది శ్రీదేవికి.

అలా ఆదిలోనే అపశృతిగా మొదలయింది శ్రీదేవికి పొరుగువారి పరిచయం.

*

'కష్టానికయినా సుఖానికయినా ముందు ఆసరాపడేవాళ్ళు ఇరుగుపొరుగులేనమ్మా. ఆ తరవాత ఆదుకునేవారే బంధువులు. చుట్టుపక్కలవారితో సఖ్యతగా వుండు తల్లీ' అని కాపురానికి పంపిస్తూ బామ్మ చెప్పిన హితవు పదే పదే తలపుకొచ్చి, 'ముందు పొరబాటు జారి నేనే తప్పు చేశానేమో? ఇక ఏమంటూ వాళ్ళు నన్ను పలకరించబోతారు.' అనుకుంటూ ఆ తరవాత తెగ మథన పడ్డది శ్రీదేవి.

కానీ — సాయంత్రమే భాగ్యం తండ్రి వెంకట్రామయ్యా, తల్లి వరాలమ్మా నూతనంగా దిగిన దంపతులను పరామర్శించడానికి విచ్చేసి శ్రీదేవి పడుతోన్న ఆ కాస్త బెంగా తొలగించారు.

దిగులు తీరి తేలికపడ్డ మనసుతో శ్రీదేవి వినయంగా వారి నాహ్వానించి మర్యాద చేసింది. ఆ భార్యాభర్తలు వచ్చిన కొద్ది సేపటికే భాగ్యమూ, రత్నమూ కూడా వచ్చారు. వారి రాక మాత్రం శ్రీదేవికి విస్మయాన్ని కలిగించింది. కానీ అది బయట పెట్టక వారిని కూడా సంతోషంగా 'రండం'టూ పిలిచింది.

ముందు గదిలో వెంకట్రామయ్యగారు రవిని మాటల్లోకి దింపారు. పడక గదికి ముందున్న పోర్టికోలో ఆడవాళ్ళు సమావేశమయ్యారు.

వరాలమ్మ మంచి మాటకారి. అంతే కాదు. అతి తెలివితేటలు చూపించే మనిషి. ఎంతసేపూ తన మాటల చమత్కారంతో ఎదుటివాళ్ళ గుట్టుమట్లు లాగుతుందే తప్ప తను లోగుట్టు ఓ పట్టాన బయట పెట్టదు.

శ్రీదేవి బి. యే. దాకా చదువుకున్నదని, రవికి రెండు డిగ్రీలూ—సెకెండ్ క్లాస్ రాంకుకి ఓ మెట్టు మాత్రమే దిగువన ఉన్న మంచి ఉద్యోగమూ కలవాడనిన్నీ, నెల కు పదివేలు అయినేజా వచ్చే స్థిరాస్తి ఉన్న వాడని —

హాలీవుడ్ నటుడి వంటి అంగసౌష్ఠవమూ ఖరీదయిన వరులకుండే ఇన్ని అర్హతలూ వున్న రవి, శ్రీదేవియొక్క గుణ గణాలూ, అందచందాలూ, చదువు సంధ్యలే కట్నకానుకలుగా భావించి ఆమెను అర్ధాంగిగా స్వీకరించాడన్న సమాచారం కూర్చున్న అర గంటలో సేకరించి 'అదృష్టవంతురాలివి' అనబోయి మానుకున్నది వరాలమ్మ.

తన పిల్లల్ని తప్ప ఇతరులని మెచ్చుకొనే అలవాటు తప్పిపోయిందామెకి. తన కూతుళ్ళకీ ఇలాగే, ఎప్పుడో ఒక సుముహూర్తాన ఏ మిలియనీరో వెతుక్కుంటూ వచ్చేసి ఎగరేసుకుపోతాడని గాఢమయిన నమ్మక మామెకు.

'దానికేముందిలే ఈ కాలం కుర్రాళ్ళ కంటికి ఎదురుగా ఆడపిల్ల కనబడాలే గానీ తెగ ఎగబడిపోతున్నారు. మా అమ్మాయికీ ఇలాగే లక్షాధికారల సమంధాలెన్నో కానీ కట్నమక్కరలేదంటూ వచ్చేయి.' 'నీఅదృష్టమెంత లెఖ్ఖలోదా..' అన్నట్టు చేతులు తిప్పుతూ కొట్టిపారేసింది వరాలమ్మ.

'మరికనేం చేసెయ్యలేకపోయినారా ?' అందం అట్టే లేకపోయినా అలంకరణ అధికంగా వున్న భాగ్యంకేసి అమాయకంగా చూస్తూ అన్నది శ్రీదేవి.

'ఏదీ...మొన్ననే పదహారు వెళ్ళి పది హేడో ఏడు వచ్చింది ఇంత పసిపిల్లని అప్పుడే సంసార ఝంఝాటంలో ఇరికించటమా అని తలాయిస్తున్నారు వాళ్ళ నాన్న; ఇది సరే, పెళ్ళి వద్దూ— ఇంకా చదువుకుంటానని ఒకటే మోత. వచ్చిన సమంధాలొచ్చినట్టే వెనక్కి పోతున్నాయి' వరాలమ్మ తన కొక్కతికే ఆ విచారమన్నట్టు భారంగా నిట్టూర్చింది. ఆ నిట్టూర్పుతో అదో విధమైన అహంకారం మిళితమై వుండటం శ్రీదేవికి తెలిసిపోతూనే వున్నది.

'ఆడపిల్లకి ఈడు వచ్చాక పెళ్ళయ్యే దాకా ఏళ్ళు ఇక ముందుకు నడవ్వ' అని బామ్మ హాస్యంగా అంటూ వుండేది.

చిన్నపిల్లలా అగుపించడానికి భాగ్యం లంగా వోణీ వేసుకున్నది. కానీ ఇరవై దాటిన వయసు ముదరగ భాగ్యం మొహంలో కొట్టొచ్చినట్టు కనబడిపోతూనే వుంది.

'పసిపిల్ల' అని చెబుతోన్న ఆ తల్లి దొపరికానికి లోలోపలే నవ్వుకున్నది శ్రీదేవి.

వీళ్ళు మాటల హడావిడిలో వీళ్ళు వుండగా భాగ్యమూ, రత్నమూ కలిపి



# ఏటేటా వచ్చే దురద

## దానికి నివారణ ఏమిటి?



చెమటకాయలతో దురద. దురదని ఎంతో చికాకు పడతారు. గోకుతే చర్మము పొరలు తేరి అసహ్యముగా ఉంటుంది. జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సబ్బు మరియు ప్రిక్లీ హీట్ పౌడరు ఎండ వేడితో చెమట కాయలు రాకుండా త్వరగా రక్షణ కలిగిస్తాయి అవి రెండూ చెమటకాయలనుండి రక్షణ ఇచ్చుటకు నేడు లభిస్తున్న తయారులలో ఎంతో పొదుపైనవి.

మొదట, ఔషధములు చేరిన జాన్సన్స్



ప్రిక్లీ హీట్ సబ్బుతో స్నానము చేయండి. అది వాచిన చర్మ రంధ్రములకు ఉపశమనము కలిగించి, అంటురోగములను సోకనీయదు.

తరువాత, చెమ్మను పీల్చి చర్మమునకు హాయిని కలిగించే జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరును ఒంటిమీద జల్లుకోండి. దానిలో చెమటకాయలనుండి రక్షణనిచ్చే ఒక ప్రత్యేకమైన ఆంటిసెప్టిక్ పదార్థముంది. దానితో వెంటనే గుణము కనిపిస్తుంది. చెమటకాయల బాధనుండి తప్పించుకొనే పద్ధతి ఇదే.




## జాన్సన్స్*

ప్రిక్లీ హీట్
పౌడరు మరియు సబ్బు




జాన్సన్ అండ్ జాన్సన్ లిమిటెడ్ *ట్రేడ్ మార్క్

ఇల్లంతా చుట్టబెట్టి వచ్చారు.

వారికి బెడ్‌రూంలో యూఫోమ్ బెడ్సూ, డన్‌లప్ దిళ్ళూ, డ్రెస్సింగ్ టేబిలూ మొదలు, కిచెన్ రూంలో డైనింగ్ టేబులూ, చిన్నసైజు ఫ్రిజ్ దయిరూ దాకా అన్నీ సరికొత్తవీ అదునాతనమైనవే కనిపించాయి వీటన్నిటికన్న ముఖ్యాకర్షణగా కనిపించిన వస్తువు బెడ్‌రూంలో స్టూల్ మీది ఫోటో ఆల్బమ్. అది శ్రీదేవీ రవిల హనీమూన్ ట్రిప్‌లో ఇద్దరూ కలిసి తీయించుకొన్న ఫోటోలు.

ఈ వస్తు సముదాయమంతా రత్నం కళ్ళకు వుత్సాహపూరితమయితే, భాగ్యం మనసుకి కల్లోల హేతువయింది.

'ఇవన్నీ తను కంటోన్న కలలు; వూహించుకొంటున్న వూహాలు తన భవిష్యత్ జీవితపు వూహాసౌధాన్ని, తానెంతో శ్రమపడి నిర్మించుకొన్నదాన్ని హటాత్తుగా శ్రీదేవి ఆక్రమించుకున్నట్టుగా అనిపిస్తోంది భాగ్యానికి.

కక్కాలేదు; మింగాలేదు శ్రీదేవిని ఏదో అని నొప్పించాలని, ఏదో చేసి కష్టపెట్టాలనే మాత్సర్యం అప్పటినించే మొదలయింది.

* * *

ఆడవాళ్ళు ఆడినంత సులభంగా అబద్ధాన్నిగాని వాళ్ళు చెప్పకొనేటంత విపరీతంగా లేని గొప్పల్ని చాటుకోవటంగాని సాధారణంగా మగవాళ్ళు చెయ్యలేరు.

ఇటు వరాలమ్మ కూతురు పెళ్ళి తను కోక లెఖ్ఖ పత్రంలోది కాదన్నట్టు మాటాడుతున్న సమయంలోనే అటు వెంకట్రామయ్య రవి దగ్గర తన కూతుళ్ల పెళ్ళిళ్ల సమస్య తనకెంత పీకకు వురిలా తయారయిందో వివరించాడు.

ముగ్గురాడ పిల్లలూ, ఇద్దరు మగ పిల్లలూ గల బహుకుటుంబీకుడాయన. చేస్తున్నది రూటికి సద్దకి మాత్రం తడుముకోనవసరం లేని గుమాస్తా గిరీ ఆ ఉద్యోగంలోనే తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని చేసి నాలుగురాళ్ళు వెనకవేశాడు.

గంతకు తగ్గ బొంతను చూసి ఆ మూడు ముళ్ళూ వేయిస్తే ఒకబారమన్నా వదులుతుందని ఆయన తాపత్రయ మాయనదీ.

వరాలమ్మా భాగ్యమూ అది పడనివ్వరు. "నా పిల్లలు రత్నాలు; కో అంటే కోటి సంబంధాలొచ్చి పడతాయ్ రెణ్ణాళ్ళు ఓపిక

# స్వయంకృతం

పట్టండి' అంటుంది వరాలమ్మ.

భాగ్యమయితే తన అందానికీ, తెలివి తేటలకీ ఏ పెద్ద ఆఫీసరో అయితే తప్ప తగదంటుంది.

వాళ్ళ కోరికలు చూస్తే ఈకాలపు దరవరల్లా ఆకాశమంటుతుంటాయి. తనా అంత పెద్ద సమంధాలకి తూగలేదు; ఆ తల్లీ కూతుళ్లలా ఎప్పుడో ఏదో హటాత్తుగా అద్భుతమేదో జరుగుతుందనే భ్రమలో పడలేదు; నేల విడిచి సాముచెయ్యలేదు.

భాగ్యం స్కూల్ ఫైనల్ మొదటిసారి ఫేయిు, రెండు మార్చిలూ, రెండేసి బర్లూ డింకీలు కొట్టి ఆఖరికి స్కూల్ ఫైనల్ క్లాస్ ఎత్తేస్తోన్న సందర్భంలో

## వాసంతహేల

దళదళమ్మున మెరిసె
దరహాస రోచిస్సు
గళగళమ్మున మురిసె
క్రమ్మె తోషిస్సు!!

మహిలోని సుమంతము
రహిమీర నలరారె!
మదిలోని భావనలు
కనలి సరుగులు వారె!!

గాముల్ల క్రొంక్రొత్త
సొగసుతో విరిసెనె!
జనులెల్ల మదుదంత
మనసుతో వర్తిలె!!

గాయకుల గీతముల
గానలహరులు లేచె
భావుకుల యెదలందు
నవరసమ్ములు చిలికె!!

వాసంత కుసుమహేల
హసియించె శుభకళల,
ధీమంత హృదయాల
దీపించె నవరుచుల!

రా వోయి మిత్రమా!
రమ్యజగతిని చూడ!
భావభరితమ్మైన
నవ గీతికను పాడ!!

—సురభి వరసింహము

అందర్నీ మూకుమ్మడిగా ప్యాస్ చేస్తోన్న తరుణంలో గట్టెక్కిపోయింది.

అప్పటికే ఇరవై సంవత్సరాలు దాటాయి. వీలాగూ చదువు అబ్బటం లేదుకదా అని మానిపించారు. పెళ్ళి చేద్దామని రెండేళ్ళ బట్టీ ప్రయత్నిస్తున్నా ఏవి అత్యాశల మూలాన్ని ఒక్క సమంధమూ ఒనగూడటం లేదు.

భాగ్యం ఈ ఏడాది కాలేజీలో చేరతానని మరో ఉత్పాతం లేవదీస్తోంది. బాగా చదువుకున్న పిల్లయితే పెళ్లికాని అబ్బాయిలకు మోజెక్కువని వరాలమ్మా 'సై' అంటోంది.

భాగ్యం తరవాత రత్నం; ఆ పిల్లా టెన్తు ప్యాసయి తల్లికి పనిలో సాయపడుతూ ఇంట్లోనే వుంటోంది. ఆతరవాత మగపిల్లవాడు ఈ ఏడాదే టెన్తులోకి వచ్చాడు ఆ పిల్లడి తరవాత మళ్లీ ఆడపిల్ల సెవెన్తు క్లాసు చదువుతోంది. ఆఖరి కుర్రాడు ఇంకా ఎలిమెంటరీ స్కూలు దాటలేదు. వీళ్లందరినీ ఎప్పటికి ఒడ్డుకు చేర్చుతానా అని దుమికిపోతున్నాడా మానవుడు!

ఇదీ ఆయన కుటుంబ భాగవతం వినే వాళ్ళు దొరికిందే చాలని అన్నీ ఏకరువు పెట్టాడాయన. చివరికి 'మీ ఎరికలో అనువయిన సమంధముంటే చెప్పు నాయనా' అని ముగించాడు.

రవి, పెద్దవాడన్న గౌరవంతో ఆయన చెప్పినవన్నీ ఆదరంగా విన్నాడు. తప్పకుండా తన చేతనయిన సాయం చేస్తానని హామీకూడా ఇచ్చాడు.

భోజనాలవేళ మించిందంటూ ఆ భార్యాభర్తలు పిల్లలతోసహా అటు వెళ్లాక శ్రీదేవి, రవి తర్కంలో పడ్డారు.

వరాలమ్మా, వెంకట్రామయ్యా వేర్వేరు ధోరణులలో నడిపిన సంభాషణలని సమన్వయ పరుచుకోడంలో కొద్దిగా తికమకపడి ఆఖర్ని వారిద్దరి దృక్పథాలూ బోధపడ్డాక చాలాసేపు నవ్వుకున్నారు.

ఆ మర్నాడూ భాగ్యమే పువ్వులు కోసుకు పోదామని వొచ్చింది. నిన్న తను ఇంటికి వచ్చిన చనువును పురస్కరించుకొని తెల్ల గులాబీమాత్రం తనకు మిగల్చమని ప్రాధేయపడింది శ్రీదేవి

భాగ్యం ఏ మాత్రం ఒప్పుకోలేదు.

తనకూ అవే యిష్టమని ఖచ్చితంగా చెప్పేసింది. చిన్నబోయిన శ్రీదేవి వదనాన్ని చూసి ఏదో సాధించినట్టు సంతోషించింది భాగ్యం.

ఈ ఒక్క విషయంలోనే కాదు. శ్రీదేవిని ఇరుకున పెట్టగల ప్రతి దానిలోనూ మొండితనంతో 'నీకూ నాకూ పోటీ' అన్నట్టు వ్యవహరిస్తోంది భాగ్యం.

ఆ పిల్లతో నాకేమిటనుకోడానికి వీల్లేక పోతోంది శ్రీదేవికి. అది సాధ్యంకాదు కూడాను.

వచ్చిన చిక్కేమిటంటే వీరిరువురి ఇళ్ళూ ఒకే యజమానివి. ఒకే ఆవరణలో ఒక దానిపక్క ఒకటి కట్టాడాయన. ఎప్పుడో ఆ పెంకుటిల్లు కూడా డాబావేసి రెండిళ్ళూ కలిపెయ్యాలని ఆయన ప్లాను. రెండు ఇళ్ళకీ కలిపి ఒకే కుళాయి ఒకే బాత్ రూమూ ఉన్నాయి.

మరో బాత్‌రూమ్ త్వరలోనే కట్టిస్తానని ఇంటి యజమాని వాగ్దానం చెయ్యటం వల్లా, అంతకంటే మంచి ఇల్లు ఆ చిన్న వూర్లో దొరక్కా తప్పనిసరిగా ఆ ఇల్లే కుదుర్చుకున్నాడు రవి.

అదే ఇప్పుడు భాగ్యం పథకాలకి వీలు కలిగిస్తోంది; శ్రీదేవికి ముక్కట్టుకుంటోంది. తెల్లవారనివ్వదు — కుళాయిదగ్గర ప్రత్యక్షమయిపోతుంది బిందె వెనక బిందె నింపుతూ శ్రీదేవిని కానీ వారి పనిమనిషిని కానీ చెంబుడు నీళ్ళు పట్టుకోనివ్వదు.

'ఇదేమిటంటే', 'ఎప్పటినించో వుంటున్న వాళ్ళం ముందు మాదీ వంతు' అంటుంది. అసలలా అడిగిన్నాదు మరి రెచ్చిపోయి వంతం కొద్దీ బిందెత్తుకెళ్ళి తూములో పారబోసి మళ్ళీ బిందట్టుకొచ్చేది కూడాను.

అనుభవం లేని శ్రీదేవి ఆ బిందెపక్కకి నెట్టి తను పట్టుకోలేదు; గట్టిగా గొంతెత్తి గద్దించా లేదు. పైగా అలా చెయ్యటం అలగాజనం చేసే పనుకుంటుంది.

ఇక ఇంటో పిల్లల ముక్కంటూ లేకపోయిన క్షణాన, శ్రీదేవి ఓపిక హరాయించుకు పోతున్న సమయాన, వరాలమ్మ దయ తలచి బయటకొచ్చి 'పోసిలే అమ్మాయిగా ఒక్క బిందె పట్టుకోనివ్వ' అంటుంది ఉదారంగా; ఎంతో ఉపకారం చేస్తున్న దానిలా.

కుళాయి యుద్ధం ముగిశాక బాత్‌రూమ్ దగ్గర సమరం మొదలు;

శ్రీదేవికి ప్రొద్దునే స్నానంచేసి పూజ చేసుకోవటం అలవాటు. ఈ పనులు ఉదయం ఏడు గంటల్లోపల తెములుకుని కాఫీ తాగెయ్యాలి. లేకుంటే తలనెప్పి వచ్చేస్తుంది. అదో శాపమామెకు.

అదెలా కనిపెడుతుందోగాని సరిగ్గా శ్రీదేవి స్నానానికి వచ్చే వేళకు ఒక్కాయిదు నిముషాలు ముందుగా తానూ స్నానానికి సిద్ధమయి పోతుంది భాగ్యం. కూనిరాగాలు తీస్తో, అవశృతులతో వచ్చీరాని సినిమా పాటలన్నీ పాడకుంటో పక్కా అరగంటగ్గానీ జలకాలాడ్డం ముగించదు.

అంతేనా—? తనదవగానే రత్నాన్నీ, రత్నం తరవాత చిన్న చెల్లెళ్ళీ ... ఇట్లా వరసాగ్గా అందర్నీ గొలుసుకట్టుగా స్నానాల గదిలోకి తరిమేస్తుంది.

చొరవగా దూసుకుపోలేని శ్రీదేవి బేలగా చూస్తూ వుంటుందంతే! ఏడుగంటలు ఇట్టే దాటిపోతాయి. ఎనిమిది మీదికి చిన్నముల్లు జరజర పాకిపోతూ వుంటుంది. దానికంటే వేగంగా శ్రీదేవి తలనెప్పి పెరిగిపోతూ వుంటుంది. తలబద్దలయి సొమ్మవచ్చేస్థితి వచ్చేస్తున్నట్టుంటుంది.

ప్రాణం కడబట్టే వేళటికి ఆపద్బాంధవులల్లే వరాలమ్మో లేక వెంకట్రామయ్యగారో ఆమె అవస్థని కనిపెట్టి కలగజేసుకుంటే తప్ప శ్రీదేవికి ఆ హింస నుండి విడుదల కాదు; శ్రీదేవి వంటగ్గానీ స్నానానికి గానీ ముక్తీ మోక్షమూ లభించదు.

వరాలమ్మ మహా గడుసు. ఆవిడెప్పుడూ తన పిల్లల్నే వెనకేసుకు వచ్చేది. ఇన్ని తిప్పలు పెడుతోన్నా కూతుర్నెప్పుడూ గట్టిగా మందలించి ఎరగదు. చూసీ చూడనట్టు ప్రవర్తించేది. ఎదురు తన ముద్దుల కూతుళ్ల బారినుండి శ్రీదేవిని రక్షించిన ప్రతి తడవా, 'మేము కాబట్టే ఇంత ఔదార్యం చూపిస్తున్నాం' అన్నట్టు మాట్లాడేది.

అసలు శ్రీదేవి ఇంటిముందున్న పూదోటని తమ స్వంతం చేసుకొన్న చతురతా, నీళ్లకు గూడా వంతులేసిన చాకచక్యమూ తన అతి తెలివి తేటలతో కూతుళ్లకు నేర్పి పెట్టింది ఆవిడే. ఆ పిల్లల ఆకతాయితనం హద్దుమీరటానిక్కారణంగూడా తల్లి వత్తాసే చూసుకునే.

సూత్రధారి తనయినా ఆ విషయం బయటపడనిచ్చేది కాదు తెలివిగా. వెనగ్గా తన పిల్లల చేష్టలని ఎగసన దోస్తూ, ముందుకొచ్చి శ్రీదేవిని ఆదుకొని పెద్ద మనిషిలా నటించేది. అదేమి తరహావో మరి!

ఎంతకీ సేవకురాలయిన శ్రీదేవిని తమ చేతికింద నొక్కివుంచాలనే తాపత్రయం తప్ప, అటువంటి పెంపకంలో పెరిగిన పిల్లలు తమ భావి జీవితంలో అదే మూర్ఖత్వం మూలంగా ఎని ఇక్కట్ల



# స్వయంకృతం

పాలయేదీ తపుచుట్టూ వున్న వారి జీవితాన్ని కూడా ఎంత నరకం చేసేదీ బహుశా ఊహించి వుండదావిడ.

ఇంత హైరానా పడుతోన్నా భర్తతో చెప్పుకోవాలన్న యోచనే కలగలేదు శ్రీదేవికి. చిన్న చిన్న విషయాలు ఆడవాళ్లే సరిపెట్టుకోవాలి గానీ, దండిచేసి మగవాళ్లదాకా తీసుకువెళ్లటం అసహ్యమైన పనని ఆమె ఉద్దేశ్యం.

కానీ శ్రీదేవి చెప్పకుండానే రవికి గూడా భాగ్యం చేస్తున్న కొంటెచేష్టలు చూచాయగా, లీలగా అవగతమవుతూనే ఉన్నాయి గానీ అంతగా పట్టించుకునేవాడు కాదు, ఆ వ్యవహారం ఆ స్థితిని దాటి అతని ఎట్టఎదుటే నిలిచింది.

అదెలాగునంటే—

వూరికే కూర్చునేకంటే ఓ వ్యాపకమంటూ ఉంటే మంచిదేనని కూతురితో రాజీకొచ్చి భాగ్యాన్ని కాలేజీలో చేర్పించాడు వెంకటామయ్య.

దానితో ఇహ ఆ పిల్లకు పట్టపగ్గాల్లేకుండా పోయాయి. అసలే సింగారమెక్కువ. ఇప్పుడది వెర్రితలలు కూడా వేస్తోంది.

నుదుట రింగుల్లా పడేలా జుట్టు కత్తిరించి వేజులైనుతో అతికిస్తోంది. చెంపల దగ్గర ఒక పాయ వెంట్రుకల్ని గాలికి వదిలేస్తుంది. 'ఐబ్రో పెన్సిల్'తో డ్రాయింగ్ గీసినట్టు కంటిరెప్పల్ని నల్లన చేస్తోంది. అతి జాగ్రత్తగా బుగ్గలకి రోజ్ పౌడరూ, పెదవులకి లిప్‌స్టిక్కూ అద్దుతుంది. టైట్‌గా బొడ్డు కిందికి చీర కడుతుంది. వెనకా ముందూ బాగా వొంగ దిగిపోయిన చేతుల్లేని బ్రాసియర్ జాకెట్ తొడుగుతూంది. గుండెల ఎత్తు కనబడేలా ఒంటిపొర పమిట వేస్తుంది. ఆ పమిటయినా మూరెడుండి భుజం చివర నుండి ఏ క్షణాన్నయినా జారిపోతానంటూ ఉంటుంది.

గంటల తరబడి చేసుకొనే ఈ మేకప్పంతా కాలేజీ చదువుకేనట పాపం!

ఆమె ఎన్ని పోకిళ్లుపోయినా ఎవరికీ అభ్యంతరం లేదుగానీ ఆ ఆకారంతో మొక్కల్ని పరీక్షచేసే నెపంమీదా, వాట్లకి నీళ్లుపోసే మిషమీదా, వరండాలో పేపరు చదువుకొనే రవి ముందునించీ చిన్ని చిన్ని అడుగులు వేస్తూ వయ్యారాలు గుప్పిస్తూ పదిసార్లు తిరిగేది.

పిల్లగాలిలో తియ్యని కబుర్లు చెప్పుకుందామనే అభిలాషతో సాయంత్రంపూట డాబామీదికి చేరిన శ్రీదేవికీ రవికీ ఆవంతరి తనం మిగలనీకుండా, అదే అదనులో పుస్తక మొకటి హస్తభూషణంగా తీసుకుని పైకి చేరుకునేది.

పెరట్లో స్నానానికో మరో పనికో రవి రావటాన్ని చూసిందంటే సరి— తనూ ఏదో పనున్నట్టు పెరట్లోనే తచ్చాడేది. 'ఆ దర్జీ నీళ్ళు ఇంకా కాగనే లేదా అమ్మా కాలేజీకి టైమయిపోతోందే' అంటూనో, 'కూంచ్ ఒకసారిటిచ్చి వెళ్లవే రత్నా కాలేజీకి వేళయిపోతూంది.' అనో, 'నైన్ గంటలయిపోయింది ఇంకా వంట వనే లేదా అమ్మా నేను కాలేజీకి వెళ్లాలని తెలీదా?' అని అడుస్తూనో హంగామా చేస్తూండేది.

ఆ పద ప్రయోగాలెంత వికృతంగా ఉన్నయ్యో ఆ అమ్మాయికయితే తెలియలేదు గానీ, వింటూన్న రవికి అవి వెగటుగా వుండేవి 'ఈవిడ కాలేజీ చదువు వెలగబెడుతూందని చాటుకునేందుకు సంపూర్ణంగా ఏ భాషకీ చెందని ఈ పేడి ముక్కలు నిదర్శనాలు కాబోలు' అనుకుని ముసిముసిగా నవ్వుకునేవాడు.

అతని చిరునవ్వులని అపార్థం చేసుకొన్న శ్రీదేవికిక ఆగ్రహం అదుపులో ఉండననేది ఎన్నయినా ఓర్చుకున్నది గానీ ఈ దురాగతాన్ని మాత్రం సహించలేకపోయింది శ్రీదేవి.

ఎంతయినా ఆడ హృదయం కదా! తన నాథుడికి ఎర చూపి వల విసిరే మరొకతె నీడనయినా భరించగలదా ?

రవితో భాగ్యం ఆగడాలు తొలినుండీ తు.చ. తప్పకుండా వర్ణించి చెప్పి; ఈ ఇంట్లో వింత వాళ్ళుండకపోవటమే మంచిదని గునిసింది శ్రీదేవి.

రవి తేలిగ్గా నవ్వాడు 'ఓస్ ఈ మాత్రం దానికి బంగారమంటి ఇల్లు వదులుకుని పారిపోవటమా? ఇంపాజిబుల్' అన్నాడు

'మరయితే ఆ అమ్మాయి నన్ను ముప్పు

తిప్పలూ పెడుతూంటే వీళ్ళాళ్ళు పడి వుండమంటారు?' ఉక్రోషంగా అన్నది శ్రీదేవి.

రోషంతో ముక్కుపుటాలు పెద్దవయి ఎర్రగా కందిపోయిన భార్య మొహం రవికి నవ్వు తెప్పించింది. కాని అప్పుడు నవ్వితే ఎంత ప్రమాదమో తెలుసునతనికి. బలవంతాన పెదవులు బిగించి రాబోయే నవ్వు నాపుకున్నాడు రవి.

'అది కాదు శ్రీ...ఆ అమ్మాయికి నిన్ను కవ్వించే వీలు, మనమే అందనివ్వకుండా వుంటే సరి. అనవి తెచ్చుగొట్టే వాళ్ళే వరూ లేకపోతే కొన్నాళ్ళు చూసి ఆ అమ్మాయంతట ఆ అమ్మాయే బుద్ధి తెచ్చుకుని ఇటు వైపుకి రావటం మానుకుంటుంది. అసూయపరులకి సరయిన మందు అదే.' అనునయంగా నచ్చజెప్ప బోయాడు రవి.

'అవేళాను? నీళ్ళు పట్టుకోటం మానెయ్యమంటారా? స్నానం చెయ్యడం మానెయ్యమంటారా? అవి కూడా మీరే చెప్పండి' రెట్టించింది శ్రీదేవి వ్యంగ్యంగా.

'ఏముందీ..కుళాయి దగ్గర బాగ్యం ఉన్నప్పుడు పనిమనిషితో బయటనించి రెండు బిందెల నీళ్ళు తెప్పించుకో. బాత్ రూమ్ ఖాళీ లేనప్పుడు వంటయింటి తూము దగ్గరే స్నానం చేసెయ్...' ఉపాయాలు చెప్పమని భార్య తనని అడిగినట్టు వెనుకా ముందూ చూడకుండా చెప్పేశాడు రవి.

శ్రీదేవికి మండుకొచ్చింది. ఇక ఉండబట్టలేక తను దేనికొరకు నిజంగా అలజడి పడుతున్నదో చెప్పేసింది. 'అవును నేను గలిలేనట్టుగా బయటనించి నీళ్ళు తెప్పించుకుంటాను, ఇంట్లోనే స్నానమూ చేస్తాను; ఆ పిల్ల మాత్రం మహారాణీ సాహెబ్‌లా టాయ్లెట్, సాకిలీ, డాబా అన్నీ ఆ కొకెంటూ అనుభవిస్తూ వుంటుంది. సోగ్గా ఇంకా పౌడర్లూ అలంకారం చేసుకొని మీ ఎదట కళ్ళు కింపుగా పడాలని చేస్తూ వుంటుంది' శ్రీదేవి కంఠం అప్పటికే రుద్ధమయిపోయింది.

రవి కలవరపడాడు. 'శ్రీ నేను ఆ అమ్మాయి నిరివేషాలకే చలించిపోతానని కుంటున్నావా?' అన్నాడు శ్రీదేవి చుబుకం ఎత్తి కళ్ళలోకి చూస్తూ.

శ్రీదేవి నీళ్ళ నిండిన కనురెప్పల్ని వాల్చు కున్నది. సందేహంగానే తల కొద్దిగా అడ్డంగా వూపింది.

'లేదు కాని బురగొడ్డుకి విషం లేదని తెలిసినా పామున్న ఎదురుగా దూరంగా పోవా? నా భయం నాది' అన్నది గద్గదికంగా.

భర్త నిజాయితీని శంకించటం లేదు శ్రీదేవి. కాని ఆ పాపిష్టిపిల్ల బాగ్యం... తన కాపురానికే నీళ్ళు తోడాలని చూస్తున్నదే ఏం చెయ్యటం?

ఎంత నిగ్రహవంతుడయినా 'వనిత తనంత తా వలచి వచ్చిన...' ముక్కుమూసుకు తపసు చేసుకొనే మహామహా మహర్షులంతటివాళ్ళే కాలుజారి తప్పటడుగులు వేశారని కావ్యాలు చెబుతున్నాయే... ఉప్పూ, పులుపూ తింటున్న తన భర్త అనగా ఎంత? ఈయనేం ప్రవరాఖ్యుడా? అపర శ్రీరామచంద్రుడా?

శ్రీదేవి సంశయాన్ని మబ్బుగమ్మినట్టున్న ఆమె మొహంలోనే చదువుకున్నాడు రవి.

జాలిగా నిట్టూర్చి, 'నా నైతిక విలువల మీద నీకింత అవిశ్వాసమున్నదని ఇప్పుడే తెలుసుకున్నాను శ్రీ ... మనస్సు దృఢంగా ఉండాలే గాని ఇంతకుమించిన వన్నెలాడిని కళ్ళని ఇంటా బయటా చాలమందినే చూశాను'

'సరే ఈ వాద వివాదాలు మనకెందుకు... మరో ఇల్లు త్వరలోనే చూసుకుందాంలే' అన్నాడు గంభీరంగా.

కంగారుపడింది శ్రీదేవి. 'కుళ్ళుంకలకు లోనయిన తన మనస్సు నతడు పసిగట్టాడు.'

'అబ్బే. మీ మీద నాకు...నాకు నమ్మకం లేక కాదు...' అంటూ గుడగదాభాతో ఏదో చెప్పబోయింది.

రవి ఆమె ఆందోళన అర్థం చేసుకున్నాడు. 'నిన్నగాక మొన్న తన జీవితంలో అడుగెట్టిన ఈమెకు తన గుణాన్ని గుంచనా వెయ్యగల వ్యవధి ఏదీ?' ఈ ఊహతో శ్రీదేవిపట్ల అతనికి ఆర్ద్రత కలిగింది.

ఆమెనిక మాట్లాడనివ్వలేదు రవి. దగ్గరగా హత్తుకుని ప్రేమగా తల నిమిరాడు. 'పిచ్చి శ్రీ...ఎన్నిరంగులేస్తే మాత్రం కాకి చిలుక అవుతుందా...? గోరింక దాని వెతకదుతుందా? ఈ ముద్దు బంగారాలొప్పే, నా స్వర్ణ సతిను... నా శ్రీ కాలిగోటికి పోటి రానివని నాకు తెలియదూ?' అంటూ బుజ్జగించాడు.

ఇందుకుందు ఎలాగయినా మారొ ఆ ఘడియలోమాత్రం శ్రీదేవి మనసులోవున్న అనుమానాలన్నీ పటాపంచలయిపోయాయి.

(ముగింపు వైవారం)






### జరిగిన కథ

మాధవరావు ఆ వూళ్ళోకి స్కూలుమాస్టారిగా వచ్చాడు. ఎవరికో ఉపకారం చెయ్యపోకే అతను కుక్కకాటుకు గురి అయ్యాడు. బామ్మగారు అతన్ని యింటికి తీసుకువచ్చింది. అనురాధ తొలి చూపుల్లోనే అతన్ని ఆకర్షించింది. ఆమె తండ్రి అభిప్రాయం ప్రకారం అతను ఆ యింట్లోనే వుండిపోవలసి వచ్చింది. ఓ రోజున తూలుతూ వచ్చాడు మాధవరావు. అతనుకూడా తన తండ్రిలాగా తాగుబోతు అయినందుకు విచారించింది అనురాధ. అతనికి హితబోధ చేసింది. మాధవరావు తప్పు తెలుసుకున్నాడు ఆ తర్వాత అనురాధ అతనికి మరింత చేరువైపోయింది.

## 5

తెలిపూల వెన్నెలలో తడిసినట్టుగా ఉంది. పట్టుతేనె మాధుర్యం గొంతులో నిండినట్లుగా ఉంది పరిమళాల నురగల్లో మునిగినట్లుగా ఉంది. వీణా స్వనంలో కలిసి కరిగిపోయినట్లుగా ఉంది.

అది తియ్యని అనుభవం. మైమరచి నాట్యమాడుతున్నట్లనుభూతి.

కొంతసేపటికి స్పృహ వచ్చింది అతడు మంచం ప్రక్కనే కుర్చీలో ఉన్నాడు. నా వైపు వాత్సల్యంతో చూస్తున్నాడు. నేనలా ఎంతసేపు ఒళ్ళు తెలియకుండా ఉన్నానో మరి! — తలచుకునేసరికి తనువు సిగ్గుతో ముద్దలా ముడుచుకుపోయింది.

పైకి లేవబోయాను. 'మరి కొంతసేపు విశ్రాంతి తీసుకో రాధా!' అన్నాడతను.

'ఫర్వాలేదు. లోపలికిపోయి పడుకుంటాను. మీకెంతో శ్రమ యిచ్చాను...'

'శ్రమేముంది? తపస్సులోవున్న దేవతకి మానవుడు సేవ చేసినంత తృప్తిగా ఉంది నాకు...'

'...చిరుగాలికి కూడా రెప రెపలాడే చిగురుటాకులాంటి దాన్ని. నా కంతటి భాగ్యమా!'

'ఆ చిగురుటాకుకున్న విలువ నేలరాలిన ఎండుటాకుకు లేదు. విశాల విశ్వంలోకి తలెత్తి ధైర్యంగా చూడగల శక్తి, సామర్థ్యము ఆ చిగురుటాకుకే ఉన్నాయి...నీలో తాదాత్మ్యం కాగలశక్తి అణువణువునా పేరుకొని వుంది...వీణాగానంలో నిన్ను నీవే మర్చిపోగల ప్రతిభ నీలో ఉందని నా నమ్మకం. మరి, రేపు సాయంత్రం ఐదు గంటలకి నా చెవులు రిక్కించుకు కూర్చుంటాను. సరేనా!...'

అతడు నా మనస్సును చదవగల ప్రతిభావంతుడు! నేను తల పంకించాను.

గ్లాసు తీసుకొని వెడదామని అటు వెళ్ళాను. అంతవరకు నాకు గుర్తు లేదు— అతడు పాలు త్రాగలేదని!

నా మనస్సు చివుక్కుమంది. 'అయ్యో! పాలు చల్లారిపోయాయి'

'అవును. నీ ఆవేశంలా !' అతను నవ్వాడు

'పోనీ, మళ్ళీ వెచ్చబెట్టి తీసుకువస్తాను'

'వద్దు. చల్లని పాలే త్రాగుతా నీవేళ. అదే నాకిష్టం!'

ఒక్క క్షణం ఆగి, 'అయితే, మీరిక నిద్రపొండి.' అని వెనుదిరిగాను.

'గుడ్ నైట్!'

వెనక్కి తిరిగి చూసాను. అతని మధుర మందహాసం నన్ను వివశురాల్ని చేస్తోంది. మరొక్కక్షణం అక్కడాగితే ఏం పిచ్చి పని చేస్తానోనని భయం వేసింది. చటుక్కున బయట కడుగు పెట్టాను.

'గుడ్ నైట్!'

ఇంట్లోకి వచ్చేసరికి అంతా గాఢ నిద్రలో మునిగి ఉండటం కనిపించింది. అప్పటికే పన్నెండు దాటింది.

ఏదో లజ్జ ఒళ్ళంతా కళ్ళు చేసుకుంటోంది. దాన్ని మత్తుగా మధురంగా మార్చుకుంటోంది మనస్సు. మధురాను రాగమేదో కంఠంలో శృతి చేసుకొని వాకలుకట్టి ప్రవహించబోతోంది.

మరు క్షణంలో నా కనురెప్పలు చల్లని తల్లి వెచ్చని స్పర్శకు బరువెక్కిపోయాయి.

ఆ మధ్యాహ్నం 'శారద'ను బయటకు తీశాను. అమ్మ చేతుల నలంకరించిన వీణ 'శారద'. నాన్నగారు అమ్మను 'శారదా సరోజిని' అని పిలిచేవారు. తెలియనివాళ్ళు 'శారద' అనే మరో వ్యక్తి మా యింట ఉందనుకోవటం కద్దు. తెలిసినవాళ్ళకు అమ్మ 'శారదా సరోజిని'గానే తెలుసు

ఇరవై ఏళ్ళపైన శారద నిర్విరామంగా మనోజ్ఞ మాధుర్యంలా పాడి పాడి, అమ్మ అస్తమయంతో ఒక్కసారి మూగవోయింది. అమ్మను కోల్పోయాక శారదను చేతుల్లోకి తీసుకునే ధైర్యం నాలో లేకపోయింది.

నా వీణ 'వాణి'. వాణీ శారదలపై నా సాధన సమానంగా పరాకాష్ఠ నందుకున్నా

'వాణి' మీద ప్రేమ—'శారద' మీద గౌరవము పెంచుకున్నాను.

తర్వాత జరిగిన దుస్సంఘటనలకి నాలోని సంగీతాభిలాష రాను రాను అడుగంటిపోయింది. వీణ ముట్టుకుంటే కన్నీరు పొంగి వచ్చేది. మిన్నేటి నీట ముంచేది. పల్లవి పూర్తిచేసి అనుపల్లవి అందుకునే లోపల కంఠం జీరపోయేది. ఆ తర్వాత దుఃఖంతో దిగజారిపోయేదాన్ని. మామూలు స్థితికి వచ్చేసరికి రెండు మూడు రోజులు పట్టేది. దానితో వీణా సాంగత్యాభిలాష నాలో లుప్తమైపోయింది.

నే నొక తుప్పుపట్టిన యంత్రంలా మూలబడిపోయాను. స్పందనశక్తి లేని వీణా తంత్రిలా నిస్తేజితురాలినైపోయాను.

ఈ సంధి సమయంలో స్వాతి వాన కురిసింది. ముత్యపు చిప్పలు పంట పండించుకున్నాయి. పాల వెన్నెల కురిసింది. చకోరాలు గొంతు నింపుకొని మధురగానం చేసాయి.

అతని రాక నాలో—నా చుట్టూ లందమైన మలుపును తెచ్చింది. నిరుత్సాహాన్ని పారద్రోలింది. ఆత్మవిశ్వాసాన్ని ఎగసన ద్రోసింది. మనఃస్థైర్యాన్ని పాదుకొలిపింది. అడుగంటిన అభిరుచుల్ని పైకి తీసి ప్రోత్సాహంతో ముందుకు తీసుకుపోతోంది.

'శారద'ను చేతిల్లోకి తీసుకున్నప్పుడు గత స్మృతుల ప్రభావం ఆట్టే సేపు లేకుండా అతడు ప్రసాదించిన ఆత్మశక్తి నన్ను నిలద్రొక్కుకునేలా చేసింది. నేను కన్నీరు పెట్టటం అతనికిష్టం లేదు. అతని కిష్టం లేని పని నేను చేయలేను! ఏమిటో ఈ అనుబంధం! ఎక్కడికో ఈ ప్రస్థానం!

వాణీ శారదలను శుభ్రంగా తుడిచి తంత్రుల్ని శ్రుతిచేసి సిద్ధం చేసుకున్నాను. నవ్యకళలతో అవి మెరిసిపోతుంటే నాలో ఉత్సాహం పుంజుకుంది. ఎడమ చేతి వ్రేళ్ళ మీద గాట్లు ఇంకా అలానే ఉన్నాయి. ఎనిమిదేళ్ళ వయస్సులో వీణపట్టిన నా చేతి వ్రేళ్ళకు వీణాతంత్రులు క్రొత్తవికావు.

ఐదు గంటలకి అతను బడినుంచి వచ్చాడు. బట్టలయినా మార్చుకోకుండా ముందుగదిలోకి వచ్చి అక్కడ శారదా వాణుల్ని చూసి తృప్తిగా తల పంకించాడు. నా మూపుల నెదుర్కొన్న అతని కళ్ళలో



అతనితో తెలియజేస్తోంది:

నాన్నగారు వీణల చరిత్ర క్లుప్తంగా వివరించారు. అతడు శ్రద్ధగా తరచి తరచి ప్రశ్నలడిగి అమ్మ గానకళా నైపుణ్యాన్ని తెలుసుకున్నాడు. ఆయన కంఠం గద్గదిక మవటంతో అతను ప్రస్తావన మార్చే సాడు. తనలోని నిగ్రహాన్ని తోటివారిలో పొడుగొలపటం అతనికి వెన్నతో పెట్టిన విద్య!

అమ్మ ఫోటోకి, శారదకి, వాణికి పూలతో—పసుపు కుంకుమలతో పూజచేసి హారతి నిచ్చాను. అగరు ధూపంతో ఇల్లంతా పరిమళించింది.

లోపలగదిలో పిన్ని — నాకు ఎదురుగా అతను, నాన్నగారు, రాజు, రవి, బామ్మ ప్రక్కగాను కూర్చున్నారు. వీధి అరుగు మీద మరికొందరు సమావేశమయ్యారు.

ఉగ్గుపాలతో సంగీత పాటవం నాలో తంగరించి పోసిన 'అమ్మ' నా గురువు. ఫోటోలోని మాతృమూర్తి రాగమయి దృక్కులు నాపై ఆశీస్సులు కురిపించాయి. ఆ దేవత కంజలి ఘటించి — శారదాదేవికి మ్రొక్కాను. కళ్ళల్లో అలనాటి కలత కలగ బారింది. అతని చూపుల్లో వివలేని మన్నన— ఓదార్పు కలిగించింది.

ఎన్నడో ఎడబాసిన ప్రియసఖిని అందు కున్న ఉద్వేగంతో 'శారద'ను చేతుల్లోకి తీసుకున్నాను.

# రాగధార

ముత్తుస్వామి దీక్షితులవారి విఘ్నేశ్వర కీర్తనతో నా సంగీత కచేరీ ప్రారంభ మయింది!

"వాతాపి గణపతిం భజేహం—
వారణాస్యం వర ప్రదం శ్రీ ॥వాతా॥"

అనుపల్లవి అందుకునేసరికి నాలోని భయసంకోచాలు పటాపంచలయి పోయాయి. 'శారద' నన్నింకా తనలో కిముడ్చుకుంది. నా హృదయం లయబద్ధంగా నర్తించింది. హంసధ్వని రాగంలో నా మనస్సు తాదాత్మ్యం చెందింది.

"భూతాది సంసేవిత చరణం—
భూత భౌతిక ప్రపంచ భరణం—
వీత రాగిణం వినుత యోగినం
విశ్వకారణం విఘ్నవారణం ॥వాతా॥"

నిభిడమైన అంతర్వాహిని ఏదో నా కంఠంలో పొంగుతున్నట్టు సుభూతి! పరి సరాల స్మృతిలేని తాదాత్మ్యస్థితి! నా ఒడిలో పయనిస్తున్న వీణా స్వన స్రవంతి. అంతకుమించి ఎప్పుడు చరణం అందు కున్నానో ఎంతసేపటికి కీర్తన పూర్తి చేసానో నాకు తెలియదు. విఘ్నేశ్వర దివ్య రూపం నా మనో నేత్రంముందు ప్రత్యక్ష మయింది. నాలోని భయాలన్నీ పటాపంచ లయ్యాయి.

బాహ్యస్మృతి కలిగేసరికి నా స్థితికి నాకే ఆశ్చర్యం కలిగింది:

'నా బంగారు కొండ నీ కేమిటి భూకే కన్నీళ్ళు కురిసాయే తల్లీ!...' అంటూ బామ్మ తన చీర చెరగుతో నా కళ్ళు తుడిచింది. నే నెంతమందిలో తలయెత్త లేక ముకుళించుకుపోయాను. నా ప్రశంటి చూపుని అతని అభినందనగా వెలిగే చిరు నవ్వు మృదువుగా స్పృశించింది. మానస సరోవరాన్ని దర్శించింది.

తర్వాత సరస్వతీ ప్రార్థన ప్రారంభిం చాను. దీక్షితులవారు రచించిన ఈకృతి అంటే అమ్మకు ఎంతో ప్రియం.

"...దరహాస యుత ముఖాంబు రుహే
అద్భుత చరణాంబు రుహే—
సంసార భీత్యాపహే—
సకల మంత్రాక్షర గుహే ॥శ్రీ॥
శ్రీ సరస్వతే నమోస్తుతే—
వరదే పరదేవతే॥"

దరహాసవదనంతో సరస్వతీదేవి నా హృద యంలో సాక్షాత్కరించింది. నిర్ఝరీ వేగంతో గానం సాగిపోయింది. చదువుల తల్లి నా కంఠంలో మరో వీణకు శృతిచేసింది.

అతని కళ్ళు చిత్రంగా మెరుస్తున్నాయి. ఆ ఆకర్షణలో నా ఒళ్ళు పులకతెత్తింది. బరువెక్కిన రెప్పలు రెపరెపలాడాయి.

'ఎవరని నిర్ణయించేదిరా ని—
న్నెట్లారాధించేదిరా? నరవర! ॥ఎవ॥

దేవామృత వర్షిణి రాగంలో నా మనస్సు లోని ఆరాధన పరిణతి నొంది భక్తి భావ నతో నా గుండెలు నిండాయి. మాధవ మంత్రముతో రాజీవమయింది మనస్సు.

పరవశంతో గుండెలు పగిలిపోతున్నాయి. వీణపై చేయివేస్తే కన్నీళ్ళు పొంగిపొర్లే యనుకుని భయపడ్డ నేను ఈవేళ పరవ శంతో ఇలా తల మునకలయిపోతానని ఎప్పుడూ అనుకోలేదు. నా అంతశ్శక్తిని వెలికితీసిన వాడతడే! నన్ను రంజింపజేసిన మాధవు డతడే! నా గుండెల్లో పొంగుతున్న ఆవేశం, భక్తిభావం నన్ను నిలవనీయకుండా చేసాయి. ఆత్మార్పణతో నా హృదయం స్పందించి, పులకించి పరవశించిపోయింది

ఆ పారవశ్యంలో అలుపులేకుండా మరో గంటసేపు అవలీలగా పాడగలిగాను సంతృప్తి చెందిన మనస్సుని మధురోహలతో నింపు కొని మంగళగీతం పాడి అమ్మ ఫోటోకి, వీణలకి హారతి నిచ్చాను.



'...అభ్యాసము కూసువిద్య అని ఊరికినే అన్నారా పెద్దలు! సంగీతమే జీవితంలో ఒక భాగమయితే అంతకుమించిన అదృష్టం లేదు. జీవితమంతా ధారపోసినా లభ్యంకాని ఈ నిక్షిప్త సంపద ఏ పుణ్యాత్ములకో జన్మహక్కు. అటువంటిది బిడ్డకు ఈ శక్తిని ధారపోసిన తల్లి దేవత తప్ప సాధారణ స్త్రీ కాదు. శక్తికి, నైపుణ్యానికి, ప్రయోగశీలతకు కొదవ లేదు కాని—మెలకువలు తెలుసుకోటానికి రాధకు గురుశుశ్రూష కావల్సి వుంది డాక్టరుగారూ!...' అన్నాడతను.

బామ్మ నా బుగ్గ పుణికి పుచ్చుకొని చెంపలు నిమిరి ముద్దు పెట్టుకుంది. పిన్ని ప్రేమగా ఒళ్ళంతా నిమిరింది. నాన్నగారి ఉత్సాహానికి అంతే లేదు. ఇందరి ఆనందం కంటె అతని మాటలే నాకెక్కువ తృప్తి నిచ్చాయి.

'...పట్నంలో పెరిగిన వాళ్ళమ్మకు మంచి గురువును వెదుక్కునే అవకాశం దొరికింది. వాళ్ళమ్మ ఉన్నంతకాలం మా రాధకు ఆ కొరత లేకపోయింది. ఆ తర్వాత అంతా తారుమారయింది...' అపరాధిలా నాన్నగారు తల దించుకున్నారు.

'గతం వదిలేయండి ఆమె భవిష్యత్తు ఉజ్వలమయినది. దాన్ని మనఃపూర్వకంగా తీర్చి దిద్దవల్సింది మనం!' అన్నాడతను.

మాటలు తూచి వాడినా ఎంత భావగర్భితంగా మాట్లాడగలడు!

అంతా వెళ్ళిపోయాక చాటుగా తీసుకు వెళ్ళి గుప్పెడు ఉప్పు దిష్టి తీసింది బామ్మ. నాకు ఆమె పిచ్చి బామ్మ. ఆమెకు నేను పిచ్చి తల్లి ని

ఆ రాత్రి అతనికి పాలు ఇచ్చి రావటానికి వెళ్ళినప్పుడు నాలో అన్న మాటలు ఎప్పటికీ నాకు మరపుకు రావు.

'...తాజమహల్ వైభవం, కాశ్మీరు లోయల సౌందర్యం, ఖజురాహో శిల్పాల జీవకళ, కన్యాకుమారి దగ్గర అరుణ సంధ్యలు—ఇవేవీ ఈవేళ నీవు వినిపించిన మధురగానమంతగా నన్ను ముగ్ధుడిని చేయలేక పోయాయి రాధా!'

* * *

వీణ కచేరీ జరిగిన నాటినుంచి రోజూ రెండు పూటల అభ్యసించటం అలవడింది.

ఆదివారం వచ్చింది అతనికి తీరికను తెచ్చింది. శలవు రోజుల్లో మూడు గంటల తర్వాత అతనివద్ద ట్యూషను చెప్పించుకుంటాము సాధారణంగా. హోమ్‌వర్కు పూర్తయింది. ఇంకా మూడుగంటలు కాలేదని శంకరాభరణ రాగంలో తాన వర్ణమొకటి ప్రారంభించాను.

# రాగధార

'సామి నిన్నే గోరి మరులు కొన్నదిరా॥
తామసము సేయక దయ జూడరా
గోపాల॥

నీరజాక్షి నీపై॥'

ఇదివరకు రాగాలాపనలో భక్తి భావంతో సర్వస్వం లీనమైపోయేది. ఇప్పుడా అనుభూతితో స్పందిస్తున్న హృదయంలో ఒక సౌజన్యమూర్తి రూపం లీలగా మెదలసాగింది. చలించిన మనస్సుని మధురభావన ఏదో పెనవైచుకుంది. ఆరాధనతో నిండిన మనస్సుకెంతో బలం చేకూరింది.

స్వప్నాలోకి వచ్చేసరికి రాజా, రవి పుస్తకాలతో ఎదుట ప్రత్యక్షమయ్యారు. ట్యూషనువేళ అయిందని గ్రహించాను.

ముద్దయిన ముంగుర్లు తడి ఒత్తుకొని నేనూ బయలుదేరాను.

రాజా దగ్గరగా వచ్చి రహస్యంగ అన్నాడు. 'అక్కా! మేస్టారి గదిలో ఏదో గమ్మత్తు జరుగుతోంది.'

అంతుపట్టని కుతూహలంతో ఏమిటని అడిగాను.

'ఏమో మరి? గదికి మధ్యగా ఏదో తెర కట్టారు. ఆ తెర వెనకాల ఏం చేస్తున్నారో తెలియదు.'

'...నేను తొంగి చూడాలనుకున్నా నక్కా! కాని, మాస్టారు చూస్తే ?...' అన్నాడు రవి.

వీళ్ళ మాటలతో నా కుతూహలం మరింత పెరిగింది. ఆ గది చేరుకునేవరకు క్షణంసేపు నిలబడలేకపోయాను.

మా హడావిడికి అతను తెర చాటునుంచి మబ్బులు విడిచిన చంద్రుడిలా నవ్వుతూ బయటకు వచ్చాడు.

గదిని రెండు భాగాలు చేస్తూ నిలువెత్తున ఉన్న నీలం రంగు తెరని చూసేసరికి నా ఆశ్చర్యానికి అంతు లేదు. పెన్నంటిన తెరలో కన్నులపండుగ చేసేదేమిటో ?

ఎవరైనా బంధువులా ? ... వచ్చినది ఘోషా స్త్రీలా అంత నిశ్శబ్దంగా ఏం చేస్తున్నారో? నన్నిలా ప్రశ్నలలో వేధించక పోతే అతను గబుక్కున చెప్పకూడదూ ?

'...నీ వీణాగానం పూర్తయింది. ఇక్కడ నా పనీ ముగిసింది.' అన్నాడతను.

'ఏమిటి ?'

'తర్వాత చెప్తాను. ముందు మీ చదువు కానివ్వండి...'

నాకు భలే కోపం వచ్చింది. 'మీ రహస్యాలు మీ దగ్గరే దాచుకోండి. నాకేం చెప్పనక్కర్లేదు' పైకి అనలేని మాటల్ని గుటుక్కున మింగి వూరుకున్నాను.

కాని, రవి వూరుకోలేకపోయాడు. '...మాస్టారూ! తెర కట్టారేమిటండీ! ఎవరైనా వచ్చారా ?'

అతని నవ్వులో కొంటెతనం నాకు అర్థమవుతూనే ఉంది. 'అవునోయ్ ! మా బంధువుల అమ్మాయి వచ్చింది. బొత్తిగా ఒకే గది కదా అని...'

నాలో ఏదో సంచలనం. ఆ వెంటనే అతనిపై వల్లమాలిన కోపం. ఇలా బంధువులు వస్తున్నారని నాకు ముందు చెప్పలేదు. పోనీ, అనుకోకుండా వచ్చారనుకున్నా తర్వాతయినా చెప్పొచ్చుగా! అదీ లేదు ... అంత పరాయిదాన్నయిపోయానా ? ఇంట్లో ఏం అవసరం వచ్చినా తోటి ఆడదాన్ని ఉన్నానని అయినా చెప్పొచ్చుగా! విషయం చెప్తే వీలు చేసుకొని మరో గది ఏర్పాటు చేయకపోయేదాన్నా ? ఇంతవరకు వచ్చాక కూడ పిలిచి పరిచయం చేయలేదు. పైగా తర్వాత చెప్తాడట!—అభిమానం ఉండికూడ అతడు పరిచయం చేయనప్పుడు—ఎంత చనువున్నా సిగ్గు విడిచి నేనేం అడగను? అడిగితే కాని చెప్పకూడనంతటి అపరాధం నేనేం చేసానూ? పోనీ తెలిసాక కూడ చూపకూడనంతటి అపురూపమైన స్త్రీయా ఆమె ?

నా మనోభావాలేమీ పట్టనట్టు నేను చేసిన హోమ్‌వర్కు చూస్తూ ఏవో ప్రశ్నలు వేస్తున్నాడు అతను. అన్యమనస్కంగా ఉన్నానేమో రెండు తప్పులు దొర్లాయి.

'ఏమిటీవేళ పరాగ్గా ఉన్నావు రాధా !' అని పైగా వేళాకోళమాడాడు అతను.

'తల నొప్పిగా వుంది.'

'డాక్టర్లు క్కూడా తల నొప్పి వస్తుందా ?'

మరోప్పుడయితే నవ్వి ఉండేదాన్ని కాని, తల్లడిల్లిన మనస్సు తల నెత్తనివ్వలేదు. తెలియని అశాంతి అంతరాలలో సుడులు తిరుగుతోంది.

అరగంట గడిచింది. అతడు నా విషయం పట్టించుకోలేదు. చదువు ధోరణి తప్ప ఎదుటి వ్యక్తి మానసిక సంఘర్షణ పట్టించుకోని గురువు అతడు ! ఉక్రోషంతో కన్నీళ్ళ పర్యంతమయింది నాకు.

అదేమంత పెద్ద విషయం కాదేమో కాని — నాకు అవమానభరితంగా ఉంది. అకారణంగా అతడు చూపిన నిర్లక్ష్యానికి వెంటనే బదులు తీర్చుకోవాలన్న పట్టుదల నన్ను నిలువనీయలేదు.

'ఒక స్నాత్ర వేసుకొని వస్తాను మాస్టారూ !'

'అలాగే !'

అతని ముఖం మీద విన్నోసార్లు అదే చిరునవ్వు వింత అందాన్నిచ్చింది. వా



మనస్సు కొనేందాన్నిచ్చింది. కాని, ఇప్పుడు అందులోని మాధుర్యం మొహం మొత్తింది. గుండెల్ని జ్వాలాజ్వలితం చేసింది.

నిజంగానే నాకు తలనొప్పి వచ్చింది. తెచ్చిపెట్టుకున్న తలనొప్పికి మందు ఎక్కడుంది? వేడి వేడి కాఫీ త్రాగితే కొంత ఉపశాంతి కల్గుతుందేమో?

కాఫీకి నీళ్ళు పడేసాను. మళ్ళీ ఆలోచనలు మొదలయినాయి. తెర మరుగున ఉన్న ఆ అమ్మాయి ఎవరో గంటసేపు మేమక్కడున్నా కదలిన సవ్వడి లేదు. ఎక్కడయినా ఇంత ఘోషా స్త్రీ లుంటారా?

అటువంటి స్త్రీ పగటివేళ మా యింటికెలా వచ్చి వుంటుంది? లేక రాత్రే వచ్చిందా? అయితే, భోజనం ఎక్కడ చేసి ఉంటారు? అతను కేరియర్ తెచ్చాడేమో! మరి స్నానానికి దొడ్లోకి వచ్చి ఉండాలి కదా! అబ్బ, ఇంత సస్పెన్సులో పెట్టి చంపక పోతే ఆమెకు నన్ను పరిచయం చేయకూడదూ? ఇంత కాఠిన్యం అతనిలో ఎలా ఉందబ్బా!

వెంటనే చక్కని ఆలోచన తట్టింది నాకు. ఒక కప్పు కాఫీ నేను త్రాగి, మరో రెండు కప్పులతో కాఫీ తీసుకొని వెళ్ళాను.

నన్ను చూస్తూనే, 'తలనొప్పి తగ్గిందా రాధా?' అని అడిగాడతను.

'కొంచెం తగ్గింది...' అంటూ రెండు కప్పులూ అతని ముందు పెట్టాను.

'ఇప్పుడు కాఫీ ఎందుకు రాధా? అనవసరమైన శ్రమ నీకు...'

'శ్రమేముంది? ... నతోపాటే మీకూ తెచ్చాను.'

'మరి నువ్వు తీసుకో!'

'ఉహుఁ! నేను త్రాగే వచ్చాను.'

'మరి రెండెందుకు నాకు?'

నాకు ఒళ్ళు మండిపోయింది. 'ఎంత సేవూ మీ దృష్టి మీది! ఇంటికి వచ్చిన వాళ్ళకి ఏం అమరుతున్నాయో చూసుకోవద్దూ! మా చదువుల్లోపడి మీ బంధువుల విషయమే మర్చిపోతున్నారే మీరు!'

'ఓహో! అదా సంగతి .. ఐయామ్ సారీ! ఆమెకు కాఫీ ఇష్టమో కాదో! సరే, అడిగి వస్తానుండు.' అని ఒక కప్పుతో తెరచాటుకి వెళ్ళాడతను.

తెర తొలగిన క్షణంలో ఏ స్త్రీ రూపమయినా కనపడవచ్చుని ఆశించాను. ఒకవేళ ప్రక్కగా ఉందేమో! నాకు కనపడలేదు.

చెవులు రిక్కించి వింటున్నాను.

'రాధ కాఫీ పంపింది ... త్రాగు మరి... త్రాగవూ? నాకోసం త్రాగు...లేకపోతే రాధ బాధ పడుతుంది...' అతని మాటలు తప్ప ఆ అపురూపమైన స్త్రీ గొంతు మాత్రం ఎక్కడా వినపడలేదు.

(ఇంకా ఉంది)

# హరేకృష్ణ ఉద్యమం

మనదేశంలోనే యీ కాలంలో హిందూ మత ప్రచారం సరిగ్గా జరగడంలేదు. హిందూమత ప్రచారమే తమ జీవితలక్ష్యంగా ఉన్న మఠాధిపతులు, స్వాములవార్లు చాలా మంది ఉన్నారు కాని 'అప్పుడప్పుడు యే దేవాలయంలోనో, టౌన్‌హాల్లోనో ఒక ఉపన్యాసం యిస్తే చాలును తమ బాధ్యత అంతటితో తీరిపోతుంది' అని వారు భావిస్తున్నట్లుగా కన్పిస్తుంది

ఆర్థికంగాను విద్యావిషయంలోను వెనుకపడిపోయిన హిందూవర్గం నివసిస్తున్న ప్రాంతాల్లో అన్యమత ప్రచారం విరివిగా జరుగుతున్నది. హిందూమత ప్రచారకులు కూడా ఆ ప్రాంతాలకు వెళ్లి తమ వాదబలంతోను సేవాకార్యక్రమంతోను యితర మత ప్రచారాన్ని యెదుర్కోవలసి ఉంది కాని ఆ ప్రాంతాల్లో అసలు హిందూమత ప్రచారమే జరగడంలేదు అందుచేత హిందూదేశంలోనే హిందువుల సంఖ్య తగ్గిపోతున్నది

ఈ పరిస్థితిలో హిందూదేశానికి సంబంధించిన ఒకస్వామి విదేశాలకు వెళ్ళి, అక్కడ కృష్ణభక్తిని బోధించం, అందువలన కొంతమంది పాశ్చాత్యులు భక్తిమార్గాన్ని అంగీకరించి శ్రీకృష్ణుని హిందూ ఆచారాలతో పూజించడం ప్రతిహిందువుడూ గర్వించ



శ్రీ భక్తి వేదాంతస్వామి ప్రభుపాద

వలసిన విషయం.

శ్రీ చైతన్య ప్రభు సాంప్రదాయానికి చెందిన శ్రీ భక్తి వేదాంతస్వామి ప్రభుపాద 1965 వ సంవత్సరంలో అనగా తమ 70 వ యేట భక్తిమార్గాన్ని బోధించడానికి అమెరికా వెళ్లారు.

అక్కడ ఆయన చేసిన ప్రచారానికి ఫలితంగా 1966 వ సంవత్సరం జూలై నెలలో ది యింటర్‌నేషనల్ సొసైటీ ఫర్ కృష్ణా కాన్షన్‌నెస్ స్థాపించబడింది ఇదే హరేకృష్ణ ఉద్యమంగా పిలువబడుతున్నది.

అమెరికా, యింగ్లాండు, ఫ్రాన్సు, ఆస్ట్రేలియా, జపాన్ మొదలైన దేశాల్లో యీ ఉద్యమానికి 30 శాఖలు ఉన్నాయి.

ఈ ఉద్యమంలో సభ్యులుగా చేరదలచుకొన్నవారు ముఖ్యంగా నాలుగు నియమాలను పాటించవలసి ఉంది. అవి :

1) మత్స్య మాంసాదులను తినకూడదు

2) మత్తు పదార్థాలను సేవించకూడదు కాఫీ, టీ, సిగరెట్లను కూడా వదలివేయాలి

3) జూదం ఆడకూడదు.

4) వ్యభిచారం చెయ్యకూడదు.

సిగరెట్లు, కాఫీ, టీ కూడా తాగకూడదనే నియమం ఉండడంవలన యీ



మద్దెల వాయిస్తూ తన్మయత్వంతో కృష్ణ నామ సంకీర్తన చేస్తున్న పాశ్చాత్య కృష్ణభక్తుడు.

ఉద్యమంలో సభ్యులుగా చేరేవారి సంఖ్య మొత్తంమీద తక్కువగానే ఉంటుంది.

దేవదేవుడైన శ్రీ కృష్ణుని పూజించడం, శ్రీ కృష్ణనామ సంకీర్తన చెయ్యడం, భగవద్గీత మొదలైన గ్రంథాలను అధ్యయనం చెయ్యడం యీ ఉద్యమంయొక్క ముఖ్య కార్యక్రమం.

ఈ ఉద్యమంలో పాల్గొన్న వ్యక్తులు పట్టణపు వీధుల్లో నాట్యం చేస్తూ 'హరేరామ, హరేకృష్ణ' అంటూ నామ సంకీర్తన చేయడం అక్కడ ప్రజలను విశేషంగా ఆకర్షిస్తూ ఉంది.

లండన్, శాన్‌ఫ్రాన్సిస్కోవంటి పట్టణాల్లో జగన్నాథస్వామి రథయాత్రకూడా జరిపారు. దానిలో వేలాదిప్రజలు నామ సంకీర్తన చేస్తూ పాల్గొన్నారు.

ఈ ఉద్యమంలో సభ్యులు అయినవారు పిలకలు, నామం ఉంచుకోవడం, పంచె కట్టుకోవడం, ప్రారంభంలో ఉచ్చారణ కష్టం అయినప్పటికీ వారు భగవద్గీత మొదలైన సంస్కృత గ్రంథాలను చదవడం వారి పట్టుదలకు నిదర్శనం.

ఈ మధ్యను శ్రీ ప్రభుపాద కొంత మంది పాశ్చాత్యశిష్యులను వెంటబెట్టుకొని మద్రాసు వచ్చారు. ఆ సందర్భంలో ఆ పాశ్చాత్యశిష్యులు మౌంటురోడ్డులో నాట్యం చేస్తూ హరేకృష్ణనామ సంకీర్తనం చేశారు. వారిని చూసిన తరువాత కొంతమంది స్థానికులు కూడా ఆ నామసంకీర్తనలో చేరారు.

స్థానిక కళ్యాణమండపంలో మూడు రోజులపాటు శ్రీకృష్ణపూజ, శ్రీ ప్రభుపాద ఉపన్యాసాలు జరిగాయి.

శ్రీ ప్రభుపాద, వేదికమీద కూర్చున్నంతసేపూ పాశ్చాత్యశిష్యులు వింజామరలతో వారికి వీస్తూనే ఉన్నారు. వారి గురుభక్తి నిజంగా అందరికీ ఆదర్శప్రాయం.

ఉపన్యాసం అయిపోయిన తరువాత భాగవతం, భారతం మొదలైన గ్రంథాల్లోని ముఖ్యమైన ఘట్టాలు సినిమా స్లైడ్స్ ద్వారా చూపించబడ్డాయి. వాటిని ఆ పాశ్చాత్యులే మనకు వివరించి చెప్పారు. వారు చెప్పేవరకూ కొన్ని విషయాలు మన హిందూసోదరులకే తెలియలేదు.

ఆఖరున ఆ శిష్యుల్లో ఒకరు సమావేశానికి వచ్చినవారితో యిలాగ అన్నారు.

'శ్రీ చైతన్యమహాప్రభు బోధించిన భక్తిమార్గమే సర్వశ్రేష్ఠమైనదని మేము ప్రకటించుచున్నాము. దానిమీద యెవరికైనా సందేహాలు ఉంటే ప్రశ్నించవచ్చును. మేము సమాధానం చెప్పగలము.'

దానిమీద కొద్దిమంది ప్రేక్షకులు ఏవో ప్రశ్నలు వేశారు. ఆ శిష్యుడు వెంటనే భగవద్గీత, ఉపనిషత్తులు, భాగవతం మొదలైన గ్రంథాలనుంచి శ్లోకాలను ఉదాహరిస్తూ, ఆ ప్రశ్నలకు సమాధానం యిచ్చి అక్కడ ఉన్నవారందరికీ ఆశ్చర్యాన్ని కలిగించాడు.

కాని ఆ పాశ్చాత్యశిష్యులు, కొంతమంది పత్రికావిలేఖరులతో మాట్లాడుతూ తాము వర్ణవ్యవస్థనుకూడా బలపరుస్తున్నట్లుగా చెప్పినట్లు ప్రకటించబడింది.

హిందూమతంమీద వారికి యెంత భక్తిశ్రద్ధలు ఉన్నప్పటికీ, వర్ణవ్యవస్థను బలపరచడం మాత్రం సమర్థనీయం కాదు. ఈ ఒక్క విషయాన్ని మినహాయిస్తే 'హరేకృష్ణ ఉద్యమాన్ని' హిందువులందరూ త్రికరణశుద్ధిగా బలపరచవచ్చును.

హరేకృష్ణ ఉద్యమంయొక్క వివరాలు తెలుసుకోగోరినవారు ఈ అడ్రసుకు ఉత్తరం రాయవచ్చును: ది యింటర్నేషనల్ సొసైటీ ఫర్ కృష్ణా కాన్షస్‌నెస్ 40 యన్ బీకన్ స్ట్రీటు 02134 బోస్టన్, అమెరికా.




✷ "చిన్నక్క ఈ పాడుకొంపలోంచి పోయి మెుఖపడింది. మగ వెధవనయినా నా కా తెగింపు లేకపోతోంది. వెధవ కొంప ఛీ... దిక్కుమాలిన ఈ దరిద్రపు కొంపలో బతకటంకంటే చావటం మేలు"

వరండాలో పడక్కుర్చీలో వెనక్కివాలి పేపరు చదువుకొంటూన్న విశ్వం గంటకు పైగా చిన్న కొడుకువేసే చిందులు వింటూనే వున్నాడు.

అతను, చప్పున లేచి నిలబడి సహనం కోల్పోయినవాడిలా పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ వచ్చి హరికృష్ణ గదిముందు నిలబడి గట్టిగా అరిచాడు.

"నోరు మూసుకో హరీ. వెధవ వాగుడు మరీ ఎక్కువవుతోంది వూరుకొన్న కొద్దీ... వెధవ కొంప అంటే అర్థం ఏమి(టా?"

గదిలో టేబిల్ మీద చిన్న అద్దం వూడిపోయిన స్టాండుతో నిలబడలేక పోతోంది. హరికృష్ణ దాని నెత్తిన పౌడరు డబ్బాతో విసుగ్గా ఒక్కటి వేసి దాన్ని పౌడర్ డబ్బాకి ఆనేలా కొంచెం జార్చి పెట్టాడు. తన కోపం అంతా దువ్వెన తీసు కోటంలో కొంచెం అడ్డు వచ్చిన పుస్తకం విసిరేసి తీర్చుకొని, చెయిచాపి దువ్వెన తీసుకోబోతూన్నవాడల్లా ఆగి భుజం మీదుగా మెడతిప్పి ఒక్క క్షణంపాటు తండ్రి కళ్లల్లో కంటా చూసి చాలా విసు రుగా తల తిప్పేసుకొన్నాడు. ఆ చూపుల్లో అంతులేని నిర్లక్ష్యం, తిరస్కారం, ఏవ గింపు....విశ్వానికి చెళ్లున కొరడాతో వెన్నున చరచినట్లయింది.

"ఏం...దరిద్రం కొంప అంటే ఏం లోటు రాలేదులెండి. అసలు ఈ కొంపని సరిగ్గా "డిఫయిన్" చేయా లంటే ప్రత్యేకం వో పదం సృష్టించాలి" ఆ గొంతులో అవహేళన.

"హరీ...." విశ్వం కంఠంలోంచి పిడుగులు పడసాగినాయి. అతను చేతిలో పేపరు కింద పడేసి గబ గబా గుమ్మం దాటాడు. కొడుకు షర్టు గుండెల దగ్గర గుంజినట్లు పట్టుకొని కుడిచేత్తో హరి కృష్ణ చెంప ఛెళ్లు మన్పించాడు. ఈ హటాత్పరిణామాన్ని వూహించని హరి కృష్ణ నిమిషంసేపు స్తంభించిన వాడిలా అయ్యాడు. అతను నిటారుగా అయి కోపంగా చూసాడు తండ్రివైపు. ఆ కళ్ళు నీటితో, రోషంతో తళతళా మెరిశాయి.

ఆ కళ్లల్లో నీళ్లు చల్లగా వలయాలు తిరిగి కోపంతో వెచ్చబడి జారిపోతు న్నాయి. అతడి వచ్చని పసితనం వదలని బుగ్గమీద విశ్వం వేళ్లు బలంగా వాతలు తేలి మధ్య మధ్య నల్లగా కమిలాయి. మండిపోతోన్న బుగ్గని కుడిచేత్తో బలంగా అదుముకొని రెట్టించిన రోషంతో అనే శాడు హరికృష్ణ.

"మీకు కోపంవస్తే రానీండి నాన్నా:... మాకూ ఆశలు ఉంటాయి. అంత దిక్కు లేని వాళ్లు ఇంతమంది పిల్లల్ని కనకూడదు"

విశ్వం షాక్ తిన్నట్లు అదిరిపోయాడు. హరిని కొట్టిన చేతిలోంచి నరాల్ని జివ్వు మన్పించే విద్యుత్తు వెన్నుదాకా పాకినట్ల యింది. అతను దిగ్భ్రమగా నిలబడిపోయేడు.

అంత దిక్కులేని వాళ్ళు ఇంతమంది పిల్లల్ని కనకూడదు నాన్నా......''

హరికృష్ణ నోటివెంట ఆ మాటలు ఉరుములా ధ్వనించి పిడుగు మాదిరి అతని నెత్తిన పడి మెరుపులా దూసుకెళ్ళి అంత రంగాన్ని చిత్రవధ చేయసాగినాయి.

వంట గది గుమ్మంలో తండ్రీ కొడుకుల గొడవ వింటూ భయంగా నిలబడిపోయిన యమున చైతన్యం వచ్చిన దానిలా కదిలి, గుమ్మం దాటి విసురుగా బయటకు వచ్చేస్తోన్న కొడుక్కి ఎదురయ్యింది.

''హరిబాబూ. . . .పెద్దా చిన్నా లేదుట్రా. . . . .? నోటి కేం తోస్తే అంతా మాట్లాడ్డ మేనా. . . .?''

ఆవిడ కోపంగా కొడుకును చూస్తూ నోరు తెరచి ఏదో అనబోయేంతలో హరికృష్ణ మరి ఓపికలేని వాడిలా చప్పున తల్లి మెడచుట్టూ చేతులు పెనవేసి ఆవిడ వక్షస్థలంలో తలదాచుకొని ''అమ్మా....'' అన్నాడు ఆర్తిగా.

హరి కన్నీళ్లతో యమున పమిట తడిసిపోయింది. ఆవిడ ఆర్ద్రమైన హృదయంతో హరి భుజాలమీద చేతులువేసింది ఓదార్పుగా.

విశ్వం తేరుకు చూసేలోపల హరికృష్ణ తల్లి గుండెల్లోంచి తలెత్తి తండ్రిని తిరస్కారంగా చూసాడు. వంగి తల్లి పాదాలు తాకి గబగబా మెట్లు దిగి మలుపు తిరిగేసి మాయం అయ్యాడు.

రెండు నిమిషాలు కొడుకు వెళ్ళిన వైపు చూసి కన్నీళ్ళు కొంగుతో అద్దుకొని వంటింట్లోకి వెళ్ళింది యమున.

అంతవరకూ ఆ గొడవకి భయంగా ఒక మూలకంటూ ఒదిగిపోయినట్లు నిలబడ్డ అయిదుగురు పిల్లలూ నెమ్మదిగా తల్లి దగ్గరికి జారుకొన్నారు.

ఇందాకటినుంచీ వేడిగావున్న ఆ వాతావరణం ఒక్కసారిగా నిశ్శబ్దంగా మారిపోయింది. సూది పిటుక్కుమన్నా స్పష్టంగా వినిపించేంత నిశ్శబ్దం. ఎందుకో ఆ ప్రశాంతత భయంకరంగా శ్మశాన నిశ్శబ్దతలా తోచింది విశ్వానికి.

అతను నిస్సత్తువగా అడుగులో అడుగు వేసుకొంటూ ఎలాగో వచ్చి ఇందాకటి పడక్కుర్చీలో వెనక్కివాలిపోయాడు.

పది నిమిషాల క్రితం అతన్ని బలంగా నిలబెట్టిన ఆవేశం ఆవిరై ఆ స్థానంలో ఏదో శూన్యం మెల్ల మెల్లగా ఆవరించుకోసాగింది. అతని కళ్ళు గాజు కళ్ళులా, ఆ చూపులు శూన్యంలో చిక్కుపడ్డట్లుగా అయ్యాయి. మనసులోంచి మరో మనిషి ఎవరో వికటంగా నవ్వుతూ కళ్ళముందు నిలచి సవాల్ చేయసాగాడు.

''చెప్పు విశ్వం. హరి ప్రశ్నకి జవాబివ్వు. అతనికి నువ్వు ఏం ఇవ్వగలిగావు?..... ఇంతమంది పిల్లలు ఈలోకంలోకి రావడానికి బాధ్యుడవైన నువ్వు. . . . .నీ పిల్లలకి. నువ్వు ఇంటి దీపాలని మురిసిపోయిన నీ పిల్లలకి జవాబు చెప్పుకో. వాళ్ళకి కడుపునిండా తిండి పెట్టలేక వాళ్ళ అవసరాలు తీర్చలేకా అసమర్థుడివైన నువ్వు. . . హరి అడుగుతున్న దానికి సంజాయిషీ ఇవ్వు... ఊ.. . .చూస్తావేం?''

''ఏం చెప్పను నేను. అసమర్థుడిని. నేను నిస్సహాయుడిని....''

విశ్వం పెదవులు అస్పష్టంగా కదిలాయి. శబ్దం రాని మాటలు గాలిలో కలిసిపోయాయి. అతని కళ్ళు తడిగా కిందికి వాలేయి.



సిగ్గుల పెళ్ళి కూతురై అందాల అపరంజిలా తన జీవితంలోకి అడుగు పెట్టిన యమునతో మొదటి రాత్రి ''కలకాలం నిన్ను నా కళ్లల్లో దాచుకొంటాను యమునా. దేవతవి నువ్వు. నా గుండెల్లో నీకు కోవెల కట్టాను. నా జీవితానికి కొత్త కాంతివి నువ్వు యమునా'' అన్నాడు విశ్వం అనురాగంగా. భార్యను హృదయంలోకి తీసుకొంటూ.

కలకాలం ఆమెను కళ్లల్లో దాచుకొన్నా... పెళ్లయిన కొత్తలో యమున రూపాన్ని మరో ఆరేళ్ళ తర్వాత ఆమె ప్రక్కన వూహించుకొని, ఆనాటి తన మాటలు గుర్తు రాగా గుండెల్లో గునపాలు దిగేసినంతగా బాధ పడేవాడు విశ్వం.

''నా మాట నిలుపుకోలేక పోయాను. నన్ను మన్నించు యమునా......''

శుష్కించిపోయిన ఆమె చెక్కిళ్ళు తడుముతూ లోకంలోని మార్దవాన్నంతా గొంతులో నింపుకొని అనేవాడు విశ్వం.

యమున చెయి చాచి సున్నితంగా అతడి పెదవులు మూసేది ''ఇప్పుడు మాత్రం నాకేం లోటు. అనురాగాన్ని మించిన పెన్నిధి కోరదు ఏ స్త్రీ అయినా''

పెళ్లయిన ఏడాదికే హరితని, మరో ఏటికి వంశీకృష్ణని ఒడిలోకి చేర్చుకొంది యమున. ఏడాది తర్వాత మాలిని, వెనకగా హరికృష్ణ ఆ ఇంట సభ్యులయ్యారు. విశ్వం సంపాదనతో బతకాల్సిన మెంబర్లు అప్పటికే ఎక్కువయి, ఆ కుటుంబం పోషించటం అతడి శక్తికి మించిన పనే అయినా ముద్దుగా, బొద్దుగా తెల్ల గులాబీల్లా వుండే తన బిడ్డల్ని ''ఇంక చాలు'' అనుకోలేదు విశ్వం. పిల్లలు భగవంతుని వరాలని, ప్రకృతి నడ్డగించడం మహాపాపమనే సంప్రదాయాల ఇంట పుట్టిన విశ్వం స్వచ్ఛమైన వైదిక కుటుంబంలో, ఉక్కు కడ్డీల్లాంటి ఆచార వ్యవహారాలమధ్య పెరిగిన విశ్వం తలలో, కుటుంబాన్ని పరిమితం చేసుకోవాలనే భావం కూడా లేదు. బాత్ రూమ్‌లో డొక్కుంటోన్న భార్య భుజాల చుట్టూ చెయ్యివేసి ఆదుర్దాగా దగ్గరకు తీసుకొంటూ అడిగాడు విశ్వం.

''ఏం యమునా....వంట్లో బాగులేద లేదా.....డాక్టర్ దగ్గరికెళ్దాం పదు....''

భర్తని చిరునవ్వుతో చూసింది యమున.

''డాక్టర్ అవసరం ఏంలేదు అంతా మామూలే......''

''అంటే'' క్షణంపాటు కనుబొమలు ముడిచి భార్య భుజం గుచ్చి పట్టుకొని అడిగాడు. యమున చప్పున అతని మెడ వంపులో ముఖం దాచుకొని నెమ్మదిగా గొణిగింది. ''నేషనల్ డిసీజ్...''

''ఓ...'' విశ్వం కనుబొమల మధ్య ముడి విడిపోయింది. కళ్లల్లో ఆనందం జారి పెదవుల చివర కొంటెగా మెరిసింది.

''కంగ్రాట్స్ అండ్ థాంక్సు. యమునా మనకో బుజ్జితండ్రి కదూ....''

అయిదవసారి తండ్రి కాబోతున్నా భర్తతో మొదటి బిడ్డపుట్టినప్పటిదే ఆనందాన్ని వింతగా చూసింది యమున.

శ్రీకాంత్ తర్వాత పల్లవి పుట్టింది. ఆరోజు నాలుగు నెలల పల్లవిని ''వ్వా, ఆ'' అని మురిసిపోతూ వింటోన్న భర్తతో అంది యమున.

''మనకి ఆరుగురు పిల్లలూ చాలండి ఇంకొద్దు. మనకేమైనా ఆస్తి పాస్తులా...,

మీ ఒక్కరి రెక్కలతో వీళ్ళందర్నీ సాకాలి. చదువులూ, పెళ్ళిళ్ళూ" కళ్లముందు... ఏవో దృశ్యాల్ని చూస్తున్నట్లుగా అంటూన్న భార్యని వింతగా చూసాడు విశ్వం.

"క్రొత్తగా మాట్లాడుతున్నావు యమునా ఏమిటయింది నీకీ వేళ....."

"నాకేం కాలేదు. ఆలోచిస్తే భయంగా వుంది. వీళ్ళు పుట్టిన వాళ్ళు పుట్టినట్లే ఉండిపోతారా.....వీళ్ళు పెరిగేకొద్దీ అవసరాలూ పెరుగుతాయి....."

యమున చెయ్యి తన చేతుల మధ్యకు తీసుకొని మృదువుగా అన్నాడు విశ్వం. "చూడు యమునా ఒక్కసారి మన బిడ్డల వైపు చూడు" అతను లేచి వెళ్ళి చుట్టూ మంచాలమీద నిద్రపోతున్న పిల్లల్ని కళ్ళతోనే చూపిస్తూ,

"ఇల్లాంటి బుజ్జి తండ్రులు ఎంతమందయినా కావాలనిపించేలా లేరూ..... వీళ్లల్లో ఒక్కరికయినా వంక ఎంచలేనంత అందంగా....."

"వంక ఎంచలేనంత అందంగా ఉండాల్సినవి ముఖాలు ఒక్కటే కాదండీ.....బ్రతుకులు కూడా" రోషంగా అంది యమున.

"యమునా" విశ్వం అసహనంగా పిలిచాడు.

"అంటే నీ వుద్దేశం ఏమిటో సూటిగా చెప్పు...."

"ఎందుకంత కోపం... నే చెప్పేది పూర్తిగా వినండి. మీ జీతంతో బతకాల్సిన వాళ్ళం ఎంతమందీ.. ఆరుగురు పిల్లలు, మనిద్దరం, అత్తగారు, మావగారూ.. ఇంకా పిల్లలు పుట్టుకొస్తుంటే ఎట్లా జరుగుతుందీ కొంచెం అయినా ఆలోచించారా..? మీరు కాకపోతే నేను ఆపరేషన్.."

యమున మాటలు పూర్తి కాకుండానే విశ్వం చెయ్యి భార్య భుజంమీద నుంచి తన వైపుకు తిప్పుకొంది. "చూడు యమునా. ఈ ప్రస్తావన నిండు ఇంట్లో ఇంకెప్పుడూ తేకు. నేనెంత చదువులు చదివి ఉద్యోగం వెలిగిస్తున్నా పూర్వ సంప్రదాయాల పట్ల, ఆచారాలని.. గౌరవిస్తాను. నువ్వేమయినా అనుకో...నీ ఖర్మకొద్దీ నాలాంటిమూర్ఖుడు దొరికాడనుకొన్నా సరే.. నీ ఇష్టం.." ఎర్రబడ్డ ముఖంతో అనేసి గబగబా బయటకు వెళ్లిపోతూన్న విశ్వాన్ని విస్మయంగా

# చేజారని స్వర్గం

చెమల్చు కళ్లతో చూడసాగింది యమున. ఆలోచించి ఆమె మనసు అలిసిపోయింది. నలుగురు పిల్లలు పుట్టేవరకూ చాలా హాయిగా సాగింది సంసారం. కాని ఇప్పుడిప్పుడే ఏదోలోటు, ఏమైనా కొనాలన్నా, చేయాలన్నా ఒకలాంటి సంశయం ఆ ఇంట్లో క్రమంగా చోటు చేసుకొంటోంది. "ఇలాంటి స్థితిలో ఇంకా పిల్లలు.... పిల్లలు.. అని కోరుతాడెందుకూ ఇతనూ. ఆపరేషన్ అంటే అసహ్యంట. ఇంకా ఎప్పటికి బాధ్యతలు తెలుస్తాయి ఈ మనిషికి. ఇప్పుడు నేనేమన్నాననీ అంత కోపం..." యమున కళ్లలో నీళ్ళు వూరాయి. "కానీ... తనకి లేని బాధ నాకుమాత్రం ఎందుకూ"... నిట్టూర్చింది యమున.

ఏడవ సంతానం జ్యోతిర్మయి. ఆ పాప పుట్టినప్పుడు యమునకి చాలా జబ్బు చేసింది. దాదాపు మూడు నెలలపాటు ఆమె మంచం మీంచి క్రిందికి దిగలేని పరిస్థితిలో వుండిపోయింది.

నోటితో చెప్పకపోయినా భార్యకళ్లల్లో కదులుతున్న దైన్యాన్ని చూసి జాలితో నిండిపోయింది విశ్వం మనసు.

"బంగారంలాంటి నా బిడ్డల కోసం నువ్వేం బెంగపడకు యమునా. నా తల్లి హారితని మెడిసన్ చదివిస్తాను. వంశీ ఇంజనీర్. మాలి క్లాసులో ఫస్ట్ రాంకట తెల్సా... శ్రీ, పల్లవి పెద్ద చదువులు చదువుతారు. జ్యోతి ఇంకా చిన్నతల్లే. మన వాళ్లకి అవకాశం వస్తే ఫారిన్ కూడా వెళ్తారు. అప్పుడు చూడు. అందరూ నిన్ను ఫారిన్ రిటర్న్డ్‌గారి తల్లీఅంటూ.."

"మెచ్చి మేకతోలు కప్పుతారు అవునా!" యమున పైకి చిరునవ్వు నవ్వి మనసులో గాఢంగా నిట్టూర్పు విడిచేది. పైకి ఏమైనా అంటే భర్త ఎట్లా మారుతారో ఆమెకు బాగా తెలుసు.

"చూడు యమునా రేపో మాపో నాకు ప్రమోషన్ వస్తుంది. పిల్లల్ని, పెళ్ళాన్ని పోషించుకోలేనంత అసమర్థుడినా, నేను?"

ఒకోసారి డీలాపడిపోతూన్న భార్యను వోదార్చేవాడు విశ్వం.

భర్తను శంకించేంతగా ఎదగని యమున "మీరుండగా నాకేం భయం" అనేది అతని గుండెల్లో, ముఖం దాచుకొని.

మూడేళ్లు గడిచినా విశ్వం ఎదురు చూసిన ప్రమోషన్ రాలేదుగానీ నివేదిత, శ్రీనివాస్ అతడి పిల్లల సంఖ్యని ఏడు నుంచి తొమ్మిది దాకా పెంచారు. హారితని పి. యు. సి. తర్వాత మెడిసన్ చదివించాలని కలలు కన్న విశ్వం హారిత ఫస్ట్ క్లాస్‌లో పాసయినా అడ్డుచెప్తున్న ఆర్థిక పరిస్థితులని ఎదిరించలేక "సారీ... తల్లీ" అనేశాడు.

చిన్నప్పటి నుంచీ తండ్రి అండలో డాక్టర్ కావాలన్న కాంక్షతో శ్రద్ధగా చదివి ప్రతియేడు ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యే హారిత మనసు దెబ్బతిన్నా, ఆ బాధ పైకి వ్యక్తం చేయక "పరవాలా నాన్నగారూ మీరు బాధపడకండి" అంది.

యమున తమ్ముడు ప్రభాకర్ ఇంజనీర్. హారితని కట్నంలేకుండా చేసుకొన్నాడు. వంశీ ఇంజనీరింగ్ సెకెండ్ ఇయర్‌లోకి వచ్చాడు. పి. యు. సి. చదువుతూ సాయంత్రాలు టైప్ నేర్చుకొని పరీక్షలు పాసయిన మాలిని తన స్నేహితురాలి తండ్రి సాయంతో ఉద్యోగం సంపాదించి తండ్రికి ఆ విషయం చెప్పింది.

విశ్వం ఆశ్చర్యంగా చిన్నకూతురిని చూసాడు.

"అవును నాన్నగారూ. ఈవెనింగ్స్.. కాలేజీలో ప్రైవేట్‌గా చదువుకొంటా లెండి. హరి కాలేజ్ చదువుల కొచ్చాడు కూడాను" అంది మాలిని సర్దిచెప్తూ.

అయినా విశ్వం మనసు వూరట చెందలేదు. తన పరిస్థితులు తన పిల్లల మీద ఎంతగా ప్రభావం చూపిస్తున్నాయో తలచుకొన్న కొద్దీ మంటల్లో వున్నట్లు అనిపించ సాగిందతనికి. ప్రైవేట్లు చెప్పి అయినా తన స్థితి చక్క బరుచుకొని చిన్న కూతుర్ని ఉద్యోగం మాన్పించి చదివించాలని విశ్వ ప్రయత్నం చేసి ఓడిపోయాడు విశ్వం. పూర్తిగా చెడిపోయిన బార్య ఆరోగ్యం, నుగతా పిల్లల చదువులూ అతన్ని బలవంతంగా, తలవంచేలా చేశాయి.

తనతోపాటు ఆఫీస్‌లో పనిచేస్తూన్న వాణీనాథ్ సంస్కారం మాలిని మనసు దోచుకుంది. రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి



# తల నొప్పా?
# అనాసిన్

## నొప్పి నివారణకు మేలైనది. ఎందువలనంటే అది బలీయమైనది మరియు సురక్షితమైనది.



ఒలింపియన్ ఫుట్ బాల్ ఆటగాడు నెవిల్ డిసౌజా అనాసిన్ వాడకందారు. 'నేను ఎల్లప్పుడూ అనాసిన్ దగ్గర ఉంచుకుంటాను', అని అతను అంటాడు.

***బలీయమైనది*** ఎందువలనంటే ప్రపంచమంతటా ఎక్కువ మంది డాక్టర్లు సిఫారసు జేసే బాధా నివారక పదార్థాలు అనాసిన్ ఎక్కువగా కలిగియున్నది. అందువలననే అనాసిన్ బాధనుంచి సత్వర నివారణ కలిగిస్తుంది.

***సురక్షితమైనది.*** ..ఎందువలనంటే అనాసిన్ డాక్టరు ఇచ్చే మందుల మిశ్రమం వంటిది. మీరు దానిని సురక్షితంగా పిల్లలకు గూడా ఇవ్వవచ్చును. అన్ని మందుల విషయంలో వలె, మీ పిల్లలకు దీని సరియైన మోతాదు కోసం మీ డాక్టరును సంప్రతించండి.

జలుబు మరియు ఫ్లూ వలన కలుగు నొప్పులకు, తలనొప్పి, వెన్నుం నొప్పి, కండరాల నొప్పులకు మరియు పంటి నొప్పికి బాగా పనిచేస్తుంది.

**అనాసిన్**

**భారతదేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పి నివారిణి**




Regd. User of TM, Geoffrey Manners & Co. Ltd.

# చేజారని స్వర్గం

చేసుకొని ఇంటికి వచ్చారు ఇద్దరూ. ఒక్క క్షణం విశ్వం నిటారుగా అయ్యాడు.

"ఛీ .. నీచురాలా .. నా కడుపున చెడబుట్టావ్. నా వంశ ప్రతిష్ఠలు మట్టిలో కలిపావ్. ఇంకా ఎందుకు వచ్చావ్. ఏం సాధిద్దామని. నేం చచ్చానో లేదో చూద్దామని వచ్చావా ..?".

విశ్వం ఆవేశంతో వూగి పోతున్నాడు. అతని కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి.

"ఫో .. నా ముందు నుంచి .. ఇంకో క్షణం నా కళ్లముందుంటే నిన్నేం చేస్తానో నాకే తెలీదు .." అతనిమాటలు పిడుగుల మాదిరి ఆ నిశ్శబ్ద వాతావరణంలో ప్రతిధ్వనిస్తున్నాయి. పసుపు బట్టల్లో మాలిని ప్రక్కగా వాణీనాథ్ అందంగా హుందాగా నిలబడి వున్నాడు. అతన్ని చూస్తే తక్కువ కులంలోనివాడని ఎవ్వరూ అనుకోరు.

"లేదు నాన్నగారూ నేనేం తప్పు చేయలేదు. మనసుకి నచ్చిన వారిని పెళ్లి చేసుకొన్నాను. అంతేగా. నాకు మనసు ముఖ్యం నాన్నా .. కులం, గోత్రం వీటికోసమేగా మీ తాపత్రయం." .. మాలిని బాధగా అంది.

"ఏమిటీ .. ఏమిటంటున్నావ్ ... నువ్వు తప్పు చెయ్యలేదూ .. నా కడుపులో చిచ్చు రగిల్చావ్. నన్ను బ్రతికుండి చచ్చినవాడిలా చేశావ్ .. ఏం చేయలేదూ, దౌర్భాగ్యురాలా .. నిన్ననవలసిన పని లేదు. వీడివల్ల నువ్విలా మారిపోయావ్. ఈ స్కౌండ్రల్ చేశాడిదంతా అసలు" విశ్వం కోపం అంతా వాణీనాథ్ వైపు మళ్లింది. "పోరా .. పెద్ద ఇంటిపిల్లని వలవేసి నా పిల్లని వశం చేసుకుని దొంగ".

"నాన్నగారూ .." మాలిని ఆవేదనంగా అరిచింది.

"నన్నేం అన్నా సహించాను. అయినా ఒక్క మాట కూడా అనే అధికారం మీకేం లేదు. వీళ్ల దీవెనలు మనకెందుకు పోదాం పదండి. ఆశీర్వాదాలు కాదు, వీళ్ళు మన నెత్తిన నిప్పులు పోస్తున్నారు పదండి పోదాం". మాలిని తండ్రికి సమాధానం చెప్పి గిరుక్కున ప్రక్కకి తిరిగి భర్తనుద్దేశించి అంది. ఆమె ముఖం కోపంతో ఎర్రగా అయింది. రోషం, అభిమానం, నేనంటే నేనని పోటీ పడ్డాయి ఆ ముఖంలో.

"తప్పువిూలా అలా పెద్దవారిని ఎదిరించకూడదు. ఆశీస్సుకోసం వచ్చాం మనం. మీ అమ్మగార్కి నమస్కరించి వెళ్దాం" వాణీనాథ్ ఆమె చెయ్యి పట్టుకొని అప్పు చేసి అన్నాడు నచ్చచెప్తున్న ధోరణిలో.

"నీల్లేదు .. ఇక్కడ ఎవరూ మీ దణ్ణాలకోసం పడి చావటం లేదు. ఫోండి ముందిక్కడ్నుంచి" విశ్వం ఎగిరిపడ్డాడు. "యమునా .. లోపలకెళ్ళు. దాన్ని దీవించటానికి వీల్లేదు". పసుపు బట్టలతో మహాలక్ష్మిలా తన ముందు వంగిన కూతుర్ని గుండెలకి హత్తుకోబోతున్న యమున చేతులు కిందికి వాలిపోయాయి. భర్త ఆజ్ఞని మీరే సాహసం ఆమెకి లేదు. యమున కళ్లల్లో నీళ్ళు చిప్పిల పొంగి, గుండెల్లో మండుతున్న దావానలాన్ని చల్లార్చే ప్రయత్నంలో సఫలంలో ఇంకి పోతున్నాయి. కన్న మమత భర్త ఆజ్ఞతో కడుపుకోతగా మారి ఆమెను చిత్రవధ చేయసాగింది.

"ఈ దౌర్భాగ్యుల్ని ముందు పొమ్మను యమునా." విశ్వం గొంతులో ఆవేదన కరిగి కన్నీళ్లరూపం దిద్దుకొంటోంది. యమున గుండెలు బ్రద్దలయ్యాయి. "కని, పెంచిన కూతురు పెళ్లి చేసుకువస్తే తల్లి ఇచ్చే దీవెనా అది??" .. ఆమె చప్పున పారిపోయింది అక్కడినుంచి. మరో క్షణంలో విశ్వం వాళ్ళ ముఖం మీద తలుపులు మూశాడు.

అంతమంది పిల్లలున్నా ఏ ఒక్కరితోనూ మాలినిని చూసుకు ఉపశమనం పొందలేక పోయాడు విశ్వం. ఆ పిల్ల వయసుకు మించిన చురుకుతనంతో తెలివితేటలతో తండ్రి మనసుకు దగ్గరై పెరుగుతున్న కొద్దీ తండ్రి మనసులో మమత ఎక్కువగా పెంచింది. చిన్నప్పటి నుంచి ఆ పిల్లకి తనపట్లగల ప్రేమకి పొంగిపోయేవాడు విశ్వం. తను ఆఫీసు నుంచి ఇంటికిరాగానే, "తల్లి మాట" అని పిలిచేవాడు. తండ్రి వచ్చేవరకూ అన్నం తినకుండా కూర్చునేది. ఒకసారి ఆఫీస్లో పని వత్తిడివల్ల రాత్రి రెండింటికి వచ్చేవాడు విశ్వం. ఇంటికి రాగానే తనకోసం అన్నం తినకుండా పడుకొన్న

చిన్నకూతుర్ని లేపి ఆ పిల్లనోటికి స్వయంగా ముద్దలు తినిపించేవాడు. "అంత ప్రాణంలా పెంచిన మాలీ ఎంతపని చేసింది!" రాత్రీ పగలూ అదే ఆలోచన అతనికి.

"అవును లేవోయ్ . . తండ్రి ఎలాగూ పెళ్లి చేయలేడుకదా అని ఎవడినో ఒకడిని పెళ్లి చేసుకొంది. ఆ పిల్ల తప్పేం లేదు ." గుసగుసలాడుకొంటోన్న తోటి క్లార్కులు విశ్వాన్ని చూసి సర్దుకు కూర్చుంటారు. గాలానికి గుచ్చిన చేప పిల్లలా గిలగిలలాడేది విశ్వం మనసు.

రోజూ సాయంత్రం ఆఫీస్ నుంచి రాగానే పిల్లల్ని దగ్గర కూర్చోబెట్టు కొనే విశ్వం ఇప్పుడు వాళ్లని తప్పించుకు తిరుగుతున్నాడు. అతను కటిక చీకట్లో కళ్లమీద చేతులుంచుకొని కుర్చీలో వెనక్కి వాలి కూర్చుంటాడు. ఒకోసారి అలా ఆలోచిస్తూ తెల్లవారేదాకా అక్కడే కూర్చుంటాడు.

"ఏమిటి యమునా వాళ్లందరూ ఎందుకు నన్నుచూసి అలా చెవులు కొరుక్కొంటున్నారు. . . ఎందుకు యమునా వాళ్లు నన్ను చూసి నవ్వుతున్నారు" అతని పిరికి మనసు చీకట్లో బూచిని చూసిన చిన్న పిల్లాడి మాదిరి అయిపోతుంది. సంఘం వెయ్యి నోళ్లతో తనని అపహాస్యం చేస్తున్నట్లు అన్పించి అర్ధరాత్రి చటుక్కున లేచి కూర్చుని యమున భుజాలు కుదిపి అడుగుతాడు. అతని కళ్లనుంచి కన్నీరు వేడిగా రాల్తుంటే యమున గుండెలు పగిలేవి. మానసికంగా తగిలిన ఆ దెబ్బ నుంచి అతను తేరుకోలేక పోయాడు. "మనసుకి నచ్చినవాడిని పెళ్లి చేసుకొంది నా కూతురు. అది తప్పేంకాదు." అంటూ మనసులో సమర్థించుకోబోయిన అతను సమాజ వ్యవస్థకి భిన్నంగా మాట్లాడలేని అసహాయత నిలువునా క్రుంగదీస్తుంటే ఆరడుగుల మనిషి అతను మూడడుగులు భూమిలోకి కుంచించుకు పోయేవాడు. విశ్వం బజారుకి వెళ్లడం కూడా పూర్తిగా మానేశాడు. అవసరమైన సరుకులు అన్నీ చిన్న కొడుకు హరికృష్ణే చూస్తున్నాడు. సరిగా అలాంటి సమయంలోనే విశ్వం చేజేతులా పెద్ద కొడుకు వంశీని దూరం చేసుకొన్నాడు. ఓ ధనవంతుడు సన్నిన వలలో చిత్రంగా తగుల్కొన్న విశ్వం వంశీని ఇల్లరికపుటల్లుడిని చేశాడు. అంత వంకూ తీయని కబుర్లు చెప్పి "మా పిల్లే మీ ఇంటికి వస్తుందని" అన్న ఆ ధన వంతుడు పెళ్లయిన తర్వాత వంశీని డబ్బుకి బానిసనిచేసి విశ్వం కుటుంబం నుంచి విడదీసాడు. అప్పటినుంచీ వంశీ ఆ ఇంటితో బంధాలు తెంచేసుకొన్నాడు.

* * *

"నాన్నగారూ!"

విశ్వం వులికిపడి చూసాడు. "నేను పి. యు్య. సీ. ఫస్టుక్లాస్‌లో పాసయ్యాను" తన ముందు వంగి దణ్ణం పెడ్తూన్న హరిని అస్పష్టంగా దీవించాడు విశ్వం. "చాలా సంతోషం బాబూ". విశ్వం చాలాకాలానికి మొదటిసారిగా నవ్వాడు. అతని కళ్లల్లో ఆ చిరునవ్వు తుఫాను తర్వాత వచ్చిన లేత ఎండలా మెరిసింది.

"నేను . . . నేను మెడిసిన్ చదువాలని . . ." నసిగాడు హరికృష్ణ.

"హరీ." విశ్వం దిగ్భ్రమగా చూసాడు కొడుకువైపు.

"అవును నాన్నగారూ."

"ఎలా చదువుతావు హరీ . . . మన సంసార పరిస్థితులు . . ." విశ్వం దూరానికి చూస్తూ అన్నాడు.

"మన పరిస్థితులు ఎప్పుడూ వుండేవే లెండి." హరి కొంచెం విసుగ్గా అని కళ్లు కిందికి వాల్చుకొని ముందున్న కుర్చీమీద వేలితో రాస్తూ చెప్పాడు. "బి. య్యే.స్సీ చదివినా ఏం పెద్ద ఉద్యోగం వస్తుంది . . డాక్టరయితే మంచి ప్రాస్పెక్ట్స్ వుంటాయి. అవకాశం వుంటే హాయిగా ఫారిన్ వెళ్లచ్చు. హరి కల ఏదో కళ్లముందు సృష్టించు కొంటూ అన్నాడు. కొడుకు కలలువింటూ గుండెల్లో గాలంవేసి మెలి తిప్పినట్లయింది విశ్వానికి. "ఇది నిజానికి తన కల కానీ . . కానీ . . .". "ఈ పరిస్థితుల్లో ఎట్లా హరీ! నీ ఆశలు నాకు కాదా బాబూ! మెడిసిన్ అంటే మాటలా!" . . .

"ఆ అర ఎకరం అమ్మితే . . ." నెమ్మదిగా మనసులో మాట చెప్పాడు హరి.

"హరీ"! విశ్వం ఒక్క నిమిషం షాక్ తిన్నాడు.

మరుక్షణంలో అతను గొంతులో నిశ్చయంతో చెప్పాడు:

"వీలుకాదు హరీ. దానిమీద నువ్వేం అలాంటి ఆశలు పెట్టుకోకు. ఆ పొలం మీ అమ్మమ్మ మీ అమ్మకి ఇచ్చినది. దాని సాయంతోనే ఈనాడు మనం కాస్త అన్నం తిన గలుగుతున్నాం తెల్సా. అదీ కాస్తా అమ్మి నీకు పెట్టి మేం అందరం ముష్టెత్తుకోమా చెప్పు. ప్రాణంలా పెంచితే ఆ చిన్నది అలా వెలగబెట్టింది. పెద్ద కొడుకు ఇల్లరికం వెళ్లి బంగారు పంజరంలో బతుకు తున్నాడు. వాడికి



దగ్గరగా వెళ్లే సాహసం మనకీ, మన్ని ఆదుకొనే ధైర్యం వాడికీ లేవు. చదివితే బి.యస్సీ చదువు. ఇక్కడ ప్రిన్సిపల్ మనకి బాగా తెల్సు. ఆయన స్కాలర్‌షిప్ ఇప్పిస్తారు. లేకపోతే సాయంత్రం సత్య నారాయణగారి దగ్గరి కెళ్లి ఉద్యోగ ప్రయత్నం చేస్తాను . . .''.

హరికృష్ణ రెండు నిమిషాలు తదేకంగా రెప్ప వేయకుండా తండ్రి ముఖం వైపు చూసాడు. విశ్వం కళ్లల్లో ఒక లాంటి నిశ్చలత్వం. . . తను చేయదల్చు కొన్న దాన్ని తేల్చి చెప్పేస్తున్నట్లు వుంది అతని ధోరణి. అతన్ని చూస్తుంటే ఆ అభిప్రాయం నుంచి మార్చటం సాధ్యమయ్యేలా లేదు. అందుకే అలా ఉదయం నుంచి ఇంట్లో అందరి మీదా ఎగిరి పోతున్నాడు హరి. అప్పుడే విశ్వం కలగ జేసుకోటం జరిగింది.

* *

''ఏమండీ . . . భోజనం చేద్దురుగాని లేవండి!'' యమున భుజం కుదిపి లేపింది అతన్ని. విశ్వం చప్పున కళ్లు తెరచి ఆమె వైపు రెప్పవేయకుండా చూశాడు. అతని పిచ్చి చూపులకి యమున హడలిపోయింది.

''ఏమిటలా చూస్తారూ . . . భోజనానికి రండి!''

''వద్దు యమునా . . . నాకేం వద్దు.

# చేజారని స్వర్గం

నన్నిలాగే వుండనీ . . .'' కళ్ల చివర్ల మెరుస్తున్న నీటిని దాచే ప్రయత్నంలో అతను కళ్లమీద చేతులు అడ్డంగా వేసుకొన్నాడు. అతనిలో చెలరేగే సంక్షోభం యమునకి తెలుసు. కానీ ఆ సమయంలో తను ఢీలా పడితే విశ్వం మరీ పసివాడవుతాడు. అందుకే సాధ్యమైనంత గంభీరంగా అంది యమున,

''వూరికే బాధపడ్తూ కూర్చుంటే సమస్యలు తీరిపోతాయా చెప్పండి. హరి గురించేగా . . . . నాలుగు రోజులు ఏడ్చి వాడే వూరుకొంటాడు.'' ఆఖరి మాట లంటున్నప్పుడు హరికృష్ణ ఏడుపుముఖం కళ్లముందు కదిలి యమున గొంతు రుద్ధమయింది.

''అదికాదు యమునా, హరి చూశావా ఎంత మాట అన్నాడో! . . . . అది వాడి తప్పుకాదు. ఆ బాధ వాడిచేత అట్లా అన్పించింది.'' 'పరీక్ష పాసయ్యా నాన్న గారూ!' అని వాడు వస్తే చెంపకాయ ఇచ్చి పంపాను. వాడు ఖాళీ కడుపుతో వెళ్లాడు. నా కెందుకు యమునా ఇంఢి.''

ఇన్నేళ్ల తర్వాత మొదటిసారిగా విశ్వానికి ఇంతమంది పిల్లలుండటం తప్పేనేమో! అన్పించ సాగింది. ''ఇద్దరూ లేక ముగ్గురు పిల్లలు చాలు''. ''పరిమిత కుటుంబం సుఖ సంతోషాలకు మూలం!'' లాంటి నినాదాలు గబగబా అతని కళ్ల ముందు వేగంగా సినిమా రీలులా కదిలాయి.

''నిజం చెప్పు యమునా? . . . వీళ్లని కని వీళ్లకి అన్యాయం చేశామా మనం. పిల్లల భవిష్యత్తుకోసం నేనెన్ని కలలు కన్నానో నీకు తెలీదూ!'' అతను సూటిగా ఆమె ముఖం చూస్తూ అప్పుడే స్ఫురించిన వాడిలా అడిగాడు. ''నేను కన్న పిల్లలే నన్ను అసహ్యించుకొంటున్నారు . . . నిజం చెప్పు యమునా. నువ్వు కూడా నన్ను అసహ్యించు కొన్నావా? . . . మన పాతికేళ్ల సంసార జీవితంలో నేనంటే అసహ్యం వేసిన సంఘటనలే ఎక్కువగా వున్నాయా? ... చెప్పు యమునా.''

అతను ఒకలాగా దీనంగా అడుగుతుంటే, యమునకి ఏడుపు ముంచు కొచ్చింది. ''ఏమిటండీ, ఆ మాటలు. మీకు దణ్ణం పెడ్తాను . . . అలాంటి మాటలు మాట్లాడకండి'', యమున చప్పున అతని కాళ్ల దగ్గర కూలబడిపోయి విశ్వం మోకాళ్ల మీద తలపుంచుకొని చేతులు అతని పాదాల మీద వేసి వెక్కి వెక్కి ఏడ్చింది. విశ్వం ఆర్ద్రమైన హృదయంతో ఆమె తల నిమిరాడు. వదులుగా ముఖంమీద కంటా పడ్తున్న ఆమె జుట్టుని సరి చేస్తూ చెప్పాడు. ''బాధపడకు యమునా!... నాకేం కాలేదు. నువ్వు నన్ను అసహ్యించుకో లేదు. నాకు తెల్సు. నువ్వట్లా చెసుంటే నేనీమాత్రంగా కాక నామరూపాలు లేకుండా పోయేవాడిని. నీ కంటి తడి చూడకుండా చచ్చిపోదామనుకొన్నా! . . . నాకు ఆ అదృష్టము లేదు యమునా! పోనీ మన పిల్లలంతా సుఖంగా వుండటమే కావాల్సింది. ఆ అర ఎకరం అమ్మేద్దాం. హరిని డాక్టర్నే కానీ. వాడి ముచ్చట తీరనీ యమునా! నేను ప్రైవేట్లు కుదుర్చుకొంటాను. మన పిల్లల్ని, నా కంఠంలో పూపిరుండగా బాధపడ నీయను. సరేనా . . . యమునా నువ్వు హరిబాబుతో చెప్పు. వాడిని బాధ పడద్దని, వాడిష్టప్రకారమే మెడిసిన్ చదివిస్తానని చెప్పు!'' . . . అతను మృదువుగా, లాలనగా, హృదయ నివేదనంగా చెప్పాడు భార్యతో.

* * *



"పోస్టు సార్!" ....

కవరు చించి లోపలి కాగితం చూసిన విశ్వం కంగారుగా అరిచాడు. "యమునా ... హరి ... హరి ఉత్తరం ... ఇదేమిటో చూడు ...". రెండు రోజులుగా ఇంటికిరాని చిన్నకొడుకు కోసం ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నారు ఆ దంపతులు. యమున ఉత్తరం తీసుకొని చదవ సాగింది. విశ్వం ప్రాణాలుగ్గబెట్టుకొని వింటున్నాడు.

నాన్నగార్కి నమస్కారాలు,

మొన్నటి నా మాటలకి మీరు చాలా బాధ పడ్డారు. మీ బాధ ఆపుకోలేక నా చెంప పగల కొట్టారు. నాకేం బాధ లేదు. కాని ఒక్కసారి ఆ మాటల్లో నిజం ఆలోచించండి నాన్నా! ... మనిషికి ఆశలు వుంటాయి, ఆశయాలు వుంటాయి. ఆశలేని జీవితం ఉండదు. మేం మిమ్మల్ని మడులా, మాన్యాలా అడగలేదు నాన్నా!.. చదువుకొంటాం అన్నాం. మీరు అందుకు అశక్తులు. అయినా మీ మీద నాకు సానుభూతి లేదు నాన్నా! ... ఇదంతా మీ స్వయంకృతం! కాదనగలరా? అవకాశాలున్నంతవరకూ జీవితాన్ని మనంత మనం మలచుకొనే ప్రయత్నంలో మనిషి సఫలీకృతుడు కావాలి. దేవుడు మనిషికి మనసిచ్చాడు, ఆలోచనా శక్తి ఇచ్చాడు. జీవితాన్ని దిద్దుకోటానికి వివేకం ఇచ్చాడు. పూర్వం ముత్తాతల కాలంలో పిల్లలు దేవుడిచ్చిన వరాలనుకొనేవారు. కాలం మారింది. కాలంతో మారిపోయిన మనిషి అభిప్రాయాలు తదనుగుణంగా మార్చుకొన్నాడు. ఇదివరకు కుచేలుడిలా ఇప్పుడు ఎవ్వరూ అధికమైన సంతానంతో బాధపడే అవసరం లేదు. పచ్చి మాంసం తిని గుహల్లో నివసించే ఆటవిక దశనుండి అతి నాగరిక జీవితాన్ని కరతలామలకం చేసుకొన్న మానవుడు ... చంద్రమండలాన్ని స్పృశించ గలిగిన నేటి మానవుడు ... అలాంటి శతాబ్దంలో బ్రతుకుతున్న మనం అంత రిక్తం కాదుకదా ... కనీసం ఆహార సమస్యని పరిష్కరించుకోలేక పోతున్నాం. కారణం ఏమిటి? ... అధిక జనాభా!... సెకనుకి వేలకొలది పుట్టుకొచ్చే జనాభా ఫలితమే ఇదంతా. నేనొకమాట చెప్పేదా!... నాన్నా... "పిల్లల్ని కన్నాంగాని వాళ్ళ అదృష్టాల్ని కన్నామా" అనే పాతకాలం మాటి, ... ఇద్దరు లేక ముగ్గురు పిల్లలతో సంసారాన్ని పరిమితం చేసుకొని సుఖ సంతోషాలతో బ్రతక గలిగే వ్యక్తులు ఎంత అదృష్టవంతులో ...! .... వాళ్ళకి జీవితంలో చిక్కు సమస్యలు వుండవు. ఎందుకంటే అలాంటి సమస్యలని సవ్యంగా పరిష్కరించు కొంటారు గనుక. అలాంటి ఇంట పెరిగిన పిల్లలు నిత్య సంతోష మనస్కులై వుంటారు. చాలా మంది పిల్లలున్న ఇంట ఏ తల్లీ, తండ్రీ ఏ పిల్లనీ సరిగ్గా ఆదరించలేరు. ఒక పిల్లకోసం మరోపిల్ల జీవితం, ఒక బిడ్డ కోసం ఇంకో బిడ్డ భవిష్యత్తు వెనుకబడి పోతుంది. అలాంటి వాతావరణంలో పెరిగిన పిల్లలు దృఢ మనస్కులు కాలేరు. వాళ్ళకి ఆత్మవిశ్వాసం వుండదు. ఒకరిపై ఒకరికి ఈర్ష్య, అసూయ ఎదిగే వయసుతోపాటు అసంతృప్తి, చికాకు పెరుగుతాయి. అలాంటి పిల్లలు దేశానికి అవసరమా? ... దేశమంటే మట్టికాదు, మనుష్యులు. దృఢమైన శరీరంతో దేశభక్తిని ఉగ్గుపాలతో రంగరించుకున్న

పిల్లలు కావాలి మన దేశానికి. అంతేకాని, ఎందుకూ పనికిరాని అధిక జనాభా కాదు. ప్రజాస్వామ్యం జనానికే పరిమితం కాదు దేశానికి. మోయలేని కుటుంబ భారం అడుగడుగునా మిమ్మల్ని క్రుంగదీస్తుంటే మీరెంతగా బాధపడుతున్నారో నాకు తెల్సు. మా ఆశలు తీర్చలేక, పిల్లల భవిష్యత్తును సుందరంగా తీర్చి ద్దిద్దలేక పోయానని మీరు అనుభవించే వేదనా నాకు తెల్సు. అయినా మీ మీద నాకు సానుభూతి లేదు నాన్నా! . . . . ఒక్కసారి "నేను నా పిల్లలకి ఏం చేసాను. వీళ్లని ఈ లోకంలోకి తీసుకు వచ్చి వీళ్లకి ఏం ఇవ్వగలిగాను?" అని ప్రశ్నించుకోండి. సమాధానం మీకే దొరుకుతుంది. నా మాటలకి బాధపడకండి నాన్నా. నేను మిలటరీలో చేరాను. అక్కడే వుండి అడుగడుగునా నా తీరని ఆశ నన్నుక్షణం వెక్కిరిస్తుంటే నేను భరించలేను. అమ్మకి నా నమస్కారాలు. పిల్లలకు నా దీవెనలు. నా సాహసాన్ని మన్నిస్తారు కదూ. నా కెప్పుడైనా రావాలన్పిస్తే పిలుంటే వస్తాను.

"హరికృష్ణ".

ఉత్తరం చదవటం పూర్తిచేసిన యమున తలెత్తి జీవచ్ఛవంలా శూన్యంలోకి చూస్తోన్న భర్తని కన్నీటితో చూసింది.

* * *

# చేజారని స్వర్గం

కథ చదవటం పూర్తిచేసిన వేణు దాని పేరు చూసాడు. "స్వయంకృతం" దానిపేరు. అతను కాగితాలు మడిచి కవరు లోకి తోసి కవరు మీద పత్రిక ఎడ్రస్ వ్రాసి స్టాంపులు అంటించి డ్రాయర్ సొరుగులో దాచి వచ్చాడు. అతను మంచం మీద దిండు మోచేతికింద వేసుకొని వెనక్కి వాలి కూర్చున్నాడు. అరుణ వ్రాసిన ఆ కథలోని పాత్రలు జీవం పోసుకొని పదేపదే కళ్లముందు కదలసాగాయి.

మూఢనమ్మకాలతో బంగారంలాంటి జీవితాన్ని చేజేతులా నాశనం చేసుకొన్న విశ్వం.. చివరికి పిల్లలచేతే నీతులు చెప్పించుకొని వాళ్ల సానుభూతిని కూడా! కోల్పోయిన విశ్వం దైన్యవదనం అతని మనసులో తడిగా కదిలింది. వేణు ఒక్కసారిగా వులికి పడ్డాడు. అరుణ ఈ కథ ఎందుకు రాసినట్టు. ఇది తన్ని ఉద్దేశించి కాదుకదా... ఏమో అయివుండచ్చు. అతనికి వారం క్రితం సంఘటన చప్పున మనసులో కదిలింది. అతనికి ఇద్దరు సంతానం. ఏడేళ్ల విద్యాసాగర్, మూడేళ్ల హిమబిందు ముత్యాల్లా వుంటారు. అరుణకి ఆరవనెల. "ఈ సారితో ఇంకచాలు" అంది. "ఇప్పుడు మనకేంలోటు అంత అవసరం ఏమిటి? వద్దులే . . . ." అన్నాడు తను. అరుణ కొంచెంసేపు వాదించి తనతో నెగ్గలేక రాజీకొచ్చింది. దాని ఫలితం ఈ కథన్నమాట. వేణు పెదవుల మీద చిరునవ్వు మెరిసింది. ఆలోచిస్తే అరుణ చెప్పిందే నిజం. నాకీ ముగ్గురు చాలు. ఎక్కువయిన పిల్లలతో సంసారం ఈదటం అంత సులభ సాధ్యం కాదు.

తను కాంప్ నుంచి వచ్చేసరికి అరుణ, పిల్లలిద్దరూ తనకోసం ఎదురుచూస్తూ వుంటారు. తను ఇంటి కొచ్చిందగ్గరనుంచీ తన బూట్ విప్పడం దగ్గర్నుంచీ, తను బయటి కెళ్లేప్పుడు టైనాట్ వేయటం వరకూ అన్నిపనులూ అరుణ సంతోషంగా చేస్తుంది. అలా తన పనులన్నీ చేసేప్పుడు ఆమె ముఖంలో ఒకలా మెరిసే తృప్తి, ఆనందం . . . . తనని చూడగానే పిల్లల ముఖాల్లో సంబరం, తన మనసులో వెలుగు వెల్లువలు నింపి, తిరిగి, తిరిగి అలసి వచ్చిన తన హృదయంలో పన్నీటి జల్లులు కురిపిస్తాయి వాళ్ల చిరునవ్వులు. పిల్లలెక్కువయితే ఇప్పటిలా తనకి సపర్యలు చేయగలదా అరుణ. ప్రశాంతంగా వుండాల్సిన ఇల్లు ఎక్కడ చూసినా పిల్లల మల మూత్రాలతో, అల్లరితో, అసహ్యంగా . . "బాబోయ్.... వద్దు". వేణుకి భయం వేసింది, అలాంటి దృశ్యాలు వూహించుకొంటుంటే. ఇంతా పెంచితే చివరికి ఎవరికి వాళ్లు అడుగుతారు, "నాకేం ఇచ్చావ్?" అని. అప్పుడు ఆ తండ్రిబాధ... తనకి అనుభూతం కాకూడదు. స్వర్గంలాంటి ఇల్లుని విశ్వంలా నరకంగా చేజేతులా మార్చుకోడు తను. అతని పిల్లల్లా తన పిల్లలు తనని "మమ్మల్నెందుకు కన్నావ్?" అని అడిగే స్థితి తెచ్చుకోడు. ఇది స్వర్గం . . . . ఇంకా తన అరచేతిలో స్వర్గం ఈ సంసారం. ఇది చేజారకూడదు. జారీయను.". మనసులో తృప్తిగా అనుకొన్నాడు వేణు. అరుణ చాల తెలివైంది. మాటలతో నెగ్గలేకపోయినా ఈ రచనతో తన మనసుని బుట్టలో వేసింది. ఇది చేజారని స్వర్గం. . . . . నిజం. వేణు తృప్తిగా నిట్టూర్చాడు. ఈ స్వర్గాన్ని కాపాడుకోవాల్సిన బాధ్యత తన మీద ఎంతయినా వుంది. ●





'అంతా మన మంచికే'లో భానుమతి, ఛాయాదేవి

# సినిమా

## గుమ్మడి కుమార్తెల పెండ్లి!

క్యారెక్టరు నటుడు గుమ్మడి తమ కుమార్తెల పెండ్లిని అత్యంత వైభవంగా కన్నుల పండువగా జరిపించారు. మార్చి 1, 2 తేదుల్లో సినిమా ప్రపంచమంతా రాజేశ్వరి కళ్యాణమండపానికి తరలివచ్చిందా అనిపించింది.

మార్చి 1 వ సాయంత్రం ఆరు గంటలకు నేనూ వెళ్లాను అప్పటికే రాజేశ్వరీ కళ్యాణమండపం దేదీప్యమానంగా, విద్యుద్దీపాల వెలుతురుతో దేవేంద్రుని సభా మండపమా అనిపించింది. గ్లామర్ వరల్డ్ అంతా అక్కడే కనిపించింది వెండితెర అతిరథ మహారథులందరూ విచ్చేసారు.

గుమ్మడి మూడవ కుమార్తె సౌ. ఉదయశ్రీకి, కొమ్మినేని కోదండరామయ్య కుమారుడు చి. భూపాల్‌కి, గుమ్మడి నాల్గవ కుమార్తె సౌ. శారదకి, గోగులపాటి రాధాకృష్ణమూర్తి కుమారుడు చి గంగాధరరావుకి వేదమంత్రముల నడుమ, పెద్దల సమక్షాన మంగళ వాయిద్యాల మేళవింపుతో, శుభ ముహూర్తాన వివాహాలు వైభవంగా జరిగాయి.

వివాహ శుభ సమయాన, అతిధులకు షడ్రసోపేతమైన విందు మరియు కనులకు విందు కలిగించే, చెవులకు యింపు కలిగించే నృత్య, సంగీత, బుర్రకథ కచ్చేరీలు ఏర్పాటు చెయ్యబడ్డాయి. ఇటీవల నేను ఎన్నో సినిమా పెండ్లిండ్లకు వెళ్లాను. కానీ గుమ్మడి కుమార్తెల వివాహానికి వచ్చినంతమందిని నేను మరెక్కడా చూడలేదు. వచ్చిన వాళ్లందరినీ గుమ్మడి దంపతులు సాదరంగా ఆహ్వానించారు.

## ప్రత్యగాత్మ కథలో చంద్రకళ నాయిక!

'భార్యా భర్తలు, కులగోత్రాలు, పునర్జన్మ' చిత్రాలను పరిశీలించిన వాళ్ళకు తెలుసు; ప్రత్యగాత్మ దర్శకత్వంలోని ప్రత్యేకత. తెలుగు చిత్రరంగంలో ప్రత్యే




ప్రముఖనటుడు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు గారి మూడవ, నాల్గవ కుమార్తెల వివాహాల సందర్భంలో తీసిన చిత్రం: వధువు: చి. సౌ. ఉదయశ్రీ, వరుడు: చి. డాక్టర్ భూపాల్, వరుడు: చి. డాక్టర్ గంగాధరరావు, వధువు: చి. సౌ. శారద.



విజయలక్ష్మీ మూవీస్‌వారి 'అమ్మమాట' చిత్రం విడుదల సందర్భంగా 25—2—72 న విజయవాడలోని నటరాజ హోటల్‌లో జరిగిన సమావేశంలో ప్రసంగిస్తున్న శ్రీ కాకుగడ్డ వరవయ్య. నిర్మాత జి. వి. ఎస్. రాజు, రచయిత భమిడిపాటి, సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు లను కూడా చిత్రంలో చూడవచ్చు.

స్థానాన్ని సంపాదించిన ప్రత్యగాత్మకి హిందీ రంగం ఘనస్వాగతం పలికింది. ఇటీవల విడుదలయిన 'ఏక్ నారీ ఏక్ బ్రహ్మచారి' కూడా వందరోజులు ప్రదర్శింపబడింది. ఇప్పుడు కె. పి. ఆత్మాకి విపరీతమైన డిమాండు, అక్కడ, యిక్కడ కూడా.

శ్రీ పూర్ణా మూవీస్‌కి ప్రత్యగాత్మ తను వ్రాసిన కథను యిచ్చారు. స్క్రీన్ ప్లేని కూడా ఆయనే తయారు చేసారు. ఈ చిత్రంలో చంద్రకళ నాయిక.

## చంద్రకళ ద్విపాత్రాభినయం !

'డబ్బే ప్రధానం అని ఎంచి, నాగరికతపు

## సినిమా

అలవాట్లకు అధినేత కావాలనుకున్న స్త్రీకి, డబ్బుకన్నా మాన, మర్యాదలే ముఖ్యం అని నమ్మిన మరొక స్త్రీకి జరిగే మానసిక సంఘర్షణే యీ చిత్ర కథ. రెండు విభిన్న మనస్తత్వాలు కలిగిన యీ స్త్రీలు తల్లీ కూతుళ్లు. మానవత్వపు విలువల కోసం తన కన్న కూతురినే పరిత్యజించిన ఒక స్త్రీ మూర్తి కన్నీటి గాథయే యీ చిత్రం. తల్లిగా, కుమార్తెగా చంద్రకళ (ద్విపాత్రాభినయం) నటించే యీ సంచలనాత్మక చిత్రంలో కథానాయక పాత్రలను కొత్త నటులు పోషించడం ఒక విశేషం.

ఈ పై చిత్రానికి ప్రత్యగాత్మ దర్శకత్వాన్ని, మహదేవన్ సంగీతాన్ని నిర్వహిస్తారు. ఏ. పూర్ణచంద్రరావు, చంద్రశేఖర్ నిర్మించే యీ చిత్రానికి శ్రీకిరణ్ పంపిణీదారులు.

## సుభాషిణిలో జమున !

'ఆడపడుచు' చిత్రం యిప్పటికీ, ఎప్పటికీ మరువలేని విధంగా దర్శకుడు హేమాంబరధరరావు ఆ కథను మలిచారు. ఆయన క్రియేటివ్ జీనియస్ 'కథానాయకుడు' చిత్రంలో బాగా కనిపిస్తుంది. ఇకపై సంవత్సరానికి రెండు చిత్రాలను నిర్మించడానికి నిశ్చయించారు, హేమాంబరధరరావు.

'కథానాయకుడు' రిలీజ్ అయినప్పుడు, పెద్ద నిర్మాతలనేకులు హేమాంబరధరరావును డైరెక్షన్ చేసిపెట్టమని అడిగారు. అప్పుడాయనకు ఆరోగ్యం బాగాలేదు. అందువల్ల అంగీకరించలేకపోయారు.

## ఉగాదినాడు రికార్డింగు

తెలుగువాళ్ళకి ఉగాది పండుగ చాల ప్రశస్తమైనది. ఆ పర్వదినాన సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ తమ కొత్త చిత్రం యొక్క తొలి పాటను విజయాగార్డెన్స్ రికార్డింగు థియేటర్లో ప్రారంభించారు. దాశరథి మది అందించిన భావాలకు మధురగాయని సుశీల కంఠం అమృతతుల్యమైన రాగాన్ని ఆలాపించింది. ఈ చిత్రానికి కోదండపాణి సంగీత దర్శకుడు.

మార్చి 24 న ప్రసాద్ స్టుడియోలో షూటింగు ప్రారంభమవుతోంది భమిడిపాటి కథ, మాటలను సమకూర్చిన యీ చిత్రంలో జమున కథానాయిక. ఒక ముఖ్య పాత్రను నాగభూషణం ధరిస్తారు. 'స్త్రీ యొక్క అపున్నత్యాన్ని, త్యాగనిరతిని చాటి చెప్పే ఒక మాతృమూర్తి పుణ్యగాథయే యీ చిత్రానికి ప్రధానాంశం,' అన్నారు హేమాంబరధరరావు. ఈ చిత్రంలోని ముఖ్య భూమికలను చంద్రమోహన్, కృష్ణంరాజు, అల్లు రామలింగయ్య, కృష్ణకుమారి నిర్వహిస్తారు. సాంకేతిక శాఖలను బి. యస్. కృష్ణ, శేఖర్ — సింగ్, మహేంద్ర చేపట్టారు. స్క్రీన్ ప్లే, డైరెక్షన్ను హేమాంబరధరరావు గమనిస్తారు. పూర్ణా విడుదల.

## సినిమా డైరీ

● మమతా ప్రొడక్షన్స్ 'కాలం మారింది' షూటింగు మార్చి 6 నుండి 9 వరకు, ఊటీలో జరిగింది. కె. విశ్వనాథ్ దర్శకుడు.

● అశోక్ మూవీస్ కలర్ చిత్రం షూటింగు, మార్చి 9న విజయాలో ప్రారంభమైంది. మధుసూదనరావు దర్శకుడు.

శ్రీ రమణచిత్ర ఇంటర్నేషనల్ 'దేవుడమ్మ' షూటింగు మార్చి 10న ప్రసాద్‌లో ప్రారంభమైంది. కె. వి. నందనరావు దర్శకుడు. దుక్కిపాటి మధుసూదనరావు స్విచ్ ఆన్ చెయ్యగా, నవయుగా శ్రీనివాసరావు క్లాప్ కొట్టారు.

● సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ తొలిపాట రికార్డింగు మార్చి 16న విజయా గార్డెన్స్‌లో జరుగుతుంది. సుశీల పాడేపాటని దాశరథి వ్రాసారు. కోదండపాణి సంగీతాన్ని సమకూరుస్తారు. కె. హేమాంబధరరావు దర్శకుడు.

● శ్రీ లక్ష్మి ఎంటర్‌ప్రయిజస్ 'సంపూర్ణ రామాయణం' రంగుల చిత్రం మార్చి 16 న లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది. బాపు దర్శకుడు.

● పద్మశ్రీ పిక్చర్స్ రంగుల చిత్రం యొక్క మూడవ షెడ్యూలు మార్చి 1 నుండి 8 వరకు సారధి స్టుడియోలో జరిగింది. పి. పుల్లయ్య దర్శకుడు.

తప్పక చూడండి!

పేరుకి పుణ్యమూర్తి!
పాపాలకి ప్రతిరూపం!
ఈ పరమభక్తుడి నిజస్వరూపం
ఏమిటో? చూడండి!

అనంతమైన హాస్యచక్రం

ఈ చలనచిత్ర ప్రపంచములో
అనేకరింతలు, విశేషాలు ఉంటాయి
ప్రముఖ హాస్యనటులు నాగభూ
షణం, అల్లురామలింగయ్య
రాజబాబు మీకెంతో
ఆనందాన్ని అంద
చేస్తారు.



విజయలక్ష్మీ మూవీస్ వారి

# అమ్మమాట

అమ్మమాటలో అందరూ
చూడతగ్గ విషయాలు!

జైలులో ఉన్న భర్తను కలుసు
కోవటానికి వచ్చి, వాగ్బంధంలో
బంధించబడిన అబల.

నిర్మాత: జి. వియస్. రాజు దర్శకత్వం: వి. రామచంద్రరావు B.A.(HONS)

నవయుగ విడుదల



'మానవుడు—దానవుడు'లో శారద, కృష్ణకుమారి, శోభన్‌బాబు.

సినిమా

## దేవుడమ్మ షూటింగు!

శ్రీరమణచిత్ర ఇంటర్నేషనల్ నిర్మించే 'దేవుడమ్మ' చిత్రంయొక్క షూటింగు మార్చి 10 న ప్రసాద్ స్టుడియోలో ప్రారంభమైంది. రెండు వారాల క్రితం పై చిత్రానికిగాను, జెమినీలో [illegible] పాట రికార్డింగు జరిగింది, [illegible] వ్రాసారు: అదే



'సంపూర్ణ రామాయణం'లో ఒక దృశ్యం.

పాటను కథానాయకుడు చలంపై దర్శకుడు నందనరావు చిత్రీకరించారు. ఈ చిత్రంలో చలం ప్రత్యేకమైన గెటప్‌లో కనిపిస్తారు. ఇంతవరకు యిలాంటి నవ్యత్వం వున్న కథ తెలుగులో రాలేదు. కథను రాజశ్రీ వ్రాసారు. మాటలు కూడా ఆయనే. సంగీతాన్ని సత్యం, ఛాయను మధు, కూర్పును అంకిరెడ్డి నిర్వహిస్తారు. శ్రీఫిలింస్ విడుదల.

## లక్ష్మి—ఆరతి

పై చిత్రంలో నాయిక వేషానికి ఆరతి (న్యూ ఫైండ్)ని, నాయకుడి చెల్లెలి పాత్రకి 'సుపుత్రుడు' లక్ష్మిని, మరొక ముఖ్య భూమికకి రాజసులోచనను నియమించడం జరిగింది. మొదటి షెడ్యూలు మార్చి 10 నుండి 12 వరకు జరిగింది.

## ఊరికి ఉపకారి

చలం—ఆరతి ముఖ్య పాత్రలను పోషిస్తున్న సుందరం మూవీస్ వారి 'వూరికి వుపకారి' మార్చి 31 న ప్రారంభమవుతుంది. ఈ చిత్రంలో గుమ్మడి, అంజలీదేవి అత్యంత ప్రధానమైన పాత్రలను నిర్వహిస్తారు. ఇప్పటికి నాలుగు పాటల రికార్డింగు జరిగింది. మోహన్‌రెడ్డి నిర్మించే యీ చిత్రానికి రాజశ్రీ మాటలను వ్రాసారు. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు.

## రెండవ షెడ్యూలు పూర్తయింది!

మమతా ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'కాలం మారింది' చిత్రంయొక్క రెండవ షెడ్యూలు మార్చి 6 నుండి 9 వరకు వీనస్‌లో జరిగింది. శోభన్‌బాబు, సూర్యకాంతం పాల్గొన్న హిలేరియస్ దృశ్యాలు, శారద — శోభన్ నటించిన శృంగార మట్టాలు కొన్నింటిని దర్శకుడు కె. విశ్వనాథ్ చిత్రీకరించారు.

కవి దాశరథి ఒక యుగళగీతాన్ని వ్రాయగా, రాజేశ్వరరావు సారథ్యంలో ఘంటసాల—సుశీల పాడారు.

'ముందరున్న చిన్నదాని అందమేమో,
చందమామ సిగ్గుచెంది దాగిపోయే,
దాగిపోయే'

అనేడి పాటకి శోభన్ శారదలు [illegible] రీతిగా అభినయించారు. 'కాలం మారింది' 5 రీళ్ళు తయారైంది.

## గాంధీజీకి అంకితం

'కుల మత వర్గ భేదాలు మాసిపోవాలి; అంటరానితనం అనేది పదం మాయమవ్వాలి; నీతి, నిజాయితీ నిలబడాలి' అనేది ధర్మసూత్రాన్ని ప్రబోధించే సంచలనాత్మక చిత్రమే 'కాలం మారింది.' ఈ చిత్రం జాతి పితకి అంకితం చెయ్యబడుతుంది

'కాలం మారింది' చిత్రానికి స్క్రీన్ ప్లే, దర్శకత్వాన్ని కె విశ్వనాథ్, మాటలను బొల్లిముంత, కళను కళాధర్, కూర్పును సత్యం, కెమెరాను అశోక్‌కుమార్, ప్రొడక్షన్ను వత్తిరాజు — గోపాలరావు, సహాయ దర్శకత్వాన్ని గోపాలకృష్ణ నిర్వహిస్తున్నారు. ప్రధాన పాత్రలను ఎస్వీరంగారావు, చంద్రమోహన్, సాక్షి రంగారావు, పొట్టి ప్రసాద్, అంజలీదేవి, గీతాంజలి, అల్లు రామలింగయ్య, రావికొండలరావులు పోషిస్తున్నారు. ఈ చిత్రాన్ని వాశిరాజు ప్రకాశం, బొమ్మిశెట్టి హనుమంతరావులు నిర్మిస్తున్నారు.

## దత్తపుత్రుడు

రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ రంగుల్లో నిర్మిస్తున్న రమణీయ చిత్రమే 'దత్తపుత్రుడు'. గత సంవత్సరం 'దసరా బుల్లోడు'గా కనిపించి, కొత్త ఆశల్ని పెంచిన నాగేశ్వరరావే యీ యేడాది 'దత్తపుత్రుడు'గా అగుపిస్తారు ఇక నాయిక విషయం అంటారా! 'ప్రేమనగర్'లో దీటయిన నటన్ను ప్రదర్శించిన వాణిశ్రీయే.

కవి నారాయణరెడ్డి వ్రాసిన, ఘంటసాల పాడిన—

'మనస్సైన చినదానా .. ఒక మాటుంది వింటావా,
సిగ్గుపడే ఓ చిలకమ్మా కంది చేనుంది పోదామా.'

అంటూ వాణిశ్రీని, నాగేశ్వరరావు పడి కిష్టు, హుషారు గొలుపుతూ నటించిన దృశ్యాన్ని యువ దర్శకుడు లెనిన్‌బాబు హృద్యమంగా చిత్రీకరించారు ఈ చిత్రంలో చలపతిరావు ప్రతిభ మరొకసారి ద్యోతకమవుతుంది మార్చిలో క్లయిమాక్స్ చిత్రీకరణ, ఏప్రిల్‌లో అవుట్‌డోర్ పూర్తయితే, షూటింగు ముగిసినట్టే ఈ చిత్రంలో వాగ్భూషణం, రామకృష్ణ, పద్మనాభం, అల్లు రామలింగయ్య, మిక్కిలినేని, బాలకృష్ణ, జగ్గారావు, వల్లం నరసింహారావు, వెన్నిరాడై నిర్మల, రమాప్రభ, శాంతకుమారి, సూర్యకాంతం ముఖ్య తారాగణం. సాంకేతిక శాఖలను ఎస్. వెంకటరత్నం (ఛాయని), చలపతిరావు (సంగీతం), సంజీవి (కూర్పు), జి. వి. సుబ్బారావు (కళ) నిర్వహిస్తున్నారు. ఇంతకీ దర్శకుడు సంగతేమిటని మీరడుగుతారుగా! ఆయన పేరు లెనిన్‌బాబు. దర్శకులందరికన్నా చిన్నవాడు; కాని గట్టివాడని 'దత్తపుత్రుడు' రషస్ చూపినవాళ్ళని అడిగాను, ఆయన్ని గురించి. పాటల చిత్రీకరణలో లెనిన్‌బాబు మాస్టర్ అని చెప్పారు. చిత్రం విడుదలయితే, దర్శకుడికి మంచి పేరు వస్తుంది అని కూడా చెప్పారు. తమ్మారెడ్డి కృష్ణమూర్తి నిర్మించే 'దత్తపుత్రుడు' లక్ష్మీ కంబైన్స్ ద్వారా దర్శనమిస్తాడు.



చలం సమర్పించు 'దేవుడమ్మ' ప్రారంభోత్సవంలో నాయకుడు చలం, నవయుగ చంద్రశేఖరరావు.



నిర్మాత శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తిగారి రెండవ కుమారుడు చి. భరద్వాజకి కృష్ణాజిల్లా కాటూరు వాస్తవ్యులు శ్రీ సూరెడ్డి ధర్మరాజుగారి కుమార్తె చి. సౌ. వాణీకుమారికి హైదరాబాదులోని షాపూర్ వాడిలో ఫిబ్రవరి 23 వ తేది రాత్రి గం. 8—15 ని.లకి వైభవంగా వివాహం జరిగింది.

# సినిమా

ప్రేమించి పెండ్లాడిన భర్త పన్నె వయస్సులో దూరమయితే, ఆ యువతి మనస్సు అద్దంలా పగిలిపోతుంది. ఆ విరిగిన మనస్సు అతకడం కష్టం. ఎవ్వరూ అతి కించలేరు. కన్నతండ్రి ప్రాధేయపడినా, యింటికి రానంటుంది రాధ. తన వేణు ప్రారంభించిన మహత్తర ఆశయాన్ని, తాను పూర్తిచేసి తీరాలంటుంది అయినా కన్న వారిని చూసినప్పుడు హృదయంలోని ఆవే దనలు కన్నీటి రూపంలో బయల్పడక మానవు. రాధ వదనంమీద విషాదమే గాక, దృఢ సంకల్పం, ఓర్పు కనిపిస్తాయి. ఒక్కగా నొక్క కూతురు బ్రతుకు బండలై పోయిందని విలపించటమే ఆ కన్నతండ్రికి మిగిలింది.

"పేదలపాలిటి పెన్నిధైన డాక్టరు వేణు, నాకు దూరమయినా, నేను ఆ పేద లకు దూరం కాలేను. వేణు ఆశయాలను నేను నెరవేరుస్తాను" అని ప్రతిజ్ఞపట్టింది రాధ. హృదయాన్ని కదలించే యీ సన్ని వేశం 'మానవుడు—దానవుడు'లో కనిపి స్తుంది. ఇలాంటి ఎన్నివేశాలు ఎరెన్నో వున్న ఒక్కటి కుటుంబ చిత్రమే 'మానవుడు—దానవుడు'. ఉషశ్రీ వ్రాసిన కథకి, మోదు కూరి జాన్సన్ మాటలు వ్రాశారు. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. ఈ చిత్రంలో వేణుగా, జగన్‌గా శోభన్ నటిస్తున్నారు. వేణు అర్ధాంగిగా శారద, శారద తండ్రిగా సత్యనారాయణ, వేణు అక్కయ్యగా కృష్ణ కుమారి కనిపిస్తారు. హాస్యానికి రాజబాబు ఉండనే ఉన్నాడు.

## ఆత్మ విశ్వాసం !

"ఇది నాకు మూడవ విజయం" అన్నాడు ధీమాగా నిర్మాత చిన్నపరెడ్డి. చిత్రం రిలీజు గాకుండానే ఆ మాత్రం ఆత్మ విశ్వాసం వుంది ఆయనకి. ఈ చిత్రానికి సుకదేవ్ ఛాయను, అంకిరెడ్డి కూర్పును, అశ్వత్థామ సంగీతాన్ని, సూరన్న కళను నిర్వహిస్తున్నారు. త్వరలో అనిల్ ప్రభాస్ ద్వారా నవయుగ విడుదల చేస్తారు 'మానవుడు—దానవుడు' చిత్రాన్ని.

## ఉగాదికి సంపూర్ణ రామాయణం !

తెలుగు సంవత్సరాది మనందరికీ పర్వ దినం. అలాంటి మంచి రోజుల్లో రామా యణ, భాగవతంలాంటి ఉత్తమ గ్రంథ పఠనం చెయ్యడం మన వాళ్ళకి ఆచారం. చదువురానివాళ్ళకి ఎలా మరి? అందుకే విజ్ఞులకు, విద్యార్థులకు, పండితులకు, పామ రులకు సూక్ష్మంలో మోక్షం ప్రసాదించే దివ్య సాధనంగా 'సంపూర్ణ రామాయణం' వర్ణ చిత్రం నిర్మితమైంది.

పురాణ గ్రంథాలన్నింటిలోకి విలువైనది, ప్రశస్తమైనది, పూజింపదగినది 'రామా యణం' అలాటి ఉత్తమ కథను నిడ మర్తి పద్మాక్షిగారు చలన చిత్రంగా రూపొం దించారు. ఆరుద్ర, ముళ్ళపూడిగార్ల సంయుక్త కలం బలం యీ చిత్రానికి జీవం కాగా, బాపూ దర్శకత్వం సన్నివేశాలకు ప్రాణం పోసింది.

## పాత్రలో లీనం !

శ్రీరాముడుగా శోభన్‌బాబు, రావణా సురుడుగా ఎస్వీరంగారావు, సీతగా చంద్ర కళ, దశరథుడిగా గుమ్మడి, కైకేయిగా జమున, మండోదరిగా కృష్ణకుమారి పురాణ పాత్రల్లో లీనమై నటించినట్టు తెలు స్తుంది.

ఒక దృశ్య కావ్యమా అనిపించేంత అందంగా తయారు కావడానికి కె. ఎస్. ప్రసాద్, రవికాంత్, కె. వి. మహదేవన్, ఏ. కే. శేఖర్, బాపూ ఎంత కృషి చేశారో చిత్రం చూస్తే మీకే బోధపడుతుంది. లక్ష్మి పిలింస్ పంపిణీదారులీ చిత్రానికి.

## అబ్బాయిగారు — అమ్మాయిగారు

డి. బి. నారాయణ చిత్రాల్లో ప్రత్యే కత కనిపిస్తూ వుంటుంది. ఆయనకి మంచి టైటిల్స్ కూడా దొరుకుతాయి. 'అమర సందేశం' దగ్గర్నుండి యిప్పటి 'అబ్బాయి గారు—అమ్మాయిగారు' వరకు పరీక్షిస్తే, అన్ని చిత్రాలు ఆయనకి మినిమమ్ వసూ ళ్ళని తెచ్చిపెట్టే ప్రభావం కలిగివుండేట్టు, ఏదయినా అదృష్టరేఖ ఆయన హస్తంలో వుందా అనిపిస్తుంది.



'మాయింటి వెలుగు'లో వెన్నెలడై నిర్మల,

## సరికొత్త కథ

ముళ్ళపూడి వెంకట రమణ వ్రాసిన సరికొత్త కథే 'అబ్బాయిగారు—అమ్మాయి గారు.' ఈ కథలో వాణిశ్రీ, గీతాంజలి ధరి స్తున్న పాత్రలు ఉదాత్తమైనవి. ఇద్దరూ ఒకరికోసం మరొకరు త్యాగం చెయ్యడానికి సంసిద్ధమవుతారు. తనకు చెందిన బావను ఒక సామాన్య యువతికి భర్తగా యిచ్చిన ఒక త్యాగమయి పాత్రను వాణిశ్రీ అద్భుతంగా పోషిస్తుందట. మరొక స్త్రీకి చెందవలసిన వ్యక్తిని తను భర్తగా పొందినా, విధివశాత్తు ప్రాణాలను వీడిన యువతిగా గీతాంజలి నటిస్తుంది. కథా నాయకుడిగా కృష్ణకు యిదొక వెరైటీ పాత్ర. నటనలో క్వాలిటీ కనిపిస్తుందట. పద్మనాభం నవ్వుల వర్షం కురిపిస్తాడు. అల్లు రామలింగయ్య—సరోజ దంపతులుగా నటిస్తున్నారు మొదటి సారిగా. ఈ చిత్రానికి మద్దిపట్ల సూరి మాటలను, వి. ఎస్. కృష్ణారావు ఛాయను నిర్వహిస్తున్నారు.

'అమ్మమాట' దర్శకత్వం బాగుంది, అని ప్రజలచే ప్రశంసింపబడుతున్న వి. రామచంద్రరావుకు "అబ్బాయిగారు—అమ్మాయిగారు" కూడా అలాంటి పేరును తెచ్చి పెడుతుందని ఆశించవచ్చు.

—శ్రీనివాస్ ●

# పుస్తకాలు

**రెండు నవలలు :**

**1. అసమర్థుని జీవయాత్ర:** రచన: శ్రీగోపీచంద్. 164 పేజీలు.

**2. నవదేవత:** రచన: శ్రీ వి. ఎస్. రంగస్వామి 208 పేజీలు. ఇవి ఎమెస్కో పాకెట్ నవలలు. ఒక్కొక్కటి రెండేసి రూపాయలు. ప్రచురణ ఎం. శేషాచలం అండ్‌కో., మచిలీపట్నం—మద్రాసు—సికింద్రాబాదు.

పురాణాలను గురించి చెబుతూ,అవి ఏదృష్టితో చూస్తే ఆవిధంగా అర్థమవుతాయని అంటారు. ఈ మాటే నిజమైతే, ఇది అనేక దృక్పథాలను ప్రదర్శించే రసాత్మకమైన కొత్తరకం నవల.

అన్ని విధాలా అసమర్థుడయిన సీతారామారావు కథానాయకుడు, అతడికి గురుతుల్యుడు రామయ్య తాత, ఈ గురుశిష్యులపరంగా ఎన్నో సత్యాలు —హేతువాద బద్ధమయిన యథార్థాలు లోకానికి వెల్లడి అవుతున్నాయి.

జీవితం చేతుల్లో కీలుబొమ్మ అయినసీతారామారావు అనుకున్నట్లు ఒక్కటీ జరగదు. మేనమామ తనని మోసగించి ఆస్తి కాజేసినా, భార్య ఎదురుతిరిగి ప్రతికూలమైనా, అతడిఆదర్శాలు మట్టిమయ్యాయి, ప్రతాపమంతా బుగ్గిలో కలిసింది. చివరి కొక మీటింగులోకి పిలవని పేరంటంగా చొరుచుకు వెళ్ళాడు. అక్కడ సమావేశమయిన పెద్దలందరి వైఖరులనూ పేరు పేరునా నోటికి వచ్చినట్లల్లా ఖండించే సరికి నలుగురూ కలిసి పచ్చడి చేసి వదిలారు. శ్మశానం చేరుకున్నాక—కొనప్రాణాలు ఎగిరిపోయేదాకా తన హేతువాదాన్ని అమలు చేస్తూనే వున్నాడు, సీతారామారావు.

దీన్ని నవల అనడంకంటే ఒక గొప్ప వచన కావ్యమంటే బాగుంటుంది. ఇందులో చర్చనీయాంశాలు మానవ జీవితాన్ని ఎంతెంత లోతులకు తీసుకు పోతాయో చెప్పలేం. పుస్తకం ఆద్యంతమూ మనసుకి హత్తుకునే మహా వాక్యాలతో నిండి వుంది మచ్చుకి కొన్ని——

54—ఇంతమంది మేధావులున్నారు గదా ప్రపంచంలో— ఒక్కరైనా అన్నం తెలిగ్గా దొరికే పద్ధతి ఎందుకు కనిపెట్టరూ?

91—పరిస్థితులు మార్చుకోవాలంటే ముందు మార్చుకోవాలనే బుద్ధి కలగాలి! అలా బుద్ధి కలగాలంటే పరిస్థితులు మారాలి.

93— ఈ ఆడవాళ్ళతో మంచిగా వుంటానికి ప్రయత్నిస్తే లోకువ. మొదట అలుసిచ్చినందుకు ఇప్పుడను భవిస్తున్నాను చాలు.

102— మానవులు పశువులకు ఎంతదగ్గర్లో ఉన్నారో అనుక్షణం జ్ఞాపకం చేస్తుంది ఆడజాతి.

110—రచయిత గొప్పదనం మరణించడం మీద ఆధారపడి వుంటుంది.

115—ఆడవాళ్లను తగిలించుకోవటం తేలికే, వొదిలించు కోవటం బ్రహ్మప్రళయం.

120— చావదలచిన వాళ్ళకి కోర్కెలుండటం మంచిది కాదు, బాబూ! కోర్కెలున్న వాడు చావటానికి అర్హుడుకాడు.

125— ఆలోచిస్తున్నది తలలోని మెదడు. నడుస్తున్నవి కాళ్ళు. మెదడు చెప్పినట్లు చెయ్యాలని ఎక్కడుంది? అతని ఆవయవాలకుసంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చింది. దేని ఇష్టం దానిదే. ఒకదాని మీద ఒక దానికి పెత్తనం లేదు.

132—మనం పుట్టటం నిజం, చావటం నిజం, మధ్యని బ్రతకటం నిజం. పుట్టటం చావటం మన చేతుల్లో లేదురా, ఇక బతకటం ఒక్కటేరా మిగిలింది.

156— శ్మశానానికి పాక్షిక బుద్ధి లేదు. అందర్నీ సమానంగా చూస్తుంది.

ఇది నిజంగా ఒక అనర్ఘరత్నమే మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే చదివి తీరవలసిన నవల.

* * *

ఈ ఉద్యోగం లేకపోయినా మా నాన్నగారికొచ్చే పెన్షన్‌తో మేము గడపగలం సార్!పాపం కరుణాకరరావు అవిటివాడూ నిస్సహాయుడూ కనక—ఉద్యోగం ఆయనకే ఇవ్వండి అంటూ అర్థించింది, మేనేజింగ్ డైరక్టర్ని ఒక అభ్యర్థిని.

కరుణాకరరావు మీద సుశీలకు ఎంతటి మమత—మమకారం, ఆదరం —అభిమానం పుట్టుకొచ్చాయో , సుశీలపైన మేనేజింగ్‌డైరక్టరుకూ అంతటి గౌరవ భావమే ఏర్పడింది. ఫలితంగా—రికమెండు చెయ్యబట్టి హర్ కూడా సుశీలకూ, కాళ్ళులేని కరుణాకరరావుకీ — ఇద్దరికీ ఉద్యోగాలు లభించాయి.

అవిటివాణ్ణి చూస్తే ఎవరికయినా జాలి కలుగుతుంది. సహజమే. కాని తొలి చూపులోనే సుశీలకు కరుణాకరంపైన మమకారం ఆదరాభిమానాలు పుట్టుకురావడం వింతగా తోచదా?

సుశీలకు ఉద్యోగమిచ్చిన వరప్రసాదరావు కొడుకు సుశీలను ప్రేమిస్తాడు. కాని, పేదవాడయిన కరుణాకరాన్నే ప్రేమించి పెళ్ళాడుతుంది. సుశీల. సుశీల తన కొడుకుని చేసుకోకపోయినా వరప్రసాదరావు పట్టించుకో లేదు. పైగా, తన చిన్న భార్య కోరికను బట్టి తన కంపెనీలో కొన్ని వాటాలు సుశీల పేరునబెట్టి మరిన్ని బాధ్యతలు ఆమెకు అప్పజెపుతాడు.

దీనికి తోడు—ఇంటిపోరూ, బయటపడిచే అపోహలూ తట్టుకో లేక సుశీల జవతపాల్లో పడి, ఉపవాసాలు ప్రారంభిస్తుంది. నిలకడమీద నిజం బయట పడే సరికి ఆమె హరీమన్నది. ఆమెతో భర్తకూడా మానవత్వాన్ని అగ్నిపరీక్షకు పెట్టిన నవదేవత సుశీల అసాధారణ గాథ ఇది.

స్వయంకృషి తో సినీరంగంలో గొప్ప అనుభవం గడించినవారు ఈ నవలా రచయిత. కథ వెండి తెరకు ఎక్కతగిన ఫక్కీలో నడిచింది. కనుక, ఇది చిత్రంగా తయారయ్యే అవకాశముంటే, రచయిత ప్రజ్ఞ ఇంకా రాణిస్తుంది.

—శివకుమారి




జంషెడ్‌పూర్ కళానిలయ జనవరి 25, 29, 30 తేదీలనాడు తృతీయ వార్షికోత్సవాలు జరుపుకున్నారు. ఈ సందర్భంలో 'టెల్కో' కర్మాగారం డెప్యూటీ జనరల్ మేనేజర్ శ్రీ ప్రభు జ్యోతి వెలిగిస్తున్న దృశ్యం.

# పుస్తకాలు

## రెక్క విప్పిన రివల్యూషన్

మూలం ఏంజిలో కాట్రాచ్చీ, అనువాదం: శ్రీశ్రీ ప్రచురణ: ఉద్యమ సాహితి, కరీంనగర్ వెల: రూ. 2—00.

నిప్పుగాక మొన్న ఫ్రాన్స్‌లో మరో రెవల్యూషన్ రెక్క విప్పింది. ఆకథ యీ పుస్తకంలో ఉన్నది ఈ విప్లవాన్ని ప్రారంభించిన వాళ్లు కుర్రాళ్లు. ధన స్వాముల సంతతివాళ్ళు. వీళ్లే తమ తల్లి దండ్రుల వ్యవస్థమీద తిరగబడ్డారు. ఈ విప్లవాన్ని నిర్దాక్షిణ్యంగా అణచడం జరిగింది. 1905 లో ఓడిపోయిన విప్లవం 1917 లో జయించింది.

ఇంగ్లీష్‌లో యీ రచన పేరు 'ది బిగినింగ్ ఆఫ్ ది ఎండ్'. దీనికి అనువాదం 'పరిసమాప్తికి ప్రారంభం' ఈ రచనలోని వర్ణన భాగాన్నిమాత్రమే శ్రీశ్రీ అనువదించారు. జరిగిన సంఘటన మీద ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్ళు వ్యాఖ్యానించుకోవచ్చునని శ్రీశ్రీ అభిప్రాయం.

ఈ రచనలో శ్రీశ్రీ వచనాశైలి కనిపించుతుంది. సూటిగా తగులుతుంది. చదువరుల హృదయాలకు.

అయితే మంత్రులకు కొద్దిగా మనస్సులు చివుక్కుమన్నాయి (7వ పుట) వంటి వాక్యాలు చాలా ఉన్నాయ్. మనస్సులు కొద్దిగా చివుక్కుమన్నాయి అంటే బాగుండదా? 'ప్రొఫెసర్ల ప్రశ్నల వల్ల బట్టలొలిపించుకున్న రాజులు' (7వ పుట) అనే బదులు 'ప్రశ్నలవల్ల బట్టలొలిపించుకున్న రాజులు ప్రొఫెసర్లు' అంటే తప్పవుతుందా? అర్థంలో తేడా వస్తుందా? ఎవరి శైలి వారిది ఫలానా రీతిలోనే మాత్రమే వ్రాయాలనే నియమమేమీ లేదుగదా.

వచన మంతా కవితా శైలిలో వ్రాసిన శ్రీశ్రీ ఇంగ్లీష్ మాటలను ధారాళంగా ఉపయోగించడంలో విశేషమేదో ఉండి తీరుతుంది. '11వ ఏప్రిల్ రూడీ కష్కెనిషూట్ చేశారు.' 'గొప్ప ట్రెయినింగ్ పొందిన వాళ్ళు' (13వ పుట)

శ్రీశ్రీ వాక్య రచనా శైలికి మచ్చుతునకలు: 'చేతి బాంబుల ధ్వనులు పోరాటపు సరిగమలు' (17వ పుట) 'వీధుల్లో కదంతొక్కి, పదం పాడేసమష్టి క్షేత్రం.' (21 వ పుట).

చరిత్ర గమనంలో జరిగే సంఘటనలను మార్క్సిస్ట్ దృష్టితో పర్శించాలనే అభిలాష గల తెలుగు రచయితలూ, వచన రచనా రీతులలో ఆసక్తి గల రచయితలూ చదివి ఆలోచించవలసిన రచన ఇది. ఈ అనువాద పర్ణనలో నిగూఢంగా ఉన్న అభిప్రాయాలకు అందరూ ఏకీభవించి తీరాలనేమీ లేదు గదా!

—వి. ఎస్. అవధాని

**1. బాలల బొమ్మల రామాయణము**

**2. బొమ్మల బాలల భాగవత కథలు**

**3. బాలల బొమ్మల భారతము**

వీటిలో మొదటి రెండు పుస్తకాల రచయిత శ్రీ యామిజాల పద్మనాభస్వామి. మూడవపుస్తకం రచయిత: శ్రీ రపూరి దొరస్వామిశర్మ. బాలల బొమ్మల రామాయణం వెల: రూ 3—50. బొమ్మల బాలల భాగవత కథలు వెల: మూడు రూపాయలు. బాలల బొమ్మల ' భారతం . వెల: రూ. 3—50 ప్రతులకు: బాలసరస్వతీ బుక్ డిపో, ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, 6, సుంకురామ చెట్టి వీధి. మద్రాసు—1.

ఈ మూడు పుస్తకాలలోను మొదటి రెండు పుస్తకాలు రచించిన శ్రీ యామిజాల పద్మనాభ స్వామిగారు వీలయినంత సులభ వ్యావహారిక శైలిలో డెమ్మీలో ఇంచుమించుగా 125 పుటలలో రామాయణము, భాగవతము బాల బాలికల కందించారు. ఇవి పది పన్నెండేళ్ల బాలబాలికలు తేలికగా చదువుకోడానికి వీలయిన పుస్తకాలు. ఇటువంటి పౌరాణికాలు పిల్లల కనువయిన పద్ధతిలో సంగ్రహంగా రచించడం చాలా కష్టమే. అయినా పద్మనాభ స్వామిగారు కృతకృత్యులయినారు.

ఇక మూడవ పుస్తకం రచించిన శ్రీ రాపూరి దొరస్వామి గారు మహాభారతం 18 పర్వాలు చాలా క్లుప్తంగా డెమ్మీలో 120 పుటలలో సంక్షేపించారు. వీరుకూడా సులభంగా వ్రాయడానికె ప్రయత్నించారు. అయితే గ్రాంథికంవంటి భాషలో డిచించినందువల్ల రచన కొంత క్లిష్టంగా పరిణమించింది. భారతంలో కొన్ని ముఖ్య ఘట్టాలు కూడా విడిచి పెట్టడం జరిగింది.

ఇటీవల బాల సాహిత్యం కొంత ఎక్కువగానే వెలువడుచున్నది. దీనిలో పౌరాణికగాథలు కూడా ఎక్కువే. అయితే ఇటువంటి పౌరాణికాలకు సంబంధించిన బొమ్మలు వేసేటప్పుడు అవి ఉదాత్తంగా ఉండేటట్లు జాగ్రత్తపడాలి. భాష కూడా బాగా తేలికగా ఉండాలి.

—శాస్త్రి

## ది మలబార్ హెరాల్డ్ 67 త్ ఏన్యువల్

ది మలబార్ హెరాల్డ్ 67త్ ఏన్యువల్ మలబార్ హెరాల్డ్ ప్రెస్, జెనర్జీ కలూర్ క్రాస్‌రోడ్, ఎర్నాకులమ్ నార్త్, కొచ్చిన్—18, వెల రు 1—50.

కేరళ వారపత్రిక ది మలబార్ హెరాల్డ్ వారు వెలువరించిన ఈ సంచికలో జనరల్ కరియప్ప, ఆర్. ఆర్. దివాకర్, ఫెగార్డ్, హామీతల్యార్‌ఖాన్, సి జె. జార్జి మొదలయినవారి వ్యాసాలు ఉన్నాయి. ఈ సంవత్సర సంచికలో షిప్పింగ్ కి సంబంధించిన ప్రత్యేక వ్యాసాలు ఉన్నాయి.

(ఒ. న.)

## రంగజ్యోతి

డాక్టర్ చంద్రశేఖరం సంపాదకత్వంలో వెలువడిన రంగజ్యోతి మాస పత్రిక (ఫిబ్రవరి) ప్రారంభ సంచిక మా కార్యాలయం చేరింది. 48 పేజీలుగల ఈ పత్రిక వెల ఒక్కరూపాయి. ప్రతులకి యితర వివరాలకి రంగజ్యోతి, 5, సీతమ్మరోడ్, ఆళ్వారుపేట, మదరాసు—18కి రాయాలి.

## శ్రీ వేంకటేశ సుప్రభాతము

శ్రీ మద్దాలి శ్రీరామచంద్రమూర్తి అనువదించిన శ్రీ వెంకటేశ్వర సుప్రభాతము మాకార్యాలయం చేరింది. 20 పేజీల ఈ పుస్తకం వెల 50 పైసలు. ప్రచురణ: శ్రీ మద్దాలి పేర్రాజు కరణము దుర్గాడ,తూ.గో. జిల్లా. ●

---

## బెల్ బాటం షర్టు

(31వ పేజ తరువాయి,

ఇంత వెడల్పున్న కాలరుని రెండుమడతలు వేసి—బటన్సుపట్టీ దగ్గర—సూదిదారంతో ఊడిరానంత గట్టిగా టాకాలు వెయ్యండి. తరువాత—ఎడంవయిపు కాలరుకింద కుడివయిపు కాలర్ని రెండు 'హుక్సు'తో అతికి ఒక ఆకారానికి తెచ్చుకోవచ్చు—చివరివరకు దగ్గరగా హుక్సు వేసుకుంటూ వెళ్లి— అడగున ఒకంగుళం వెడల్పున హెమ్మింగ్ వెయ్యండి—

కొలతలు. ఎదురు భాగం:— పొడవు 18 అం ఛాతీ వెడల్పు 15 అం. షోల్డరు 10 అం. మెడ పక్క భాగం 2 అం. దిగువ భాగం 2 అం. చేతుల కత్తిరింపు (ఇది వెనుకభాగంకన్న అరంగుళం పొట్టిగా వుందని గుర్తించాలి) 4 అం.

వెనుక భాగం కొలతలు: పొడవు $18\frac{1}{2}$ అం. వెడల్పు 15 అం. షోల్డరు $10\frac{1}{2}$ అం. చేతికత్తిరింపు 5 అం. మెడ ప్రక్కభాగం 2. దిగువ $1\frac{1}{2}$ అం.

చేతులు—11 అంగుళాల వెడల్పు (8) ఎనిమిది అంగుళాల పొడవువున్న (రెండు మడతల్లో వుండాలి — రెండు చేతులు గనుక) ముక్కని జాగ్రత్తగా బొమ్మచూసి డ్రాయింగ్ వెయ్యాలి. చేతి చివర 11 అం. భుజాల అతుక్కునే దగ్గర 10 అం. వస్తుంది. (చేతి గుండ్రం) $2\frac{1}{2}$ అం. తగ్గింపు—చేతిచివర $\frac{1}{2}$ అం. ప్రమాణంలో బొమ్మలోలా షేపు కత్తిరించండి.

— కృష్ణప్రియ ●

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.
Editor : S. Sambhu Prasad.

మరులుకొలిపే
అవకాశము!



# మద్రాసు
# న్యూయార్క్
# మద్రాసు
# రు. 4815 మాత్రమే!

మీరు వేలలో డబ్బు ఆదాచేసుకోండి.
నేరుగా న్యూయార్క్‌కు ప్రయాణము చెయండి.
14 రోజులంత తక్కువ కాలము లేక 120 రోజులంత ఎక్కువ కాలము గడపండి. వయస్సు అర్హతలు లేక గ్రూపులలో వెళ్లాలనే నిర్బంధము లేదు. ఈ అవకాశము సంవత్సరమంతా ఉంటుంది. మీ దగ్గరలోనున్న ఎయిర్-ఇండియా ఆఫీసును లేక మీ ట్రావెల్ ఏజెంటును సంప్రదించండి. నేడే.

| మొదలయే స్థలము | విలాస ప్రయాణపు చార్జీలు, న్యూయార్క్‌కు మరియు తిరుగు ప్రయాణమునకు |
|---|---|
| బొంబాయి | రు. 4125 |
| న్యూ ఢిల్లీ | రు. 4125 |
| కలకత్తా | రు. 4875 |
| మద్రాసు | రు. 4815 |

**ఎయిర్-ఇండియా**

మీకు డబ్బు పొదుపుచేకూర్చే ఎయిర్‌లైన్

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.